# ఆంధ్రసచిత్రవారపత్రిక



25 నయాపైసలు

20-8-58

**ANDHRA PATRIKA**
**ILLUSTRATED WEEKLY**




స్వతంత్ర భారతికి మంగళహారతి

—చిత్రకారుడు : రావు. వెంకటరావు.]

సంవత్సర చందా
రు 13-0-0
విడిప్రతిక 25 న పై



సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 52
20-8-58

Founder K. NAGESWARA RAO

విలంబి శ్రావణ శుద్ధ షష్ఠి బుధవారం

ముఖచిత్రం:
దుర్గా పిక్చర్స్‌వారి 'పతిభక్తి'లో
జెమినీ గణేశన్, సావిత్రి.



# ఉత్పత్తిశక్తి అభివృద్ధి

భారతదేశం స్వతంత్రమై పదకొండు సంవత్సరాలు గడిచాయి కొన్ని శతాబ్దాలుగా పరదేశీయుల పాలనలో ఉండి అన్ని రంగాలలోనూ వెనుకబడిఉన్న భారతదేశం వంటి దేశాలలో పదకొండేళ్ల స్వాతంత్ర్యం పరిగణించదగిన చరిత్రే కాదు అయినా ఈ పదకొండేళ్లలోనే భారతీయుల అకుంఠిత దీక్ష, ఉత్సాహం, చైతన్యం ఫలితంగా జాతీయ, అంతర్జాతీయ రంగాలలో భారత దేశం అనేక విజయాలు సాధించింది స్వయంసమృద్ధిని, జాతీయసంపద అభివృద్ధిని సాధించటానికి పంచవర్ష ప్రణాళికలు మహత్తర సాధనాలై ప్రజల శ్రమశక్తిని ఏకోన్ముఖం చేస్తున్నాయి

దేశ ఆర్థికాభివృద్ధి ముఖ్యంగా ఉత్పత్తి పెరుగుదలమీద ఆధారపడిఉంది ఉత్పత్తి పెరుగుదలకు కార్మికుల ఉత్పత్తిశక్తిని పెంపొందించటం ముఖ్యమార్గం భారతదేశం కార్మికుల ఉత్పత్తిశక్తిలో పాశ్చాత్య దేశాలకంటే చాలా వెనుకబడిఉంది భారత ప్రభుత్వం ఈ విషయాన్ని గురించి ఇప్పుడిప్పుడే ఈ లోపాన్ని తొలగించి, ఉత్పత్తి పెరుగుదలను సాధించటానికి సర్వతోముఖ కృషి చేస్తోంది

కార్మికులూ, యజమానులూ ప్రభుత్వమూ ఉమ్మడిగా జరిపిన కృషి ఫలితంగా, ప్రపంచంలోని పలుదేశాలలో ఉత్పత్తుల పెంపుదల ఉద్యమం నిర్వహించబడుతోంది

జపాను, బ్రిటనులలోనూ, యూరోపియన్ దేశాలలోనూ ఉత్పత్తి శక్తి పెంపుదల వ్యవస్థలు రకరకాల పేర్లతో పని చేస్తున్నాయి ఐరోపా ఆర్థిక సహకార వ్యవస్థ ఆధ్వర్యంక్రింద ఐరోపా దేశాల ఉత్పత్తుల పెంపుదల సంస్థ పనిచేస్తోంది ఈ సంస్థ ప్రభుత్వాలకూ, పారిశ్రామిక సంస్థలకూ, వ్యవసాయ పరిశోధనా విభాగాలకూ, ప్రైవేటు వ్యాపారులకూ తగు సూచనలిచ్చి ఉత్పత్తులను పెంపొందించడానికి దోహదం చేస్తోంది

భారతదేశంలో భారత గణాంక సమాచారసంస్థ, అహమదాబాదు జవుళి పారిశ్రామిక పరిశోధనా సంస్థ, ఇతర యాజమాన్య సంస్థలూ యీ రంగంలో ప్రాథమిక కృషి కొనసాగించాయి. అంతర్జాతీయ కార్మిక వ్యవస్థకూడా యీ విషయమై పరిశీలన జరిపి, సాంకేతిక సహాయ కార్యక్రమంక్రింద కొన్ని పథకాలను నిర్వహిస్తోంది.

ఈ ఏడాది ఫిబ్రవరిలో అవతరించిన జాతీయ ఉత్పత్తి పెంపుదలసంస్థ కూడా జాతీయ స్థాయిలో ఉత్పత్తి పెంపుదల పథకాలను రూపొందించి, అమలుజరుపుతోంది ఇది స్వయం నిర్ణయాధికారాలుగల సంస్థ ఈ సంస్థలో యజమానులకూ, కార్మికులకూ, ప్రభుత్వానికీ సమాన ప్రాతినిధ్యం ఉంది ఒక్కొక్క వర్గానికి 11 గురు సభ్యుల చొప్పున యీ సంస్థలో ప్రాతినిధ్యం కల్పించబడింది సాంకేతిక నిపుణులనూ, విజ్ఞానులనూకూడా సభ్యులుగా చేర్చుకునేందుకు యీ సంస్థకు అధికారం ఉంది



రాష్ట్రపతి

ఈ సంవత్సరం బెంగుళూరులో ఉండి స్వాతంత్ర్య వార్షికోత్సవంలో పాల్గొంటున్నారు

ఉత్పత్తికీ, వనరులకూగల నిష్పత్తినే ఉత్పత్తిశక్తి అంటారు వనరులంటే సిబ్బంది, పెట్టుబడి, యంత్రసాధనాలూ, ముడిపదార్థాలూ అన్నమాట ఈ నిష్పత్తినే మనిషికింత ఉత్పత్తి అనీ లేదా గంటకింత ఉత్పత్తి అనీ తరుచు పేర్కొంటారు. అయితే కార్మికులు వనరులలో ఒక భాగం మాత్రమే కాబట్టి, ఉత్పత్తిని కార్మికుల పనిగంటలతో ముడిపెట్టడంవల్ల ఉత్పత్తి శక్తిని సరిగా చెప్పినట్లు అవదు

ఉత్పత్తి శక్తి అంటే ఉత్పత్తి అనికూడా అనుకోరాదు ఉత్పత్తిశక్తి లెక్కల ప్రమేయం లేకుండానే ఉత్పత్తి పెరగవచ్చును ఒక ఫ్యాక్టరీలో వందమంది మనుష్యులు కలిసి రోజుకు 10 పంకాలు, మరొక ఫ్యాక్టరీలో 125 గురు మనుష్యులు కలిసి రోజుకు 10 పంకాలూ ఉత్పత్తి చేశారనుకోండి ఈ రెండు ఫ్యాక్టరీలలోనూ ఉత్పత్తి సమానమే అయినా, మొదటి ఫ్యాక్టరీ ఉత్పత్తిశక్తి రెండవ ఫ్యాక్టరీ ఉత్పత్తిశక్తికంటే ఎక్కువ

సిబ్బందినీ, యంత్రసాధనాలనూ, పదార్థాలనూ శాస్త్రీయ పద్ధతులు అవలంబిస్తూ సక్రమంగా వినియోగించడంద్వారా ఉత్పత్తిని పెంపొందింప చేయడమే జాతీయ ఉత్పత్తి పెంపుదల సంస్థ లక్ష్యం. ఈ లక్ష్యాన్ని సాధించడానికి యీ సంస్థ అనేకవిధాల కృషిజరుపుతుంది నిర్వహణ పద్ధతులను గురించి శాస్త్రీయపరిశోధనలు జరిపిస్తుంది సాంకేతిక నిపుణులకు శిక్షణ ఏర్పాట్లు చేస్తుంది

ఈ సంస్థ కృషిని ప్రచారంచేసే నిమిత్తం ఈ సంవత్సరంలో దేశంలోని వివిధ ప్రాంతాలలో 15 స్థానిక ఉత్పత్తి పెంపుదల సంఘాలు నెలకొల్పబడనున్నాయి వీటిలో రెండింటిని ఇదివరకే బెంగుళూరు, కోయంబత్తూరులలో నెలకొల్పారు

శాస్త్రీయ పద్ధతులను అవలంబించడం కార్మికులకుకూడా ఎంతో లాభదాయకమవుతుంది వారికి పని గంటలు తగుతాయి. జీతాలు పెరుగుతాయి. ఉత్పత్తిశక్తి గరిష్ఠస్థాయిలోఉన్న దేశాలలో కార్మికుల వేతనాలు ఎక్కువగా ఉండడం గమనార్హం.

ఉత్పత్తిశక్తిని పెంపొందించడంవల్ల కార్మికులకు ఉద్యోగాలు పోతాయేమో అని కొందరు భయపడుతూ ఉండవచ్చు అయితే యీ ఉద్యమాన్ని అమలు జరిపిన దేశాల అనుభవాన్ని బటచూస్తే యీభయం నిరాధారమైనదని తెలుస్తుంది ఉత్పత్తిశక్తి పెరిగిందంటే ఉద్యోగస్థాయి పెరుగుతుంది కొత్త పరిశ్రమలు స్థాపించడానికి ఎక్కువ మొత్తం పెట్టుబడిగా సమకూరుతుంది ఇప్పుడు పనిచేస్తున్న పరిశ్రమలు కూడా విస్తృతమవుతాయి ఎక్కువమందికి ఉద్యోగం దొరుకుతుంది

ఉత్పత్తి పెంపుదల ఉద్యమం సఫలం కావాలంటే, యజమానుల కార్మికుల మధ్య సుహృద్భావం నెలకొనాలి, వాడకందారకు సరకుల ధరలను తగించి యజమానులకూ లాభాలను ఎక్కువ చేయడానికి కార్మికులు తోడ్పడుతున్నప్పుడు, అందుకు తగిన ప్రతిఫలాన్ని కార్మికులకు కూడా ముట్టజెప్పాలి కార్మికులకు వారి కోర్కెలను వ్యక్తీకరించుకునే స్వాతంత్ర్యమిచ్చి, వాటిని తగువిధంగా మన్నించాలి. అనుమానాలకూ, భయాలకూ తావు లేని వాతావరణాన్ని సృష్టించడమే ఉత్పత్తి పెంపుదల మండలి కర్తవ్యం. ★

# నాటివిందు-నేటిమందు

"కప్పురభోగి వంటకము
కమ్మని గోధుమపిండివంటయున్,
గుప్పెడు పంచదారయును
క్రొత్తగ గాచిన యాలనే పెస
ర్పప్పును గొమ్మనల్లనటి
పండులు నాలుగునైదు నంజులున్
అప్పలతోడ గ్రొంబెరుగు లక్ష్మణ
వజ్జులయింట రూకకున్"

ఇదీ శ్రీనాథుడు తన క్రీడాభిరామములో ఓరుగల్లులోని పూటకూళ్ళ యింటిలో ఒక రూపాయకు (మాత్రమే) పెట్టించిన భోజనం! ఆ రోజుల్లో యేమోగాని యీ రోజుల్లో అయితేమాత్రం వాడు తప్పకుండా దివాలాతీసి తీరతాడు. లేకపోతే మాటలా? పెసరపప్పు, అరటిపళ్లు, అప్పడాలు, అప్పుడు కాచిన ఆవునెయ్యి, ఇంకా నాలుగైదు నంజుళ్లు, సరిక్రొత్త పెరుగు (అంటే తోడు పెరుగు కాబోలు)– ఇంత భోజనంపెట్టి ఆ హోటలువాడు బాగుపడతాడా?—పోనీ పడతాడయ్యా! అసలన్ని పదార్థాలు తినగల్గిం దెవడు? మామూలుగా వాడు చేసిన మూడు నాలుగు పదార్థాల్లోనే ఒకటి రెండు వదలి పెట్టేస్తామయ్యో! పూర్తిగా తినివచ్చేవాళ్ళు యే ఒకళ్లిద్దరైనా వుంటారో వుండరో! రుచిగా లేవుగనక తినలేదంటారు కొందరు. లేకపోతే ఫలానా పుల్లిపాయకారం వేడి చేస్తుందనో, ఫలాన బెండకాయకూర వాతం చేస్తుందనో, అదీ కాకపోతే ఫలాన చేమగుంపలు అజీర్తి చేస్తాయనో, ఒంటికి పడవనో, యేదో చెబుతారు.. పోనీ ఒంటికి పడేవి, వాత పిత్త శ్లేష్మాలతో ప్రమాదంలేనివి, రుచిగా వుండేవి అయిన నాలుగు పదార్థాలు సరీగా కలుపుకు తినగలరా అని లేదు పప్పూ, కూరా కలుపుకుతింటే చాలు! పచ్చడికూడా కలిపితే 'టూ మచ్' బయటికి రాగానే సోడా, కిళ్ళీ, రిక్షా మంచి పరుపు చుట్టూ కావాలి! భుక్తాయాసం; నోట మాటకూడా రాదు.

ఇక్కడికే యిలా యేడుస్తుంటే, కప్పురభోగి వంటకం, కమ్మ గోధుమ పిండివంట, గుప్పెడు పంచదార కూడానట! ఆ కప్పురభోగివంటకం అంటే యేమిటో యింతవరకు నాకు తెలియదు. పైగా గోధుమ పిండివంట అందులోనూ కమ్మదనం! అసలు బియ్యపు పిండివంట చేస్తేచాలు. (ఇక్కడ "కమ్మదనం" అనేమాట వినిపించటానికే వీల్లేదు.) పోనీ, ఆ సంగతలా వుంచండి గుప్పెడు పంచదారేమిటి? భోజనంచేసే విస్తరిలో చిటికెడు ఉప్పు వడ్డించుకుంటారు గాని, గుప్పెడు పంచదార వడ్డించుకుంటారటండీ, యెవరైనా? తినాలనైనా?— పంచదార వీసె రూపాయన్నర అమ్ముతోంది. గుప్పెట్లో కనీసం అర్ధసేరున్నకటాకు పంచదారైనా పడుతుంది. అంటే దాదాపు మూడు అణాలు—గోవిందా!. పద్యంలో ప్రాసకోసం "గుప్పెడు" అన్నాడుగాని, లేకపోతే "దోసెడు" అనేవాడే—ఇటీవల ఒక బస్తీలో నేను చూసిన ఒక హోటల్లో యేమని వ్రాసివున్నదో చెప్పమంటారా?

## పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

"కాఫీ, టీ మినహా, పంచదార చిన్న స్పూను ఒకటికి 0-0-6"

అన్యాయం! పంచదారలోకూడా యీ హోటలువాళ్లు లాభం తియ్యాలని చూస్తున్నారు అయినా వాళ్ళనని ప్రయోజనమేముంది? మనకి బుద్ధివుండొద్దూ?

నేను భోజనం చేస్తుంటే మా అమ్మమ్మ అంటుంది "ఏమితిండిరా, మరీ పిట్టమెతుకులా? మా రోజుల్లో తవ్వెడుబియ్యం తలకి చాలేవిగావు" అని.

ఏంచేస్తాం? మనకు చేతనయింది అంతవరకే! మా తాతయ్య గుప్పెడు గుప్పెడు పూర్ణపు బూరెలనీ రెండుదవడల్లో రెండూ పెట్టి లెక్క లేకుండా వూది పారేసేవాడట. ఇప్పటికీ అలాటివాళ్ళు లేకపోలేదు. కాని స్టాండర్డు తగ్గిపోతోంది

అందుకే యీ హోటలువాళ్ళు అటూ ఇటూ కూడా బాగుపడుతున్నారు. మనకి ప్రొద్దున్నే కనీసం జతయిడ్డీ, పెసరట్టు, కాఫీ కావాలి ఈమూడూ కలిపి చేసేపని యేమిటయ్యా అంటే పదిగంటలకి మనం తినే ముప్పావలా భోజనంలో హోటలు వాడికి అర్థరూపాయి మిగిల్చిపెడతాయి. అంతేగాక సాయంత్రం సినిమాకు వెళ్ళాలని హడావుడిగా చేసేభోజనంకూడా అపకె చేస్తుంది.

అసలు వాళ్ళకత్తికి రెండువైపులాపదునే. ప్రొద్దుటి కూర రాత్రికి పచ్చడవుతుంది పప్పు సాంబారవుతుంది. మీల్సు సెక్షనులో మిగిలిపోయిన సాంబారు ఒకసారి పొయ్యెక్కి మళ్ళీ యిడ్లీతో స్నేహం చేస్తుంది; కాఫీ సెక్షనులో గారె, గట్రా వండగా మిగిలిన నూనె మీల్సుసెక్షనులో కూర "తిరగబోత"కి తయారవుతుంది పగలల్లా కాఫీసెక్షనులో మరిగి 'మిక్కిలించి' పోయిన పాలు తెల్లవారేసరికి డుకునితో మీల్సుసెక్షనులో "పెరుగు" అనేపేరు పెట్టుకుంటుంది; ఈ పెరుగులో కొంత భాగం మళ్ళీ కాఫీసెక్షనులో ప్రవేశించి, గారెలతో కలిసి "ఆవడ" అనే పదార్థానికి చోటిస్తుంది మీల్సు సెక్షనులో కప్పులలో తోడుపెట్టిన పెరుగు పైకి నిగనిగలాడుతూ తెల్ల పలుకులలో మంచిధీగూగా కనిపిస్తుంది ఓంచితే "లోడలోడ", శ్రీనాథుడి "దధి ఖండా"లకీ దీనికీ యేమాత్రం సంబంధం వుండదు

ఇక నెయ్యంటారా? చెప్పనే అక్కర్లేదు

మరి పోతే, అప్పడాలు—వీటిని గురించి చెప్పాలంటే మనవల్లకాదు. అసలివ్వి కూడా విశ్వామిత్ర సృష్టిలోనివే అనుకుంటూవుంటాను లేకపోతే అంత ఘోరంగా వుండవు వాటని సృష్టించటం, భక్షించటం కూడా ఆరవలకే చెల్లు ఈ హోటలువాళ్ళకి అవి చవకగా, రెడీమేడ్‌గా దొరుకుతాయి; ఇంకేంకావాలి, ఇష్టమున్నా లేకపోయినా మన మొహాన వేసి రుద్దుతారు. మరి బాగుపడకేంజేస్తారు?

మరి యింతా చేసి అతడు పాపం కట్టుకోడా?" అంటే "కట్టుకోడ"నే చెప్పాలి సాసుంది "ఎందుచేతా?" అంటే, అతడు రోజూ ప్రొద్దున్నే దేవుణ్ణి పూజిస్తాడుగనుక కనీసం డజను కొబ్బరికాయలు లక్ష్మీపటం ముందు కొడతాడు గనక రోజూ కొడతాడా? ఆహా! రోజూ కొడతాడు అదంతా భక్తేనా? అంతా భక్తి కాకపోయినా, యెల్లాగూ యిడ్డీ పచ్చడిలోకి కొబ్బరికాయలు కావాలి గనుక, ఆ కాయలన్నీ దేముడిముందే కొడతాడు. అందుచేత భుక్తీ,

ముక్తి—రెండూ లభిస్తాయి అందులోనూ యింకొక విశేషమేమిటంటే, అక్కడికి వెళ్ళి మనంకూడా యిడ్లీ ఆ పచ్చడిలోనే నంజుకు తింటాం గనక, ఆ పుణ్యంలో కొంత భాగం మనకీ రాకపోదని నానమ్మకం. (వడా-సాంబారుతో తింటే ఆ పుణ్యం రాదు)

* * *

అరటిపళ్ళట! లేరగా వున్నాయా, అరటి పళ్ళు మాత్రం? (మనం డబ్బులిచ్చి మనం కొనుక్కు వెడితేనే ఆ హోటలువాడు అదోక మాదిరిగా చూస్తాడు మనవంక) అసలు అరటిపళ్ళు మాత్రం మంచి వెక్కడ దొరికి ఛస్తున్నాయి? నాటికోమాటు పళ్ళకొట్టుకు వెడితే కొండముచ్చు లాంటి గెల ఒకటీ, గులాబ్‌జామ్‌లాంటి గెల ఒకటి, తుమ్మెద రెక్కలాంటి గెల వకటీ, దాని తాతమ్మ లాంటిగెల ఒకటీ—ఇవ్వి తప్పితే, చూడ ముచ్చటగా పండులాటి గెల ఒక్కటికన్పించదు గదా? "ఇంతకంటె మంచివి లేవా?" అని మనం అన్నాం అనుకోండి, "ఓ! వున్నాయండి, చూచోండి—అరేయ్, లోపల్నుంచి ఆ గెల తీసుకొచ్చి చూపించరా, అయ్యగారికి" అంటాడు అతడు అన్నదే తడవుగా ఆ కొట్లో కుఱ్ఱాడు గబగబా లోపలికి పరుగెత్తి సీలు వేసిన గెలఒకట బరబరా ఈడ్చుకొస్తాడు అది చేతబుచ్చుకుని, యిహ పూడదీయకుండానే మొదలెడతాడు, పాఠం "ఫస్టాను కాయండీ, రాత్రే చెట్టునుంచి దింపాం... కాయ వాత్రో జాయినా అలాగే వుండాలన్న మాట" అంటూ ప్రారంభించి, ఆఖరికి "దీన్ని కొట్టేకాయ ఈ మార్కెట్లోనే లేదు"పొమ్మంటాడు. సరే దానికేమొచ్చెతే, ధర చెప్పవయ్యా అంటే, ఆ గెల చేత్తో లేపి పుచ్చుకుని, దానికో పోజిచ్చి "మూడూ ముప్పావలా! పటుకెళ్ళిపోండి" అంటాడు—అసలు మనకొక్కవల్సింది డజనో అరడజనో "గెల మా కెందుకయ్యా—" అని మన మేదో చెప్పబోతుంటే అడ్డొచ్చి, "రెండొందల కాయుంటదండీ—వంద రెండుం బావలా అమ్మకనే అమ్ముతున్నాం-మీకొక్కబట్టి పావల్తక్కువ చాలుగు" (అక్కడికి మనమేదో అతడికి చుటమైనట్టు) అని, "అరేయ్, కటిచ్చెయ్యరా" అని ఆర్డరు చేస్తాడు. మనగోడు అతడు వినడు, బేరం కుదరనివ్వడు; అప్పుడే కటిచ్చెయ్య మంటాడు అతణ్ణి వదిలించుకు నేసరికి తాడు తెగుతుంది మొహంమీద ఎన్నో అన్ని అంట గట్టకుండా వదలడు—తీరా ఆ పళ్లు తీసుకుని ఇంటికివెడితే ఆడవాళ్లు నవ్వుతారు (మళ్ళీ మాట్లాడితే తిడతారు కూడా)

ఏ నిర్భాగ్యుడైనా కొనడితో అమ్మ దానికోసే సగానికి సగం రేటు కడిగి అతణ్ణి మనం ఏడిపిసాం బుద్ధి వక్రించి మార్కెట్టు కెడితే అతడే మనల్ని యేడిపిస్తాడు అంతెందుకు? వేసంగిలో హోటలు వాళ్లు అపనే చేస్తున్నారు. వాళ్లు డజను యే రూపాయిన్నరకో, ముప్పావలాకో మామిడిపళ్లు కొనటం; భోజనానికొచ్చిన ప్రతివాడికీ ఒకొక్క పండు తగిలించటం; పావలా వసూలు చెయ్యటం

బయట వేడా అర్ధణాకీ, మూడణాలకీ యిస్తానన్నా కాయల్ని వదిలిపెట్టి వచ్చిన మొగాడు కూడా ఇక్కడ పావలా యిచ్చి నిక్షేపంగా పుచ్చుకుంటాడు. అప్పుడుగాని జలుబునీళ్లు వదలవు గాబోలు..

కనీసం స్పెషల్ రోజునైనా అతడు అరటిపళు ఇవ్వడు. పోతే, స్పెషల్ ఒక "హాట్" అనో, ఒక "స్వీట్" అనో చేశా మంటాడు అన్ని హోటళ్ల సంగతి యేమోగాని, మా హోటల్లో మాత్రం "హాట్" అంటే "బజ్జీ!" అరటికాయబజ్జీ! సరీగా అర్ధగజం పొడుంటుంది పైన పిండిపూత నిండుగానే వుంటుంది, చేత బుచ్చుకుంటే మాసె కారుతుంది—సారీ—నూనె కారదు; డాల్డా! డాల్డా కారుతుంది నోటబెడితే-పిండివంటమీద ద్వేషంకూడా పుడుతుంది ఉప్పూ వుండదు, కారం వుండదు.. శ్రీనాథుడెప్పుడైనా మా హోటల్కి వచ్చి భోజనంచేసి వున్నట్లయితే, అలాంటి పద్యాలు జన్మలో వ్రాసేవాడు కాదేమో!

ఇక పోతే స్వీట్ అంటారా - సేమియా- లేకపోతే, అగదో "రవ్వకేసరి" అని అతడంటాడు నేను మాత్రం ఆ స్పెషల్ రోజున త్వరగా మజ్జిగ పోసుకుని లేచి వచ్చేస్తూ వుంటాను.

* * *

అదిసరే! "వాలుగునైను నంజాడుల్.." నంజుకోటానికేనా? లేకపోతే జనాభా లెఖ్ఖకోసమా? ఆ ఘటోత్కచుడైనా నంజుకోవటానికి వాలుగైదు చేయించుకునే వాడా? ఆ హిడింబితల్లి చేసిపెట్టేదా? అనినా సందేహం...నంజుకోటానికే వాలుగైదు వెరైటీలు కావల్సింటే, అసలు కలుపుకుతినటాని కెన్ని కావల్సి వుండాలి? అయితే శ్రీనాథుణ్ణి అడిగితే యెన్నైనా సప్లయి చేస్తాడనుకోండి (ఆయన సొమ్మేంపోయె? కొనాలా, పెటాలా?) నోటి కొచ్చిన పప్పులూ, కూరలూ, పులుసులూ చార్లూ—అన్నీ రాసి పారేస్తాడు ఆఖరికి లేనిపోని వన్నీ సృష్టించికూడా రాస్తాడు.. అసలు శ్రీనాథుడు అలాంటి పిచ్చి పిచ్చి కవిత్వాలన్నీ కట్టిపెటిపాకశాస్త్రకళాభివృద్ధికి పూనుకుంటే యెంతో బాగుండేదేమో! దేముడు అశ్రద్ధ చేసివుంటాడుగాని, లేకపోతే అలాంటి శ్రీనాథ విరచిత "పాకశాస్త్రము" అంటూ ఒక గ్రంథం పుటే వున్నట్లయితే దాన్ని యీసరికి యూనివర్సిటీ వారు శ్రీ యూనివర్సిటీనుంచి డిగ్రీక్లాసుల వరకూ నిర్బంధంగా చదివించాలని అన్ని కాలేజిలమీదా (మగవాళ్ల కాలేజీలు కాదండోయ్!) అంతు పెట్టివుండక పోయారా? ఈపాటికి మన ఆంధ్ర మహిళ లంతా పాకశాస్త్ర ప్రవీణులు కాకపోయారా?

* * *

కొత్తగ కాచిన యాల నేయి

ఈ రోజుల్లో క్రొత్తగ కాచి అవునెయ్యి కాదుగదా, గేద నెయ్యికూడా దొరకటం లేదు అసలు నెయ్యేది? అంతా వనస్పతి చక్కని జిడ్డు; సున్ని పిండికీ సబ్బులకీ మంచి దిమాండు. కూరలకీ అదే,

(48-వ పేజీ చూడండి)

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక




శరత్‌బాబు తరవాత బెంగాలీ రచయితలలో
అగ్రగణ్యుడుగా ప్రసిద్ధికెక్కిన
**మానిక్ బంద్యోపాధ్యాయ** రచించిన
"పుతుల్ నాచేర్ ఇతికథా" నవలకు
**మద్దిపట్ల సూరి** అనువాదం.....

## జీవన వేళ

ఆగస్టు 27 సంచిక నుండి సీరియల్‌గా వెలువడుతుంది
మీ కాపీ ముందే రిజర్వు చేసుకోండి.....



# బాలజగత్తు



ఆంధ్ర సచిత్ర వారపత్రిక ప్రారంభించిన బాలలసంఘంలో ఇప్పటికే కొన్ని వేలమంది బాల బాలికలు సభ్యులుగా చేరారు, ఏ రోజుకారోజు కొత్త సభ్యులు ఇంకా చేరుతున్నారు వారపత్రికలో ప్రకటించిందే తడవుగా ఇంత మంది సభ్యులు సంఘంలో చేరడం తెలుగు బాలబాలికల ఉత్సాహానికి ఒక ఉత్తమ నిదర్శనం వారందరికీ సచిత్ర వారపత్రిక అభినందనలను అందజేస్తున్నది, ముందు ముందు సంఘం నిర్వహించే కార్యకలాపాలలో కూడా ఇదే ఉత్సాహంతో ముందుకువచ్చి పాల్గొంటారనీ, వివిధ కార్యక్రమాలను జయప్రదం చేయడంలో పూర్తిగా సహకరిస్తారనీ కూడా ఆశిస్తున్నది

బాలలసంఘంలో సభ్యులుగా చేరుతున్న వారి పేర్లలో కొన్నిటిని మాత్రమే వారం వారం పత్రికలో ప్రకటించగలుగుతున్నాము వారానికి ఒకసారి ప్రకటించే పేర్ల సంఖ్యకంటే వారం వారం వచ్చి చేరే కొత్త సభ్యుల సంఖ్యే ఎక్కువగా వుంటున్నది. అందుచేత ఇప్పటి వరకూ జులై నెల మొదటిలో సభ్యులుగా చేరినవారి పేర్ల ప్రకటనైనా పూర్తి కాలేదు సాధ్యమైనంత త్వరలో పేర్ల ప్రకటన పూర్తి చేయాలని, అసలు కార్యక్రమానికి ఉపక్రమించాలనీ ఉద్దేశిస్తున్నాము

ఇక పోతే, సభ్యులుగా చేరదలచి దరఖాస్తులు పంపుతున్న వారికి ఒక చిన్న సలహా కొందరు మామూలు కాగితాలమీద దరఖాస్తు నమూనాలను వ్రాసి పంపుతున్నారు. అలాంటి దరఖాస్తులు చెల్లవు వారం వారం సచిత్ర వారపత్రికలో ప్రచురిస్తున్న అచ్చు దరఖాస్తులనే పూర్తిచేసి పంపించాలి

మరికొంతమంది బాల బాలికలు ప్రతి దరఖాస్తు అడుగునా వున్న తేదీని (ఫలానా తేదీవరకే ఇది చెల్లుతుంది అనే భాగం) కత్తిరించి, పాతదరఖాస్తులే పంపుతున్నారు అలాంటి దరఖాస్తులు కూడా చెల్లవని గమనించాలి. కాబట్టి ఆవిధంగా చెల్లని దరఖాస్తులు పంపిన సభ్యులు కొత్తవాటిని పంపితేనే వారిని సభ్యులుగా చేర్చుకోవడంగానీ, సభ్యత్వపు కార్డులు పంపడంగానీ జరుగుతుంది

మరో ముఖ్య విషయం, మరి కొందరు సభ్యులు పుట్టిన తేదీలు (సంవత్సరం, నెల, తేదీ) దరఖాస్తులలో ఇవ్వడం మరిచిపోతున్నారు. పాఠశాలల్లో చేరేటప్పుడు ఏ పుట్టిన తేదీని వేస్తారో ఈ దరఖాస్తులలో కూడా అదే తేదీ వేయాలి పుట్టిన తేదీలు సరిగా ఇవ్వని సభ్యులలో కొందరి పేర్లను వచ్చేవారం ప్రచురిస్తాము, ఆ జాబితాలో వున్నవారు తమ పుట్టిన తేదీలను సాధ్యమైనంత త్వరలో అందజేస్తే, వారికి సభ్యత్వపు కార్డులు పంపుతాము

సభ్యత్వపు కార్డులు తయారై వున్నవి, సభ్యులకు కార్డులు పంపడం ప్రారంభించాము. ఈ సంచిక మీకు చేరేనాటికి దాదాపు 15 వందలమందికైనా కార్డులు అందుతవి. చాలామంది సభ్యులు దరఖాస్తులలో తమ ఇంటి అడ్రసులు సరిగా ఇవ్వని కారణం చేత, కొన్ని కార్డులను ఆయా పాఠశాలల ప్రధానోపాధ్యాయుల చిరునామాలకు పోస్టు చేస్తున్నాము. కాబట్టి సభ్యులైన బాలబాలికలు తమ తమ ప్రధానోపాధ్యాయులను అడిగి ఆ కార్డులను తీసుకోవలసి వుంటుంది కార్డులను బాలబాలికలకు సక్రమంగా అందచేయడంలో ఉపాధ్యాయులు సహాయపడతారనీ, తమకిస్తున్న ఈ ప్రత్యేక శ్రమకు మన్నిస్తారనీ ఆశిస్తున్నాము.

ఇకమీద బాలల సంఘంలో సభ్యులుగా చేరే బాలబాలికలు కార్డును ఏ చిరునామాకు పంపితే తమకు సక్రమంగా, సులభంగా అందుతుందో దరఖాస్తుతో పాటు తప్పక తెలియజేయాలి. —భార్గవ]

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక
# బాలల సంఘం

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 1958 జులై 1-వ తేదీ నుంచి 'బాలలసంఘం' స్థాపించాము. జులై 1-వ తేదీ నాటికి 15 సంవత్సరాలవయస్సు నిండని, ఆరేళ్ళ వయస్సుకు తక్కువ గాని ప్రతి తెలుగుబాలుడూ, బాలికా సభ్యత్వం పొందవచ్చు. సభ్యత్వానికి రుసుమేమీ చెల్లించవలసిన పనిలేదు. తెలుగు బాలబాలికలందరూ వెంటనే సభ్యులుగా చేరి సచిత్ర వారపత్రిక అప్పుడప్పుడు నిర్వహించే చిన్న చిన్న పోటీలలో పాల్గొని "సంఘం" ఆశయాలను జయప్రదం చేయడానికి సహాయపడతారని ఆశిస్తున్నాము.

## గమనిక

పదకొండు మొదలు 15 సంవత్సరాలవరకూ వయస్సుగలవారిని 'A' వర్గంగానూ, ఆరు మొదలు 10 సంవత్సరాల వయస్సువరకూ గల వారిని 'B' వర్గంగానూ విభజించడం జరుగుతుంది

## ముఖ్య విషయాలు

సభ్యులుగా చేరదలచిన బాలబాలికలు చేయవలసిందొకటే. దీనితోపాటు ఒక సభ్యత్వపు దరఖాస్తును ముద్రిస్తున్నాము. అందులోని ఖాళీస్థలాలను మీ వివరాలతో జాగ్రత్తగా నింపి (కొట్టివేతలు, తుడుపులు వుండకూడదు) ఆ అచ్చు దరఖాస్తును చిన్నగా కత్తిరించి కవరులో

సంపాదకుడు,
ఆంధ్ర పత్రిక సచిత్రవారపత్రిక,
తంబుచెట్టివీథి, మద్రాసు-1

అనే చిరునామాకు పంపాలి. కవరుమీద వెనుకవైపు "సచిత్ర వారపత్రిక బాలల సంఘం" అని స్పష్టంగా వ్రాయాలి. మామూలు కాగితాలమీద వ్రాసిపంపే దరఖాస్తులను స్వీకరించము

ఒక్కొక్క దరఖాస్తుమీదా ఒక్కొక సభ్యుని, లేదా, సభ్యురాలి పేరుమాత్రమే వుండాలి. సభ్యత్వపు దరఖాస్తును సచిత్ర వారపత్రికలో సాధ్యమైనంతవరకు వారం వారం ప్రచురిస్తుంటాము

సభ్యులుగా చేర్చుకున్నట్లు ఒక్కొకరి పేరా విడివిడిగా ఒక్కొక సభ్యత్వపు కార్డును పంపుతాము. ఆ కార్డుమీద సభ్యత్వ క్రమాన్ని సూచించే ఒక సంఖ్య వుంటుంది. ముందు ముందు సభ్యులుగాని, సంఘంగాని జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆ సంఖ్యను ఉదహరిస్తూండడం జరుగుతుంది.

పదిహేనేళ్ళ వయస్సుపడి పూర్తికాగానే, ఆ తేదీతో బాలల సంఘంలో సభ్యత్వం దానంతటదే రద్దయిపోతుంది.

## లక్ష్యాలు

(1) సభ్యులుగాచేరే బాలబాలికలను ఆరుమొదలు పదేళ్ళవరకూ ఒక వర్గంగానూ (B), పదకొండు మొదలు పదిహేనేళ్ళ వరకూమరొకవర్గంగానూ (A), విభజించిఉభయ వర్గాలకూ విడివిడిగా అప్పుడప్పుడు రెండురకాల పోటీలు నిర్వహించి ప్రథమశ్రేణిలో నెగ్గేవారికి మాకుతోచిన బహుమతుల నివ్వడం. (ఈ విషయంలో పోటీనిర్వహణకర్తలదే తుదినిర్ణయం)

(2) సభ్యులలో వారివయస్సుకు తగినట్లుగా రచనాశక్తినీ, పఠనాశక్తినీ, కళాభిమానాన్నీ యథాశక్తి పెంపొందచేయడం

(3) చిత్రలేఖనం, నృత్యం అభినయం, గాత్రం వీణ, వయొలిన్ మొదలయిన లలిత కళలలోనూ, వ్యాయామక్రీడలలోనూ ప్రత్యేక అభిరుచీ, ప్రవేశం కనబరిచే బాలబాలికలను బహుమతులద్వారానూ తదితర విధంగానూ ప్రోత్సహించడం

(4) ఏ ప్రాంతంలో నివసిస్తున్నవారైనప్పటికీ తెలుగు బాలబాలికలందరిమధ్యా స్నేహ సమైక్యభావాలను పెంపొందజేయడం

(5) ఉన్నత పాఠశాలలలో చదివే విద్యార్థులకు ఉచిత విద్యార్థివేతనాలను బహూకరించడం (దీనికి సంబంధించిన వివరాలను ముందుముందు ప్రకటిస్తాము) ★

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
**బాలల సంఘం**
[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
**A** లేక **B**

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) .

ఏండ్లు : నెలలు :

పుట్టినతేదీ నెల, సంవత్సరం : జులై 1 నాటికి వయస్సు .

తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు

ఊరిపేరు జిల్లా, తాలూకా, పోస్టు [వీధి నెంబరు] ..

* చదువుతున్న తరగతి, లేక, ఫారము : ....

పాఠశాల పేరు ....

ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) :

ఆర్యా :

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలిగా చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1958] (సంతకము)

* మరా వి పాఠశాలలోనేగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: **20-8-58** | ఈ దరఖాస్తు **23-9-58** నాటికి మాకు చేరాలి |

# ★ కొందరు సభ్యుల పేర్లు ★

[ఆంధ్ర సచిత్ర వార పత్రిక బాలలసంఘంలో సభ్యులుగా చేరిన మరి కొందరిపేర్లను ఇక్కడ ప్రచురిస్తున్నాము ]

1 వంగల సంపత్ కుమార్ (ఏలూరు) 2 కిల్లంశెట్టి వెంకటప్పారావు (శ్రీకాకుళం) 3 మజి సత్యవతి (ఏలూరు) 4 ఎస్. కృత్తివ శ్రీరామకృష్ణ ప్రసాదురాజు (తణుకు, పశ్చిమగోదావరి) 5 కొల్లి సురేష్‌బాబు (ఖమ్మంమెట్టు) 6 కొండమూతా కుమారి (గుండుగొలను ప॥ గో॥) 7. పరాంకుశం వెంకటరాఘవేంద్రరావు (బరంపురం) 8. వతాంగజయ శ్రీబాయి (తాడిపత్రి అనంతపురంజిల్లా 9 మాధవరావు పండేప్పర్ (గుంటూరు) 10 కొమాండూరి చక్రపాణి (ఏలూరు, ప॥ గో) 11 శిరిపురపుకందాళ మునవాళ్ళస్వామి (పాలకొల్లు, ప॥ గో॥) 12 వి శంకరి (హైదరాబాదు) 13. సుందర రామకృష్ణరావు (నందిగామ, కృష్ణాజిల్లా) 14 బి సుధీర్ కుమార్ (హైదరాబాదు) 15. బొగుపలి దుర్గాప్రసాద్ (బాపట, గుంటూరుజిల్లా) 16. మహబూబ్ బాషా (గురజాల, గుంటూరుజిలా) 17 అందుకుల సుధాకర్ (హైదరాబాదు) 18 తిటవర్తి సుందర వేంకటసీతారామరాజ్యలక్ష్మమ్మ (అనపర్తి, తూ॥ గో॥) 19 మజిజోగి సత్యనారాయణమూర్తి (ఏలూరు, ప॥ గో॥) 20 వి. సీతాకుమారి (హైదరాబాదు).

21 ఏడిదుటి నాగరత్నం (పాలకొలు, ప॥ గో॥) 22 రాజులదేవు ఉదయశంకర్ (నిర్మల్ అదిలాబాద్ జిల్లా) 23 శేతిరెడ్డి రామసుబ్బమ్మ (కావలి, నెల్లూరుజిల్లా) 24 పాలంకి శారదాదేవి (కాకినాడ, తూ॥ గో॥) 25 కలవలపల్లి వెంకటరత్నకుమారిబాయి (కొత్తపూరు, విశాఖజిల్లా) 26 పాటిబండ సుగంధి కుంతలాంబి (గుంటూరు) 27 వేమూరు వెంకట సుబ్బలక్ష్మి (విజయవాడ) 28 కొమ్మజోస్యుల సూర్యప్రసాదరావు (గురిందాడ, శ్రీకాకుళంజిలా) 29 ఎస్. ఎస్ నీరజ (తిరుపతి) 30. అదంకి రమాదేవి (నర్సాపురం ప॥ గో) కొప్పరావూరి వెంకట సుబ్బారావు (చిలకలూరిపేట గుంటూరు జిల్లా) 32 తాత స్వర్ణకుమారి (సోంపేట శ్రీకాకుళం జిల్లా) 33 ద్రోణాదుల అనూరాధ (గుడివాడ కృష్ణాజిల్లా) 34 మధునాపంతుల అచ్యుతరామయ్య (కాకినాడ) 35. మధునాపంతుల వ్యాస వెంకట సుబ్బారావు (కాకినాడ) 36. మధునాపంతుల వెంకట సత్యనారాయణమూర్తి (కాకినాడ) 37. ధమిడిపల్లి సీతారామం (అమలాపురం, తూ॥ గో॥) 38 నాగిరెడ్డి ఇందిర (రాజమండ్రి) 39. తాడేపల్లి సూర్యవెంకట సుబ్బయ్య శర్మ (విజయవాడ) 40 కొట్రగడ్డ శేషమాంబ (గూడూరు, నెల్లూరుజిల్లా)

41. చుండూరి శ్రీనివాసరావు (విజయవాడ) 42 చుండూరి రామమోహన సాయిబాబు (విజయవాడ) 43. గమని సుబ్బారావు (రాజమండ్రి) 44 గమని రంగయ్య (రాజమండ్రి) 45 కె శశి రశ్మిచంద్ర (మద్రాసు) 46 వెంకటేశ్వరరావు ఇకటూరి (కాకినాడ తూ. గో) 47. ఎ వి రాజశేఖర్ (అనంతపురము) 48 కంచిబొట్ల పూర్ణానందశాస్త్రి (గుంటూరు) 49. కొమ్మ శశిరేఖ (కాకినాడ తూ. గో॥) 50 ఎం. వెంకటబంగారు (మద్రాసు) 51 ఉప్పలూరి వెంకటసుబ్బరాయశర్మ (విజయవాడ) 52, వి రామమోహనరావు (రూర్కీ, ఉత్తర ప్రదేశ్) 53 ఏడిదుటి మల్లికార్జునరావు (పాలకొలు ప॥ గో॥) 54 ప్రసూనాంబ (మాచెర్ల, గుంటూరుజిల్లా) 55 వి. రాఘవేంద్రరావు (రూర్కీ. ఉత్తరప్రదేశ్) 56 కటంగిరి బాలకృష్ణ (విజయనగరము) 57 అమాం లీలాకృష్ణరావు (ఏలూరు ప॥ గో॥) 58. యస్ మురహరిరావు (నెల్లూరు) 59. బోయనపల్లి పార్థసారధి (గుంటూరు) 60. డి. ప్రభాకరరావు (అర్వలగిర-తొండవల్లగొండజిలా)

61. అల్లాడి వెంకటరమణ (నెల్లూరు). 62 తూమాటి రాజేంద్రప్రసాద్ చౌదరి (తూమాటివారిపాలెం పోస్టు నెల్లూరు జిల్లా) 63 ఈచంపాటి వెంకట జ్యోతీబాయి (విజయవాడ) 64 కానుపలి బాలాంబ (ఏలూరు ప॥ గో) 65. బోయిపాటి లక్ష్మీకృష్ణప్రసాదురావు (కిష్కింధపాలెం గుంటూరుజిలా) 66 ఈమని పరమేశ్వరావు (విజయనగరము) 67 అర్వపల్లి సాంబశివరావు (గుంటూరు) 68 ముప్పవరపు శ్రీకృష్ణమూర్తి (మచిలీపట్నము) 69 మేళ్లచెరువు వెంకటశివ నాగేంద్రమారుతి ప్రసాద్ (కొల్లూరు గుంటూరుజిల్లా) 70 బలిజేపల్లి వెంకటరావు జోగారావు (రామభద్రపురము శ్రీకాకుళంజిల్లా) 71. ఎ రవిప్రకాశరావు (ఏలూరు ప॥ గో) 72 బూడవలి శ్రీనివాసత్యబాల (విజయవాడ) 73 బొమ్మకంటి వెంకటరావు ప్రసాద్ రావు (పెడన, కృష్ణాజిలా) 74. తంత్రవహి శ్రీ వెంకటేశ్వరులు (భీమడోలు ప॥ గో) 75 కోటమర్తి లక్ష్మి (రాజానగరము తూ॥ గో) 76. గవరకొండ బాల వెంకట కోటేశ్వరరావు (చిలుకలూరుపేట, గుంటూరుజిల్లా) 77 జువ్వల నరసింహారావు (పాలకొల్లు ప॥ గో) 78. దివి మారుతిరామ్ (గుడివాడ, కృష్ణాజిల్లా) 79 వేదా నాగరాజ వేంకటసుతేశ్వరరావు (గుంటూరు) 80. మల్లాది విజయసారధి (గుడివాడ, కృష్ణా జిల్లా).

81 సిష్టా భారతానంద్ (బాపట్ల, గుంటూరుజిల్లా) 82 చిటూరి అలివేలుమంగ తాయార్ (కాకినాడ, తూ॥గో) 83 సారంగు అనంతవెంకటకామేశ్వరరావు (రాజమండ్రి) 84 భీమవరపు శ్యామల శివప్రసాదరావు (సామరకోట, తూ॥ గో) 85 విష్ణుభట్ల శివశంకరశాస్త్రి (విజయవాడ) 86 కొల్లి సుబ్బారావు (దేవ ప॥ గో) 87 పమ్మంగి

# ★ కొందరు సభ్యుల పేర్లు ★

దుర్గాప్రసాదరావు (విజయవాడ) 88 ఆచంట వసుంధర (విజయవాడ) 89 నాగుబోయిన ఆంజనేయులు (రావినూతల గుంటూరు జిలా) 90 పాలెపు శ్రీ రంగశాయి (రాజమండ్రి తూ గో॥) 91 కె కుమార్ (చిలుకలూరిపేట గుంటూరుజిలా) 92 జె. శ్రీరాములు (ధర్మవరము, అనంతపురము జిల్లా) 93 సారంగం పద్మినీరావు (కాకినాడ తూ గో॥) 94 సి ఎమ్ జనార్దన శర్మ (కర్నూలు) 95 ఆతీ కనకమహాలక్ష్మి (ఎలమంచిలి విశాఖజిల్లా) 96 పట్నాల ఉదయ భాస్కర వెంకటరామ శాస్త్రి (విజయనగరము) 97 నవుడూరి మురళీ మోహనరావు (హైదరాబాదు) 98 అనంతాత్మకుల రత్నాజీరావు (మాచర్ల) 99 ఎం. వి రమణమూర్తి (బరంపురం) 100 చల్లా రామగోపాల్ (హాస్పేట. బళ్ళారిజిల్లా)

101 కట్టుమూడి వేంకట జగన్నాధరావు (విజయనగరము) 102 వేములకొండ అజంతా (బరంపురము) 103 రాళ్లపల్లి మనోరమాదేవి (విజయవాడ) 104 ఎం శివరామరెడ్డి (మైలపలి కడపజిల్లా) 105 జి ఎల్ కామేశ్వరరావు (కర్నూలు) 106 ఎం ఆర్ సూర్యప్రభ (దేవలంపేట-చిత్తూరు జిల్లా) 107 ఎం రామచంద్ర (కోడూరు కడపజిల్లా) 108 మొదలి ఫణిం జాకుమార్ (మదరాసు) 109 విష్ణుబొట్ల సీతారామాంజనేయులు (విజయవాడ) 110 గుండాల ఇందిరాదేవి (వెంకటగిరి, నెల్లూరుజిల్లా) 111. తాడాల మాధవరావు (కనకాలపేట తూ॥గో॥) 112 లక్ష్మిగంటి (సామర్లకోట) 113. వీరంబొట్ల అనూరాధాలక్ష్మి (పూనా) 114 మాకం నాగభూషణం (తాడిపత్రి అనంతపురం జిలా) 115 సలాది లతాదేవి (విజయవాడ) 116 గాడిరెడ్డి మోహనరావు (విల్యాలగూడెము, కృష్ణా జిల్లా) 117 కోత సాంబశివరావు (దుగ్గిరాల గుంటూరు జిల్లా) 118 సూరి పద్మావతి (రాజమండ్రి) 119 అనుమెళ్ల ఉదయ భారతి (నూతక్కి గ్రామము గుంటూరు జి) 120 రామచంద్రం ఊర్మిళాదేవి (టంగుటూరు గుంటూరుజిలా) 121 బటంకి ముదు కృష (రాజమండ్రి తూ॥ గో॥) 122 హెచ్ గిరి (రాజమండ్రి తూ॥ గో॥) 123. సముద్రాల రామమూర్తి (గుంటూరు) 124 ఆర్ సూర్యప్రకాశరావు (అనంతపురం) 125 ఇసుపాటి శ్రీకృష్ణ (బాపట) 126 ఆకెళ్ళ రత్నమాణిక్యం (దొంబివిలి, తానా జిల్లా) 127. శ్రీపాద కనకదుర్గ (విశాఖపట్నం) 128 కందుకూరి మల్లికార్జున లీలాప్రసాద్ (విజయవాడ) 129 గుదిబండి శాంతి (తాడేపల్లి గుంటూరుజిల్లా) 130 రూపావతారం హైమవతి (ప్రొద్దుటూరు కడపజిలా) 131 ఈమని శిరీష (విజయవాడ) 132 గడ్డం సరోజినీదేవి (విజయవాడ) 133 కన్నా వెంకటసుబ్బరావమ్మ (భట్టిప్రోలు గుంటూరుజిల్లా) 134 బొగవరపు సత్యనారాయణబాబు (కాకినాడ) 135 మధురకవి సదానందరావు (వాలేరు) 136 కేదారిశెట్టి సురేష్ (అమలాపురము తూ॥ గో॥) 137 మంగిపూడిసూర్యప్రభావతి (పెద్దాపురము తూ॥ గో॥) 138 పల స్వర్ణకుమారి (కొవ్వూరు ప॥ గో॥) 139 ముక్కా నరేంద్రనాథ గుప్త (గాంధ్రగంధి, నిజామాబాదుజిలా) 140 జేగా రవిశంకర రెడ్డి (మద్రాసు)

141 సి. రవీంద్ర (కర్నూలు) 142 ఉన్నవ వెంకటకోదండ రామవరప్రసాద్ (హైదరాబాదు) 143 వి వి శేషాద్రి అయ్యంగార్ (ఏలూరు ప॥ గో॥) 144. కళ్ళం రంగారెడ్డి (తాడేపల్లి, గుంటూరు జిల్లా) 145 బారు జయశ్రీ (విజయవాడ) 146 చెర్ల సుబ్రహ్మణ్యశాస్త్రి (కొకరపర్రు, (ప॥ గో॥) 147 మంగళంపలి లక్ష్మీనారాయణశర్మ (టాటానగరం, సింగ్‌భూం జిలా) 148 ఆండాళ్ శ్రీ పెరుంబూదూర్ (బొంబాయి) 149 ఆ మల్లయ్య (సికింద్రాబాద్) 150 హిందూపూర్ రవిసాద్ (కాకినాడ తూ గో) 151. గణగం శ్రీనివాసరావు (శ్రీకాకుళం) 152 కనుమూరి లక్ష్మి (దొండపర్తి విశాఖజిలా) 153 చిత్రపు విద్యాసాగర్ (పానగల్లుపోస్టు చిత్తూరుజిలా) 154 రెబ్బా విజయశ్రీ (మైలవరము కృష్ణా జిల్లా) 155 కస్తళి ఝాన్సీలక్ష్మీదేవి (కోణకంచి కృష్ణాజిలా) 156 వనతా ఆశలతాదేవి (వెంకటగిరి నెల్లూరుజిల్లా) 157 పెరకంటి కృపమూర్తి (హైదరాబాదు) 158. వారణాసి లక్ష్మీసుధా (రాజంపేట కడపజిల్లా) 159 ఎం వి కల్యాణి (వాల్తేరు) 160. ఎన్ నళిని (పురదాకోడ్డు ఒరిస్సా)

161 వెలండనారాయణరావు (సంగారెడ్డి (మేడక్ జిలా) 162 కె శంకర్ (హైదరాబాదు) 163 రాయవరపు లక్ష్మీదేవి (పెదాపురము తూ గో.) 164 తెప్ల ఓంప్రకాశ్ కలవకుర్తి (మహబూబ్ నగర్ జిలా) 165 అరికాట ఉమామహేశ్వరరావు (చీరాల గుంటూరుజిల్లా) 166 అందవోలు రామమోహన్ (సంగారెడ్డి మేదక్) 167 చలంచాల లీలావతి (కావలి నెలూరుజిల్లా) 168 కొవ్వల మంజులవాణి (గొల్లప్రోలు తూ గో) 169 ఓలేటి మనోరంజితం (మదనపలె చిత్తూరుజిలా) 170. మండపాక వెంకటసత్యనారాయణ మూర్తి (ఎండగండి ప గో) 171 వై నాగేశ్వర రావు (పెద్దకొత్తపలిపోస్టు గుంటూరుజిల్లా) 172 వేలమూరి దక్షిణామూర్తి (నెల్లిమర్ల విశాఖజిల్లా) 173 పూసర్ల శకుంతల (చోడవరము విశాఖజిల్లా) 174 అక్కినేని రామశేషగిరిరావు (దుగ్గిరాల గుంటూరుజిల్లా) 175. కారుమూరి సర్వేశ్వరరావు (నిడదవోలు ప॥ గో॥) 176 పవాల హేమాద్రిరావు (సుద్దపాడు గుంటూరుజిల్లా) 177 తెలాకుల నీలాస్మరణగుప్త (నిడమానూరు కృష్ణాజిల్లా) 178 జీమిడిపల్లి వెంకటరామము (అమలాపురము) 179 కుమారి వి సరోజనీ దేవి (ద్రోణాచలం కర్నూలు జిల్లా) 180 ముక్తాపురం రామకృష్ణప్రసాద్ (ధర్మవరము అనంతపురముజిల్లా)

181 ములకలూరి వెంకట వరలక్ష్మీదేవి (నరసారావుపేట గుంటూరుజిల్లా) 182 మాడిరాజు రాధాకిషన్ (ఖమ్మం మెట్టుఖమ్మం జిల్లా) 183 ఆలూరి వెంకటరాజ్యలక్ష్మి (విజయనగరము విశాఖజిల్లా) 184 వనమాల సత్యప్రసాదరావు (నెమలి కృష్ణాజిల్లా)

185 నర్లగిరి రాజాకుమార్ (గూడూరు నెల్లూరుజిల్లా) 186. కొప్పారమేశ్ చంద్ర ప్రసాద్ (కమ్మవారిపాలెము కృష్ణాజిల్లా) 187 పిల్లలమర్రి నరసింహ జనార్దనరావు (తెనాలి గుంటూరుజిల్లా) 188. కరుణాకరం విజయలక్ష్మి (చక్రధర్ పూర్ బీహార్) 189 చిన్నకోట కనక విజయలక్ష్మి కుమారి (విజయవాడ) 190 తుమ్మలపల్లి ప్రతాపరెడ్డి (వెంగళమ్మ చెరువు అనంతపురము జిల్లా) 191 కలబోట్ల విశ్వేశ్వరరావు (ఎండగండి ప॥ గో॥) 192 బోయిన ఇందిర (బందరు కృష్ణాజిల్లా) 193. కోడూరు సూర్యప్రభ (అనకాపల్లి విశాఖజిల్లా) 194 తక్కోలు రాజగోపాలరెడ్డి (చిన్నగోపవరము కడపజిల్లా) 195 బామరాజు కృష్ణమూర్తి (కర్నూలు) 196 తుమ్మిడి రామమోహనరావు బారువ శ్రీకాకుళం జిల్లా) 197 తూబాటి యజనారాయణ (తూబాడు గుంటూరుజిల్లా) 198. కొప్పరపు వెంకట వటపత్రశాయిబాబు (పోరంకి, కృష్ణాజిల్లా) 199 విజయలక్ష్మి (వాల్తేరు విశాఖపట్టణము) 200 వేదుల సూర్యప్రభావతి (ఎలమంచిలి, విశాఖపట్నంజిల్లా)

201 రత్తిపాటి చంద్రశేఖరరావు (హైద్రాబాదు) 202 బూయినిసాయిబాబు (బందరుకృష్ణాజిల్లా) 203 బేబీ క్షేమ యర్రమిలి (పూనా) 204 ఎన్నికోటనరసింహారావు (గూడూరు కృష్ణాజిల్లా) 205 రాచబ్రోలు సీతారామయ్య (నర్సారావుపేట గుంటూరు జిల్లా) 206 నందివాడ కనకదుర్గ (కావలి నెల్లూరుజిల్లా 207 కె జయలక్ష్మి (మదరాసు) 208 ఎత్మా వెంకట రమణమూర్తి (విశాఖ పట్టణము) 209 పెండ్లచెరువు ఉష (దండుబజార్ విశాఖపటణము) 210 మద్దాలి గణేష్ (విజయవాడ) 212 దరిసి గోవర్ధనబాబు నెల్లూరు) 212 నూతక్కి ఇందిర (రాయగడ కోరాపుట జిల్లా) 213 ద్రోణ








కోతి — నాతి
—చిత్ర రచన. వేమూరి లక్ష్మి, న్యూఢిల్లీ]

వరాకల సుధారాణి (మచిలీపట్టణము కృష్ణా జిల్లా) 214 భమిడిపల్లి సుబ్రహ్మణ్య సీతారామం (కాకినాడ తూ॥ గో॥) 215 ఖండవిల్లి సన్యాసిరావు (విజయనగరము) 216 పి వి పులపతిరావు (మద్రాసు) 217 కొప్పుల వేదగిరి మహాలక్ష్మి గొల్లప్రోలు తూ॥ గో॥) 218 వంగపండు శ్రీమంతరావు (రాజమండ్రి) 219 కె రవీంద్రనాథ్ (మచిలీపట్నం కృష్ణా జిల్లా) 220 ఎస్ లక్ష్మి (విశాఖపట్నం)

221 పుణ్యమూర్తుల సుబ్బలక్ష్మి (కాకినాడ తూ॥ గో॥ 222 సి సీతారామం, (కాకినాడ తూ॥ గో॥) 223 ఓలేటి విజయలక్ష్మి పార్వతీపురము (శ్రీకాకుళం జిల్లా) 224 ద్వారంపూడి సుబ్బరెడ్డి (ఉప్పలంక తూ॥ గో॥) 225 చివుకుల సీతారామాంజనేయులు (గుంటూరు) 226 బద్దెపూడి రజనీవసంత (గుంటూరు) 227 శ్రీ గిరిరాజు ఉమాదేవి (ఉయ్యూరు కృష్ణాజిల్లా) 228 పి సీతామహాలక్ష్మి (పూసలపువారిపాలెము గుంటూరుజిల్లా) 229 రాజులపల్లి రామచంద్రారెడ్డి (కర్నూలు) 230 ఎం రాఘవేంద్రప్రసాదరావు (ఆదోని కర్నూలు జిల్లా) 231 రాచకొండ సీతామహాలక్ష్మి (మాచెర్ల గుంటూరుజిల్లా) 232 అల్లంరాజు సీతారామకృష్ణశర్మ (శంఖవరము తూ॥గో॥) 233 అంగర శాయిబాబు (మేడపాడు తూ॥ గో॥) 234 పటేలుఖానా శారదాదేవి (విజయవాడ) 235 శేశాయి సులోచనమ్మ (విరుపాపురము కర్నూలుజిల్లా) 236 కాశీపట్నం సుబ్బారావు (న్యూఢిల్లీ) 237. మహాకాళి జయశ్రీ (హైదరాబాదు) 238 హంసవల్లి మృగశిరకుమార్ (హంసవల్లి ప॥ గో॥) 239 ఆలేటి ఉదయలక్ష్మి (ఏలూరు ప॥ గో॥) 240 కోమండూరి శ్రీనివాసు (పెద్దపాడు ప॥ గో॥)

241 కె చంద్రశేఖరరావు (విజయవాడ) 242 గడిదాసు కాత్యాయని (ఆచంట ప॥ గో॥) 243 తిరుమలశెట్టి శంకరరావు (మచిలీపట్నం కృష్ణా జిల్లా) 244 ఆర్ సుందరరావు (బాపట్ల. గుంటూరుజిల్లా) 245 విస్సావఝుల వేంకటకృష్ణశాస్త్రి (ఎఱ్ఱగొండపల్లి. ప॥ గో॥) 246 లాలం లక్ష్మణరావు (నిడదవోలు ప॥గో॥) 247, బలివాడ విజయకుమారి కొత్తపేట తూ॥గో॥) 248 పి శేషాద్రిశర్మ (హైదరాబాదు) 249 జంపన ఝాన్సి (వి భీమవరం ప॥ గో॥) 250 వల్లభనేని సీతారామమ్మ (సిరిపూర్ కాగజ్ నగర్, అదిలాబాదుజిల్లా) 251 కర్లపాలెం కోదండరామశర్మ (వాల్తేరు) 252 గుంటూరు విజయకుమార్ (హైదరాబాదు) 253 సేకు కుసుమాంబ (కొనకంచి, కృష్ణాజిల్లా) 254 సుంకరణం వీరచంద్రరావు రాయవరము విశాఖ జిల్లా) 255 సామవేదం శ్రీనివాసన్ (ఆచంట, ప॥ గో॥) 256 వి వి వి రాజేశ్వరరావు (విజయవాడ) 257 బోలవరపు

(49-వ పేజీ చూడండి)

ప్రపంచంలో ఉండే బీద పిల్లలందరికీ సహాయం చేయాలనీ, వాళ్ళకు జబ్బులు రాకుండా చూడాలనీ, వాళ్ళు అందంగా, బొద్దుగా ముద్దొచ్చేలా పెరగడానికి బలమైన ఆహారం ఇవ్వాలనీ కొందరు పెద్దవాళ్ళకి ఒక రోజున ఒక ఊహ కలిగింది. అది కలగడానికి కారణం. జిట్కా సంకోవా అనే ఒక అమ్మాయి. ఆమె చెకొస్లొవాకియాలో ఉంటోంది. ఇప్పుడు పెద్ద అమ్మాయి అనుకోండి.

ఆ అమ్మాయి చిన్నతనంలో, దాదాపు పన్నెండేళ్ళ క్రితం వాళ్ళ సీమలో వానలు కురవక, కరువు వచ్చింది. యుద్ధం వచ్చింది. ఇంకా జబ్బులు వచ్చాయి. పిల్లలు ఆకలితో మాడిపోయారు. ఎందరికో కడుపు నిండా తిండిలేక జబ్బులు వచ్చాయి. ఇలా ఉండగా ఒక రోజున ఊళ్ళోకి ఒక పెద్ద లారీ వచ్చింది. అందులో పాలు, తినడానికి రొట్టెలు, మందులు ఉన్నాయి. ఆ పాలతో ఎందరో కోలుకున్నారు. మందులతో ఎందరో బాగుపడారు. ఆ వానులో సరుకులు అక్కడి పిల్లల ప్రాణాలు కాపాడాయన్నమాట. వాటిని యూనిసెఫ్ వారు పంపించారు.

యూనిసెఫ్ అనేది పిల్లలకోసం పెట్టిన నిధి. ఐక్యరాజ్యసమితివారు, బీదదేశాలలోని బాలబాలికల ఆరోగ్యంకోసం మందుమాకులూ, పాలూ ఉచితంగా పంపడానికి డబ్బు పోగుచేసి ఇందులో ఉంచుతారు. వీరే జిట్కా సంకోవా ఊళ్లో పిలలకి పాలూ మందులూ పంపినది. ఇలా పంపినందుకు, తామందరూ ఎంత సంతోషపడ్డారో తెలుపుతూ తమ కృతజ్ఞతకు గుర్తుగా ఏమైనా పంపాలనీ జిట్కా, ఆమెతోటి పిల్లలూ అనుకున్నారు. వాళ్ల మేస్టరుకి చెప్పారు. జిట్కా ఒక బొమ్మ వేసింది. కాగితం దొరక్క, ఒక అద్దంమీద ఆ బొమ్మ వేసింది.

యునిసెఫ్ అధికారులకి పిల్లలు దాన్ని చేస్తున్న [illegible] ఆ బొమ్మ నచ్చింది. అంత చిన్నపిల్ల, అంత మంచిమనసుతో వేసిందని, ఆ బొమ్మని లక్షలకొద్దీ కార్డులుగా అచ్చు వేయించారు. దీపావళికి మనం స్నేహితులకీ, చుట్టాలకీపంపే (గ్రీటింగ్స్) కార్డులాంటివన్నమాట. వాటిని జెకొస్లొవాకియాలోని అన్నిఊళ్ళలోనూ అమ్మించారు. అవి అమ్మగా వచ్చిన డబ్బుతో మళ్ళీ పాలూ, మందులు తెప్పించి డబ్బులేక జబ్బులతో, ఆకలితో బాధపడుతున్న ఎందరో పిల్లలకి పంచిపెట్టించారు.

ఈ పద్ధతి చాలాబాగుందని, అప్పట్నించి ప్రతి ఏడాదీ అలాగే కార్డులు వేయించి అమ్మి డబ్బు పోగుచేస్తున్నారు. అన్ని దేశాలలోనూ అందరూ వాటిని కొనుక్కుంటున్నారు. పెద్ద పెద్ద చిత్రకారులంతా ఈ కార్డులమీదకి ఎంతో అందమైన బొమ్మలు వేసి యిస్తున్నారు. ఈ కార్డులు పదేసి కలిపి ఒక పెట్టెలో పెట్టి అమ్ముతారు. పెట్టె ఐదు రూపాయలు.



'దీపావళి' అనే ఈ చిత్రాన్ని ఫ్రిట్జ్ బన్ అనే జర్మన్ చిత్రకారుడు వేశాడు.



మానవ హక్కులు: ఈ చిత్రాన్ని [illegible] (అమెరికా) వేశాడు.



# మనిషిలాగా మనిషి

(నాటకం)

ప్రఖ్య శ్రీరామమూర్తి

## రెండో అంకం

### మొదటి దృశ్యం: జీవితం

[రఘుపతి ఇంట్లో మధ్య హాలు-అదే రాత్రి ఇంకొంచెం పొద్దుపోయి-తెర లేచే సరికి రంగడు అతికించివున్న కవరొకటి చేతబట్టుకుని, మరో ఉత్తరం చదువుతూ లోపల్నుంచి వస్తాడు. రంగడు చాలా వ్యాకులంగా భయంగా వున్నాడు ఉత్తరం చదవడం పూర్తిచేసి ఒక్క క్షణం మ్రాన్పడి నిలబడిపోతాడు-]

రంగడు (తనలో తాను అనుకుంటున్నట్లు) ఎంతపని జరిగిపోయింది- ఎంత పనైపోయింది! హరి భగవంతుడా-ఏమిటి దిక్కిప్పుడు?

[గోడమీద చిన్న షెల్ఫుమీదవున్న అలారం గడియారం వంక చూసి ఫోను వంక చూస్తాడు జేబులమీద నాటకం కరపత్రం ఒకటి తీసిమూసి నెమ్మదిగా ఫోను రిసీవరు ఎత్తి ఓ నంబరు డయల్ చేస్తాడు కొంత ఆగి ఫోన్లోకి-]

హలో ఆ- మద్రాస్ డ్రమెటిక్ హాలేనా? ఏమండీ- మా అయ్యగారు-రఘుపతిరావుగారున్నారా?. అదేనండీ-ఇందాక నాటకంలో 'రాణీ' వేషం వేశారు ఎంత సేపైంది బయల్దేరి? పోనీ రాజు వేషం వేసినాయన—శేఖరంగారు వున్నారా? వారు వెళ్ళిపోయారా? ఇద్దరూ కలిసే వెళ్లారా? కొంచెం కనుక్కు చెప్పండి. ఎందుకేమిటయ్యా బాబూ ఇక్కడ ప్రాణం మీదికొచ్చి పడుతుంటే—!. హోరి నీ దుంపతెగ!—

[ఫోన్ పెట్టేస్తాడు చేతిలో వున్న కవరోసారి పరిశీలించి చూసి, తెరిచి వున్న ఉత్తరం మళ్ళీ చదువుకుంటాడు-ఈసారి బిగ్గరగా.]

"రంగడికి- ఈ ఉత్తరంతో పాటు ఇంకో కవరుకూడా ఈ బల్లమీద వుంచుతున్నాను. అయ్యగారు నాటకంనుంచి ఇంటికి రాగానే ఆ కవరు వారికి తప్పకుండా అందజెయ్యి. చిన్నప్పటినుండీ ఇంట్లో వుండి నా స్వంత తమ్ముడిలాగా మెసులుతున్న నీక్కూడా చెప్పకుండా పోవటం నాకు చాలా బాధగా వుంది నేను మీ అయ్యగార్ని వదిలిపెట్టి వెళ్తున్నాను. కాని వారితో ముఖాముఖీ ఈమాట చెప్పే ధైర్యంలేక ఉత్తరం రాసి పెట్ట వెళ్తున్నాను. ఆయన వంటరిగా ఇంటికొస్తే మటుకు ఉత్తరం ఇవ్వవద్దు బహుశా ఈపూట నాటకం గ్రూపు వాళ్ళందర్నీ ఇంటికి తీసుకొస్తా నన్నారు శేఖరంగారు కూడా వచ్చు. శేఖరం అంటే తెలుసుగా— నాటకంలో 'రాజు' వేషం వేస్తారు. వాళ్ళెవరయినా కూడా వున్నప్పుడే అయ్యగారికి ఉత్తరం ఇయ్యి—మీనాక్షి" హరి భగవంతుడా! ఎంత కష్టం తెచ్చిపెట్టావురా మా అయ్యగారికి!

[రఘు రఘుగానే ప్రవేశిస్తాడు. మనిషి మాంచి హుషారుగా వున్నాడు మంచి వాగ్ధాటిగల వ్యక్తి. రంగడు చేతిలోని ఉత్తరాలు గబగబా తన వెనకాల దాస్తాడు రఘు సరాసరి హాలు మధ్యకు వచ్చి మఫ్లరుతీసి సోఫామీద పడేస్తూ భార్యని కేకేసాడు]

రఘు మీనా! (జవాబు కోసం చూసి-) మీనా! మీనాక్షీ! (పక్కకు తిరిగి రంగణ్ణి చూసి) ఏరా రంగా!

రంగడు నేనూ ఇప్పుడే వచ్చానయ్యగారూ.

రఘు: అమ్మగారు రాలే ఇంకా?

రంగడు. లేదండీ నాటకం బాగుంది సార్.

రఘు (ఎటో ఆలోచిస్తూ) ఏం నాటకం?

రంగడు అదే బాబూ- మీరిప్పుడేసి వచ్చిన నాటకం.

రఘు ఓ! నువ్వూ వచ్చావన్నమాట!

రంగడు తెరలేసరికి నిజంగా నాకు కంగారు పుట్టిందనుకోండి. సీను అచ్చం ఈ హాల్లాగానే వుందండీ! కుర్చీలు, కిటికీలు, అలమారలు- అన్నీ ఈ హాల్లోలాగా కథఅంతా మనయింట్లో జరుగుతున్నట్టే వుంటే!

రఘు అవును. సెట్టు ఎలాంటిది వేద్దామా అని ఓరోజు ఇక్కడ కూర్చుని ఆలోచించాం ఎంతకీ తెగలేదు చివరికి మన గురవాచారి ఈ హాలు ప్లానుగీసి ఇలానే వేద్దామన్నాడు కావాలంటే కొన్ని మెరుగులు దిద్దామనుకో

రంగడు అలాగాండీ.

రఘు ! పారిస్ లాంటి మహాపట్టణంలో ఇంటిలా కనిపించాలిగదా!

రంగడు: మామూలుగా చూస్తే అదోలా వుంటుంది గానండీ- ఆ లిలీ వేసినమ్మగారు- సుజాతమ్మ- ఎంత అప్సరసలా వుందండీ! ఆఁ!

రఘు అవును ఆ అమ్మాయి ఇప్పుడిక్కడికొస్తుంది ఆరాజు వేషం వేశాడే- శేఖర్!- వాడూ సరళా కూడా వస్తారు.

రంగడు సరళంటే-

రఘు: రాణీ వేషం వేసినమ్మాయిరా!

రంగడు: ఓ! ఆ అమ్మాయాండీ!

[రాణీ నవ్వు అనుకరిస్తాడు]

రఘు: (నవ్వుతూ) ఆఁ-ఆ అమ్మాయే.

రంగడు ఐతే వాళ్ళందరికీ భోజనాలు ఏర్పాటు చెయమంటారా బాబూ?

రఘు ఇప్పుడింకేం భోజనాలు- చిన్న పార్టీ! ఏదో పిచ్చాపాటీ చెప్పుకోవానికి! ఆ శేఖర్ గాడు ఇందాక నాటకంకోసం తెచ్చిన పళ్ళన్నీ మూట గట్టుకొస్తాన్నాడు కూడాను.. ఏదీ-మీన ఇంకా రాలేదేమబ్బా!

[రంగడు మాట్లాడడు]

ఏరా- ఇంతసేపు రాకుండా ఏం చేస్తోందంటావ్?

[వీధి తలుపు చప్పుడు]

రంగడు, అదుగో బాబూ- వచ్చినట్టున్నారు.

[గబగబా తలుపుతీసుకు వెళ్తాడు. రఘు కోటుతీసి [illegible] ఓసారి అటూ

## మనిషిలో మనిషి

యిటూ తిరుగుతాడు.. రంగడు మళ్ళా వస్తాడు,]

రంగడు ఆ పోలీసాయన బాబూ.

రఘు ఏ పోలీసాయన?

రంగడు మధ్యాహ్నం కూడా వచ్చాడు -మీరు లేరింట్లో.

రఘు ఎందుకట?

రంగడు ఏమో మరి - మళ్ళీ ఎప్పుడొస్తారని అడిగాడు ఇందాక. నాటకం ఐతేగాని రారని చెప్పాను సరే అప్పుడే వస్తాలే అని వెళ్ళిపోయాడు.

రఘు ఈ అర్ధరాత్రివేళ పోలీసులకి నాతోయేం పనబ్బా?. ఇందాక వాళ్ళకి నాటకం కాంప్లిమెంటరీలు పంపించలేదా యేమిటి గోల? సరే లోపలికిరమ్మను.

[రంగడు వెళ్ళి పి సి వందనాన్ని లోపలికి తీసుకొస్తాడు ]

వందనం గుడ్ నైట్ సర్ నా పేరు వందనం పోలీస్ కానిస్టేబుల్ని చాలా పొద్దుపోయి వచ్చినట్టున్నాను - క్షమించండి

రఘు: ఫరవాలేదు

వందనం మొన్న ఎలక్ట్రిక్ ట్రైన్‌లో గొడవ జరిగింది చూడండి-

రఘు ఓ! ఓ! అదా! ఐతే ఇప్పుడు నన్ను అరెస్టు చెయ్యడానికొచ్చారా యేమిటి?

వందనం పొద్దున మీరు కోరులో హాజరుకానందుకు అంతపని జరిగేగాని మా యస్సై (ఎస్ ఐ) గారడ్డుపడ్డారు సార్. ఆయనగారికి మీ యాక్టింగంటే తగని అభిమానం మీరు యాక్టుచేసిన సినిమాలు నాటకాలు ఒక్కటి కూడా చూడకుండా వదిలిపెట్టరాయన

రఘు ఆఁ హాఁ-

వందనం మీరు రాకుండానే కేసు విచారణ జరిపించి పది రూపాయలు మినిమం ఫైను మాత్రమే పడేట్లు చూశారు వారు

రఘు అసలు నేనెందుకు కట్టాలండీ ఫైన్?

వందనం గొలుసులాగి ఎలక్ట్రిక్ ట్రైను దారిలో ఆపేసినందుకు!

రఘు నేను లాగలేదే గొలుసు

వందనం ఎవళ్ళో లాగారుగదా సార్.

రఘు కావచ్చు - కాని నేను మాత్రం కాదు

వందనం అదేమో నాకు తెలీదు సార్- ఫైనుపడింది మటుకు మీకు

రఘు కూర్చోండి-నిలబడే వున్నారేం!

[వందనం కుర్చీలో కూర్చుంటాడు ]

సాయంత్రం ఆరుగంటలవేళ ఆ లోకల్స్‌లో ఎలా వుంటుందో తెలుసా మీకు? యమరద్దీ—మనిషీ మనిషీ పేలముక్కల్లా అతుక్కుపోయి వున్నారు! ఊపిరాడటం లేదు నేను కడీపట్టుకు నిలబడివున్నాను. నన్నానుకుని నా వెనకాలే ఓ ముసిల్ది— ముఫ్ఫై నలభై మధ్య వుంటుందనుకో వయస్సు—ఇరవయ్యేళ్ళ పిల్లలా మేకప్ చేసుకుని, కళ్ళజోడు పెట్టుకునివుంది. నన్నానుకుని నుంచున్నది అంతటితో సంతోషించి వూరుకోరాదూ — వూరికే నన్ను మోచేత్తో మోకాల్తో పొడవటం మొదలెట్టింది వెనక్కి తిరిగిచూశాను. చిరునవ్వులు ఒలకబొయ్య సాగింది—కన్ను కూడా కొట్టింది ఆఖరికి ఇలాంటి అనుభవం నీ కెప్పుడైనా కలిగిందా?

వందనం: (విచారంగా) లేదుసార్.

రఘు: ఎప్పుడూ కలగలా?

వందనం: పుస్తకాల్లో చదవటమేగాని స్వయంగా ఎన్నడూ ఎరగను సార్.... తర్వాత ఏం జరిగిందండీ?

రఘు నేనూ యేం యెరగనట్టు వూరుకున్నా కాస్సేపు వున్నట్టుండి ఒక్కసారి డొక్కలో చక్కిలిగింతలు పెట్టిందీ!

వందనం నిజం? అప్పుడు మీ రేం చేశారండీ?

రఘు దాని కాలెక్కడుందో చూసి నెమ్మదిగా నా బూటుకాలు పెట్టి బలంకొద్దీ చితకతొక్కాను

వందనం భా పాపం—

రఘు దాంతో చెవులు గింగురుపుట్టేట్టు బాబోయ్ అని ఒక్క కేక పెట్టింది ముసలిపీనుగ అది విని ఎవడో మతిలేని వెధవ

ఏదో పెద్దప్రమాదం జరిగినట్టు గొలుసులాగి రైలాపేశాడు గొలుసులాగింది నేను కానే కాదు—కానీ ఫైన్‌మటుకు నాకు వేశారు ఏం న్యాయమయ్యా ఇది?

వందనం 'లా' ప్రకారం బాధ్యత మీదే గదండీ!

రఘు ఘోరీభగవంతుడా! 'లా' నన్ను రక్షించడానికి గదయ్యా? అడ్డమైనవాళ్ళూ నాకు చక్కిలిగింతలు పెడుతుంటే 'లా' ఏమీ యాక్షను తీసుకోకపోగా నేనుకూడా సహించి పూరుకోవాలా?

వందనం అదికాదుసార్—

రఘు ఏదికాదుసార్? పైకి చాలా శాంతంగా కనిపిస్తున్నా నేమోగాని లోలోపల చాలా కసుకుమనిపిస్తే నేను సినిమాల్లోనూ నాటకాల్లోనూ ఏదో నోట్లో నాలిక లేని వాజమ్మ పెళికదద్దమ్మ వేషాలు వేసి నంతమాత్రాన అడ్డమైన అడదీ వయోభేదం కూడా మర్చిపోయి నామీదపడటమేం? అసలు నేను మంచివాణ్ణికాదు-మహాదురుసు మనిషినయ్యోయ్! నువ్వైనా అంతే కదయ్యా ఆ పరిస్థితుల్లో!

వందనం: నేనైతే

రఘు పోనీ ఇంకో ఉదాహరణ తీసుకుందాం - నీ భార్యకీ నీకూ ఏదో మాటా మాటా వచ్చిందనుకో—

వందనం ఎప్పుడూ రాదుగదండీ

రఘు ఏమిటి - మీ యిద్దరికీ ఎప్పుడూ అభిప్రాయభేదాలే రావంటావా?

వందనం రవుసార్ ఇంట్లో దాని మాటే లా అండ్ ఆర్డర్.

రఘు (కొంచెం విచిత్రంగా అతనివంక ఓ క్షణంచూసి, అంతలోనే విసుక్కుని) ఊఁ-పోనీ ఇదివిను - ఇవ్వాళ మధ్యాహ్నం నా లాల్చీ జేబులో మాఆవిడకో చేతిరుమాలు దొరికింది అదెవరో నాటకాల్లో వేషాలేసే పిల్లది. మాఆవిడ చాలాతొందరపాటు మనిషిలే అదిచూసి నేనెవరో పరాయి ఆడవాళ్లతో తిరుగుతున్నానని నానా రభసా ప్రారంభించింది అప్పుడు నువ్వైతేమటుకు ఏంచేస్తావయ్యా—'అవును-తిరిగితే తిరిగానులే' అని అంటావా?

వందనం అమ్మో—

రఘు 'చాల్లే నోర్ముయ్-వెధవవాగుడూ నువ్వూనూ' అనేవాడివి అంతేనా?

వందనం: అదీ కొంచెం ప్రమాదమేనను కోండి..

రఘు పోనీ ఇంకా మరీ extreme exampleతీసుకుందాం — నువ్వీపూట ఇంటికెళ్ళేసరికి నీ భార్య ఎవరితోనో లేచిపోయిందనుకో

వందనం ఏమిటీ—

రఘు: అబ్బ—ఫర్ ఎగ్జాంపులయ్యా- అప్పుడు నువ్వేంచేస్తావ్?

వందనం: చంపేస్తాను—వరికి పోగులు పెట్టెయ్యనూ!

రఘు అదదీ! నువ్వు ప్రతీకారం చేస్తావ్ React అవుతావ్ అంతేగాని నిట్టూరుస్తూ విరహంపడుతూ కూర్చోవుగా. నేనూ అంతే! అదెవత్తో నాకయిష్టంగా చక్కిలిగింతలు పెట్టింది—నేను దాని కాలు చితక తొక్కాను!

వందనం మీరుచేసింది తప్పని నేననను.

రఘు: మరింకేం?

వందనం 'లా' మీది తప్పంటోంది.

రఘు 'లా' అంటే నువ్వేకాదయ్యా.

వందనం: నాదేముందండీ—ఆ మహాయంత్రంలో ఒకచిన్న లివర్ని నేను.

రఘు ఐతేమటుకేం—నువ్వు నాపక్షమే గదా! ఏం లివరూ! సమాధానం చెప్పవేం?

వందనం కష్టమండీ సమాధానం చెప్తే నేరాన్ని క్షమించినట్లయిపోతుంది

రఘు కాని ఆ 'లా' నన్ను రైల్లో ప్రయాణం చెయ్యనిచ్చి, మాంబళానికీ కోడంబాకానికీ మధ్య ఓ వయసుమళ్లిన కామినీ భూతిక్కి ప్రణయక్రీడలకు నన్ను బలికానిచ్చి ఇంకా పదిరూపాయలు కక్కమంటే— నేరాన్ని క్షమించడం సంగతలా వదిలెయ్—'లా'యే నేరంచేస్తోందే! ఒక అమాయక పౌరుణ్ణి పదిరూపాయలు నిలువునా దోపిడీ చేస్తోంది!

వందనం అయ్యా—కేసంతా ఎప్పుడో క్లోజయిపోయింది—

రఘు: అహాఁ—అసలు నే చెప్పేదాంట్లో న్యాయం బోధపడిందా అని నీకైనా!

వందనం: పది రూపాయలు సార్ అఫ్టరాల్—

రఘు (జేబులోంచి పర్సు తీసి) పది రూపాయలు! (పర్సులోంచి పదిరూపాయలు తీస్తాడు)

వందనం అంతే సార్

రఘు వినోదపు పన్నేం లేదుగదా?

వందనం (నవ్వుతూ) లేదు సార్. (నోట్లు తీసుకుని తన జేబులో పెట్టుకుంటాడు) థేంక్యూ వెరీమచ్, సర్ రేపొద్దున్నే ఇది కోర్టులో కట్టేసి రసీదు తెచ్చిస్తాను ఆ శ్రమకూడా మీకు కలిగించరాదని మా యస్. ఐ గారి వుద్దేశం.

రఘు వారి దయకు నా కృతజ్ఞత తెలియజెయ్యండి ఇంకోటి- ఇకముందు నా కారు లేకపోయినప్పుడల్లా నేనుబస్సులో నే కూర్చునే ప్రయాణం చేస్తానని కూడా చెప్పండి

[వందనం గుమ్మందాకా వెళ్ళి ఆగి వెనక్కు తిరుగుతాడు

వందనం: మరో చిన్న విషయంసార్ - మీరివ్వాళ వేసిన నాటకమే మళ్ళీ రేపు కూడా వేస్తున్నారట-మా యస్. ఐ గారికీ మా ఫామిలీకీ కూడా నాటకం చూడాలనివుందీ—

రఘు: తప్పకుండా రమ్మనవయ్యా. నువ్వుకూడా రా రేపు బుకింగ్‌లో నా పేరు చెప్పి-కాంప్లిమెంటరీస్ ఇవ్వమని చెప్తాలే.

[తలుపు తట్టుతారెవరో.]

వందనం కాంప్లిమెంటరీ రెండుకెండి సార్-ముందుసీట్లు నాలుగు—

రఘు ఫరవాలేదు మీ 'లా' లాగా మా కేం ధనదాహం లేదులే.

[రఘు తలుపు తీస్తాడు]

వందనం చాలా థేంక్సండీ

[సరళ, శేఖర్ లోపలికి వస్తారు. సరళ, రాంగానే, వందనాన్ని చూసి ఉలిక్కిపడటం నోటికి చెయ్యి అడ్డుపెట్టుకుని 'పోలీస్!' అని ఆర్తనాదంలాంటి కేక పెట్టి మళ్ళీ మామూలుగా వెళ్ళి సోఫాలో కూర్చుని ఏదోపత్రిక తిరగేస్తూంటుంది]

శేఖర్: (వందనంతో) మరేం అనుకోకండి-పాపం మొన్న నీమధ్య వాళ్ళ మున వమ్మని ఖూనీ చేసిన దగ్గర్నుంచీ పోలీసుల్ని

# ★ మనిషిలో మనిషి ★

చూస్తే కొత్త బెదురు అంతే.

చందనం : (నవ్వి, రఘుతో) శెలవుసార్. థేంక్యూ వెరీమచ్.

[వెళ్తాడు]

[రఘు అతనితో బాటు బైటికి వెళ్తాడు. రంగడు లోపల్నుంచి వస్తాడు—ప్లేట్లు, టేబులుగుడ్డ తీసుకుని.]

సరళ హలో రంగ్!

శేఖర్ : ఏ రోయ్ రంగా! ఇవిగో నా వంతు చక్రకేళీలు!

సరళ నా వంతు ఆపిల్స్!

[అందిస్తారు. రంగడు తీసుకుని ప్లేటులో పెడాడు.]

రంగడు (శేఖర్ తో) బాబూ! ఒక చిన్న మాటసారి—చాలా అర్జెంటు.

[రఘు లోపలకొచ్చి కూజాలో నీళ్ళు గ్లాసులోకి వొంపుకొని తాగుతూ—]

రఘు ఘోరం!

రంగడు (శేఖర్ తో) సరే ఇప్పుడు కాగులేండి బాబయ్యా

[లోపలికి వెళ్తాడు]

శేఖర్ ఏమిటోయ్ అంత ఘోరం?

రఘు పది రూపాయలు ఫైను

సరళ ఎవరికి?

రఘు ఇంకెవరికి—నాకే. ఆ రైల్లో గొడవకి!

శేఖర్ : కాని వ్—మంచి ఛాన్సు పోగొట్టావురా ఆ రోజు పాత ఫిడేలు—ఎందుకైనా పనికివచ్చేది!

సరళ తలుపు తెరవంగానే పోలీసు కనిపించేసరికి ఖూనీ నేరంమీద నిన్ను అరెస్టు చేశారనే అనుకున్నాను రెండో అంకంలో నా విట్టీడైలాగు కొస్తే ఖూనీ చేశావ్ చూడు—

రఘు నీకు విట్టీడెలా గొకటి వుందని నాకు తెలీదే!

సరళ ఇంకేం వుందిలే— నే నా డైలాగు మొదలెట్టేసరికల్లా ఖయ్యా ఖయ్యా నీ దగు మొదలెడతావ్!

రఘు అసలు నీకలాంటి డైలాగు వుండరాదు సరళా! నువ్వు రాణీవి! భావాంబర వీధిలో తేలిపోయే మధుర కవయిత్రివి! అంత వరకే నీ పాత్ర! అసలు చాలామంది కవులు విట్టీగా మాట్లాడలేరు చూడు

శేఖర్ సరేగాని ఆ పోలీసువాణ్ణి ఎలా వదిలించుకున్నావ్?

రఘు ఏదో లాలించి పంపించేశాననే కాని చాలా కరుగ్గా ఉన్నాడు నీకు తెలుసుగా మన సంగతి—అలా అలా నెమ్మదిగా మాట్లాడుతూనే వుంటాంగాని చివరకి. చివర చివరకి మన వాగ్ధాటి విశ్వరూపం చూసి బెదిరిపోయాడు

శేఖర్ : ఫైన్ కటావా యింతకీ?

రఘు ఊరేయ్ - నువ్వు న్యాయం చెప్పరా—

[వీధి తలుపు చప్పుడు]

మీనాక్షి వచ్చినట్టుంది

సరళ ఆమెగారు రాలే ఇంకా ఇంటికి?

రఘు ఇదుగో ఇప్పుడే వస్తోంది

[తలుపు తెరుస్తాడు]

శేఖర్ (సరళతో) వాళ్లాయన ఎంత కరుకు మనిషో ఆవిడకు చెప్దాం వుండు.

[గుమ్మంలోంచి సుజాత వస్తుంది—చేతిలో నాలుగు పార్శిల్సు వుంటాయి]

మొతానికి మీ ఆయన మహా కరుకు మనిషండీ—(అటుచూసి) ఓ-నువ్వా!

సుజాత ఎవ రనుకున్నావ్?

శేఖర్ మీనాక్షిగా రనుకున్నాంలే.

సుజాత కరుకెవరు?

సరళ ఇదుగో — బావ!

రఘు అదుగో మీ కెన్నిసార్లు చెప్పాను నన్ను బావ అని పిలవొద్దని!

[రంగడు వస్తాడు]

సుజాత రంగా! ఈ పొట్లాలన్నీ పట్టుకెళ్లి ప్లేట్స్‌లో పెట్టి పట్రా ఇదుగో ఇది ద్రాక్ష. ఇది పైనాపిల్ ఇది జున్ను—

రఘు జున్ను — జున్ను! జున్నంటే నా కెంత యిష్టం! ఎక్కడిది సుజీ!

సుజాత మా గొల్లభామ పొద్దున జున్ను పాలు ప్రజెంట్ చేసిందిలే

[పొట్లాలన్నీ రంగడి చేతికిచ్చి చేతులు దులుపుకుంటూ ప్రేక్షకులకు వెన్నిచ్చి ఇల్లంతా కలయజూస్తూ—]

అబ్బ—ఈ గదిలో అడుగు పెట్టినప్పుడల్లా నా గుండెలు గతుక్కుమంటాయి. స్టేజి మీద వున్నానా అనిపిస్తుంది!

సరళ నాకూ అంతే మైక్సు ఎక్కడున్నాయా అని చూస్తాను.

శేఖర్ నేను ఫుట్ లైట్స్ కోసం వెదుకుతా గాని అవెక్కడా కనిపించవ్.

సుజాత మీనాక్షి గారెక్కడ?

రఘు దానికోసమే చూస్తున్నాం. టైం ఎంతయింది?

సరళ (తన వాచీ చూసుకుని) పదకొండూ పది

సుజాత (తన వాచీ చూసుకుని) పదకొండూ అయిదు!

సరళ నాది సెవెంటీన్ జూయెల్స్ వాచీ

రఘు (అలారం గడియారంవంక చూసి) మా దాంట్లో పదకొండుంబావు వాళ్ల సిస్టరుగారింటికి వెళ్లిందో యేమో సరే .. పదకొండూ ఇరవైదాకా చూసి మనం ప్రారంభిద్దాం

శేఖర్ కాని నా వాచీ ప్రకారం పది నిముషాలు తక్కువ పదకొండు! పదకొండూ ఇరవై దాకా ఆగాలంటే ఇంకా అరగంట పడుతుందే! మరైతే . అప్పటిదాకా ఏం చేద్దాం మరి?

సరళ ఆ మధ్య నువ్వేసిన నాటకం మీద రివ్యూతీసి చదివి వినిపించు

రఘు ఏ నాటకం అది?

సుజాత ఎవరు రాశారు రివ్యూ?

శేఖర్ ఏమిటి—మీరెవరూ చూడనే లేదా అది?

(43 వ పేజీ చూడండి)




"ఏమండోయ్! వరహాలరాజుగారూ!"

"ఎవరది! ఇలా కొంచెం దగ్గిర్నా లోపల్లోకి రండి."

"నమస్కారమండి. నేను......గుర్తు లేనూ?...రాయుణ్ణి! భవదీయుణ్ణి"

"జ్ఞాపకం రాలేదు. కొంచెం ప్లాషు బాకులో మాట్లాడి మీ వెనకటికథ చెప్పండి" అన్నాడు రాజు నల్లకళ్లజోడులోంచి గంభీరంగా చూస్తూ.

రాయుడు వినయంగా నవ్వాడు. 'చెప్పటానికి నేను రెడీయే కానండి, వెనకటి కథంతా చెప్తే ఇప్పుడు కథకి చోటు చాలదని భయం. పార్థసారథిగారు ఊరుకోరు.'

'వాడుటి దగాకోరులా ఉన్నారే. ఎక్కడా దొరకడు. బాక్సాఫీస్ ఫిలింరైటర్ కన్న అన్యాయం. నేను డబ్బులేక లాట్రీ కొడుంటే అప్పుడంతా రాసి, తీరా ప్రొడ్యూసర్ని యేసరికి పబ్లిసిటీ ఇవ్వాలని పరారీఅయిపోయాడు...డోంట్ కేర్. నీకథ చెప్పు. నువ్వెవరు?"

"నేను రాయుణ్ణిగదండీ. మీరూ నేనూ నాలుగైదు కథలనించి కలిసి తిరుగుతున్నాం. ఒక్క టీ తాగి, ఒక్క సిగరెట్ కాల్చుకున్నవాళ్ళం..."

"హోహో. తెలిసింది. నువ్వు రాయుడివన్నమాట. అసంగతి చెప్పవేం."

"చెప్పానండి."

"చదివితే చెప్పావుగాని ఇప్పుడేం చెయ్యటం. వాటీజ్ మై సెన్స్ సెన్."

"ఎస్. పార్థసారథిగార్ని కనుక్కురానాండి?"

"య్యస్...కాదుకాదు ఛఛ! వాడెవడు మధ్య నేనేం చెయ్యాలో చెప్పేందుకు. నా యిష్టం వచ్చినట్టు చేస్తాను. కొంత సే పిచ్చరు తీస్తాను. స్టుడియోకి పద" అన్నాడు రాజు పార్థసారథిమీద కోపం కొద్దీ.

రాయుడు మటుకు సై అనలేదు. కొంచెం గౌరవంగా, కొంత జాలిగా నవ్వాడు "సార్ పార్థసారథి వద్దన్నా సరే, వరేనన్నా సరే; మీరు మాత్రం యిప్పుడు పిచ్చరు తియలేరు."

"వటప్. అయాం మే లాక్ రుపీస్. ఎందుకు తియ్యలేను."

"బట్ యువార్ నాట్ రాఫిలింకోటా. ...మీదగ్గిర లక్షలక్షల డబ్బై వేల రూపాయలున్నా ఫిలిం తియ్యలేరు. ఇప్పుడు రాఫిలిం దొరకటంలేదు. అందికే నేకదా కిందటిసారి నాల్నెల్లముందర మీరుస్టుడియో షూటింగుకెళ్లి గల్లంతయిపోయారు. అవాళ ఫిలింలేక కాల్షీటు కాన్సిలైంది. అప్పట్నుంచి ఇంకా ఫిలిం తియ్యలేదేం మరి...మీరే ఆలోచించండి."

రాజు ఆశ్చర్యపడి లేచాక, నిజమే నా అన్నాడు. రాయుడి జవాబు వినకుండానే, అంచేతేననమాట నేను కనబట్టంలేదు అన్నాడు. మరిప్పుడెలా అన్నాడు.

రాయుడు ఎలా అని ప్రతిధ్వనించాడు.

"పోనీ పార్థసారథి నడిగితే, రాఫిలింకోటా యిప్పించమని?"

"ఆయన కొంటె. ఆయనేం యిస్తాడు."

రాజు ఆలోచనలో మునిగిపోయి తేలాడు.

"వాడి సొమ్మేంపోయింది? కథలో ఉత్తుత్తి సినిమాకోసమే కదా ఈ కోటా" అన్నాడు తెలివిగా.

"ఉత్తుత్తి సినిమాలకోసం కోటాలగిరాకీ కూడా చాలా ఎక్కువగా ఉందండి. కొందరు నిజం సినిమాలు తియ్యడానికి ఉత్తుత్తి కోటాలు దొరకుతున్నాయి. మనలా ఉత్తుత్తి సినిమాలు తీసేవాళ్ళకేవీ?"

"వటక్...నేనెవరనుకుంటున్నావు. అయాం మే లాక్ రూపీస్. బిగ్ ప్రొడ్యూసర్ డైరెక్టర్ యాక్టర్. నాకు బోల్డు గ్లామరుంది!"

"నరేనండి. మీకు సినిమామీద చాలా గ్లామరుంది."

* * *

"ఉత్తికాకిగోల"

* * *

'ఎవరది!' అన్నారు రాజూ రాయుడూ జాయింటుగా ఉల్లిపడి. ఒకళ్ళనొకళ్ళు చూసుకోడం అయ్యాక చుట్టూతా చూశారు. ఎవరూ కనబళ్ళేదు. "ఎవరది మన్ని కాకిగోల అంటూ. నువ్వా?" అన్నాడు రాజు మెల్లిగా.

"కాదు, మీరా?"

"కాదు. ఎవరో_"

"ఎవరూ కనబట్టంలేదండీ...కాని".

"పార్థసారథిగాడు కాదుగదా"

"కాదు. వాడలా అనడులెండి. కాని_ ఎవరో చెప్పారా? ఈ కథ చదువుతున్న వారనుకుంటా."

"నిజమే?"

"ఒట్టు."

రాజు హఠాత్తుగా గాంభీర్యం పులుముకున్నాడు. కాలరు సర్దుకున్నాడు. కళ్ళజోడు తీసి తుడిచి మళ్ళీ పెట్టుకున్నాడు. జోగ్గా పొడిదగ్గు దగ్గాడు. కీవి నటించాడు. అవారే వస్తున్న అద్దెకారు నాపాడు. మాట్లాడకుండా ఎక్కిపోయాడు. "స్టార్ట్" అన్నాడు ముక్తసరిగా.

'ఎంగో' అన్నాడు టాక్సీవాడు.

'ఇమ్మీడియట్లీ' అన్నాడు రాజు ఠీవిగా.

# ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

'అదు ఫర్దాబా (?) య్యేంగే అని కేట్టా, అవి చొల్లు మాటేంగిరియే'

'స్టుడియో' అన్నాడు రాజు టూకీగా కోపంగా.

'ఇద్దో పరక్కారేం'

* * *

రాజు స్టుడియోహాలులో కూర్చున్నాడు.

"నెంబరు టూ ఫ్లోరు, కుడివ టాలోట మన షూటింగు పదండి" అన్నాడు రాయుడు వైనం కనుక్కొచ్చి.

వరహాలరాజు ఎంతో సంతోషంతో పొంగిపోతున్నాడు

"చూడగాచూడగా నేను సినిమావాళ్లలో కలిసిపోయినట్టే ఉంది" అన్నాడు

"కాక మరేమిటండీ ఫిలిం ప్రొడ్యూసరు అయి ఉండికూడా ఆశ్చర్యం ఏమిటండీ మరీ బడాయి. ఏదో ముతకసామెతవతుగా ఉంది మీరన్నది"

* * *

సెట్ మీద చీకటిగా నిశ్శబ్దంగా ఉంది ఒకరిద్దరు కునికిపాట్లు పడుతున్నారు ఒక పూలబాల, మేకప్‌మన్ కొసరికొసరి వేసిన పిసరంతరంగును జాకెట్ మిరర్ లో పరిచూసి దిద్దుకుంటోంది 'మాతాత చచ్చిపోయి నాకు డబ్బురాగానే తీసే నెక్స్ట్ పిక్చర్ లో తను ఆమెను ఎంత పెకి తీసుకురాబోతున్నాడో, మెల్లిగా చెబుతున్నాడు ఒక ప్రొడక్షన్ అసిస్టెంట్. ఏడిశావు పోదూ అంటోంది ఆమె హేళనగా. 'కొయ్‌సారంగా' అని ఆ గిరీశాన్ని వెక్కిరిస్తున్నాడు ఒక అసిస్టెంట్ డైరెక్టరు ఓమూలనున్న ఈ ముగురు మినహా మిగతావాళ్ళంతా దిగులుగా చూస్తున్నారు దిక్కుదిక్కులా.

సెట్ మధ్యన, కొమెరానీడన, ఓకుర్చీలో ఒక గెరాజుతు పెద్దమనిషి సన్నగా, నల్లగా దిగులుగా కూర్చున్నాడు ఏపుగా పండిన జొన్నచేలో, కంకులబరువుకి తలవాల్చిన మొక్కలా, అయిడియాల భారంతో దాదాపు నడ్డివరకూ ఆయన వంగిపోయాడు మోకాళ్ళమీద మోచేతులాన్చి ఎడమ అర చేతిలో మొహం దాచేసుకుని, కుడి చేతి వేళ్ళతో ఒత్తుజుత్తును లాలిస్తున్నాడు.

రాజూరాయుడూ సభామందిర మధ్యానికి వచ్చారు జోళ్ళు చప్పుడు చేసుకుంటూ సభలోఉన్నవారంతా హడలిపోయి వింతగా చూశారు వారివంక హాలాహాలం మింగబోతున్న శివుడిని దేవతలు అలా చూసి ఉండరు శిబిచక్రవర్తి పావురంకోసం అని తక్కెడలో ఎక్కుతున్నపుడు ఆయన ఫాన్‌లు అలాచూసి ఉండరు. సిడ్నీకార్టన్ తన ప్రియురాలిసౌఖ్యంకోసం గిలటన్‌లో తలపెట్ట తలపడినపుడు ప్రేక్షకులు అలాచూసి ఉండరు అయితే పైవాళ్ళు ఓ గొప్పకార్యం కోసం త్యాగం చేశారు మరి వీళ్ళు? వీళ్ళు దేనికోసం ఇంత త్యాగం చేస్తున్నారు? ఇంతటి సాహసం ఏల? అని పరిపరివిధాల తర్కించుకున్నారు డైరెక్టరుగారికి కోపం వస్తే వాళ్ళకి పుట్టగతులుండవే అని పరితపించారు ఇలా ఉండగా, దీనికి తోడుగా రాజు పేట్రేగిపోయి కాళిదాసు తాలూకు 'శాకుంతల (?)' డైలాగులాటిది ఒకటి అనేశాడు

మొదట అతనూ ఓర్పు చూపాడు. కుర్చీలో ఆయన తనకి మర్యాద చేసాడేమో నని ఆయన ఎంతకీ కదలకపోయేసరికి, శ్రద్ధగా చూశాడు. తెలివైనవాడు కాబట్టి ఓహో అనుకున్నాడు కారణం ఊహించేసి

'ఎవరు వీయారూ?' అన్నాడు గట్టిగా.

రాయుడికి పై ప్రాణాలు పైకిపోయాయి లోపలివి అరికాళ్ళదాకా దిగిపోయాయి

"ఏ ఎంతమాట అనేశారు అయనే డైరెక్టరుగారు మూడ్‌ లో ఉన్నారు ఇప్పుడే ఆయనకి అయిడియాలు అవుతున్నాయి" అన్నాడు రాయుడు భయభక్తులతో

అంతలోకి డైరెక్టరుగారే తలెత్తారు

'ఎవ్రా నువ్వు' అంది ఆయన మంద్రగీవం.

"నేనండి ప్రొడ్యూసర్నండి తమరి యజమానిని" అన్నాడు రాజు వినయంగా

"ఓ కూర్చో మాటాడకు" అన్నాడు డైరెక్టరుగారు

రాజు కూర్చున్నాడు 'యాక్టర్లు ఎవరెవరండీ మూజిక్కు ఎవరండీ రాంగ్సులు ఎవరండి' అన్నాడు ఉత్సాహంగా

'సైలెన్స్' అని గావుకేక పెట్టాడు డైరెక్టరుగారు సైలెన్సు చక్కా వచ్చి చేతులుకట్టుకు నిల్చుంది.

డైరెక్టరుగారు రాజుమీదకి అభిమానం రంగేసిన నవ్వు విసిరారు రాజు దానికి కృతజ్ఞత పులిమి ఆయనకి మళ్ళీ యిచ్చేశాడు.

'యాక్టరు ఇపుడెపుడేరారు రాత్రి ఏడింటికి వస్తారు. మ్యూజిక్ రెడీ అయినటె ఎవ్రా అక్కడ మ్యూజిక్ ఇలా తెండి' అన్నాడు డైరెక్టరు

సన్నటి నల్లటి కుర్రాడొకడు ఓ అట్ట పెటి తెచ్చి అందిచ్చి నిల్చున్నాడు

'ఇతనేనా మూజిక్ డైరెక్టరు?' అన్నాడు రాజు

'అబ్బే నేను కాదండి నాకేం తెలీదు' అన్నాడు కుర్రాడు తుళ్ళిపడి

డైరెక్టరు నవ్వాడు 'మ్మౌనం' అన్నాడు సగర్వంగా

'మీకు మూజికు డైరెక్షనింగుకూడా వచ్చా?'

'మీరు రాజా!' అని అడిగాడు డైరెక్టరు.

'అవుననుకోండి. !' అన్నాడు రాజు గుటకమింగి

"మరింకే అలా అడుగుతారు. ఇదిగో ఇందులో పన్నెండు పాటలున్నాయి పదకొండే అనుకోండి పదకొండో దేనా, పిక్చర్లో చాలుగోడి అన్నమాట అది సిక్స్ మినిట్ సాంగులెండి"

రాజు ఆశ్చర్యపోయాడు "ఎంత ఆశ్చర్యం! నేను చిన్న ప్రొడ్యూసరు అయ్యాను యివాళ్టికే మ్యూజికల్ రికార్డింగు ఫినిషింగయి పోయిందంటే-థ్రిల్లింగా ఉంది కదూ"

"కొంగుమరీ రికార్డింగేమిటి, ఈ సాంగ్సన్నీ హిట్ అయిన సాంగ్స్ అందుకే అందరూ ప్రొడ్యూసర్లూ నా సెలక్షనంటే, పడి ఛస్తారు"

"ఏదీ మాకిట్టివ్వండి" అన్నాడు రాజు అట్టపెట్టె అందుకుంటూ.

'వన్ మినిట్' అన్నాడు డైరెక్టరు ఆ పెట్టెమూత అదిమిపట్టి, 'ఇందులో ఎవరెవరుంటారు గెస్ చెయ్యండి' అన్నాడు

రాజుకి అర్థం కాలేదు. 'ఎవరంటా రేమిటి ఇందులో మనుషులుంటారా?' అన్నాడు రాయుడితో మెల్లిగా.

"అయన్నే చెప్పమను" అన్నాడు రాయుడు నవ్వి

డైరెక్టరు అట్టహాసం చేశాడు "ఓపీ నయ్యార్, నౌషాద్, రామచంద్ర— అఫ్ కోర్స్ శంకర్ జైకిషనూ, బర్మన్, బిశ్వాస్, సరే ఆంధ్రలో సాంగుకోసం త్రిపాఠీ అక్కడికేమయింది ఇండియాస్ బాక్సాఫీస్ మ్యూజిక్ డైరెక్టర్స్ ఏడుగుర్ని మన పిక్చరుకి బుక్ చేశాం అన్నమాట చూస్కో మరి తడాఖా".

"ఓరి నాయనో! వాళ్ళలో ఒక్కొక్కడినే మనం భరించలేమని పేపర్లో రాశారే! ఏడుగుర్నీ ఇంకేమన్నా ఉందా మనం పిక్చరు తీస్తున్నామా దివాళా ఎత్తుతున్నామా? వాళ్ళ సోడాలికే రోజు కిరవై రూపాయలవుతాయట — సోడాలతో నీళ్ళోసుకుంటార్ట. — మంచినీళ్ళు అలవాటు లేదు. బాదంకీరూ గ్లాసు తాగుతారంట ఏర్కండిషన్ లేకపోతే గదంతా అయి పిక్కిరిం పోయిస్తారట"

"మరేం ఫరవాలేదు అధైర్యపడకుడు. నేను రోజుకి పదిరూపాయలు దాటకుండా చూస్తాను" అన్నాడు. హఠాత్తుగా వచ్చిన ఒక నడికారు మీసాలాయన చాలా ఉత్సాహంగా.

"మీరెవరు?"

(వారిపేరు 'సశేష' గిరి ఉద్యోగం ప్రొడక్షన్ మేనేజర్ గిరీ ఏలాంటి ఖర్చులో నైనా డబ్బు కాస్తా కూస్తా 'శేషం' మిగ్తాడని వినికిడి). (సశేషం)

# చంద్రోదయం

దీర్ఘకాలంగా పంజరంలో బంధింపబడిన పక్షి దైవానుకూల్యంవలన బయటపడి, రెక్కలు విదుల్చుకుని స్వేచ్ఛావాయువుల్ని పీల్చుకుంటూ ఒక్కసారిగా పైకెగిరిపోయి నపుడు ఎంత ఆనందం పొందుతుందో అంత ఆనందం పొందుతోంది సుందరమ్మ

ఎదురుగావున్న అద్దంలో ఏ ప్రతిబింబం చూసి అసహ్యించుకుందో, విసుగుతో ఛీదరించుకుందో ఆ ప్రతిబింబాన్ని చూసే ఇపుడు సంతోషంతో మురిసిపోతోంది

ఇన్నాళ్ళూ తన ఉనికినే ఒక బరువుగా భావించిన సుందరమ్మ ఈ నాడు తన్ను చూచి తానే గర్వపడుతోంది

అసంతృప్తితో, నిస్పృహతో నిట్టూర్పులు విడిచిన సుందరమ్మ ఈ నాడు హాయిగా గాలి పీలుస్తోంది

మెల్లిగా పాడుకుంటూ మెడచుట్టూ వేళ్ళు పోనిచ్చి మంగళసూత్రం సరిచేసుకుంది విలాసంగా మందహాసంతో తన ప్రతిబింబాన్నొకసారి చూచుకుంది పరీక్షగా.

పరాగ సంపర్కం చెందిన పుష్పంలా వింతఛాయను పులుముకున్న శరీరం, పౌర్ణమినాటి చంద్రబింబంలావున్న ముఖకాంతి, మబ్బువీడిన వినీలాకాశంలో నిర్మలంగా వున్న మనస్సు, తన ప్రత్యవయవములోనూ ఏవో నూత్న పరిణామాలు గత మూడు మాసాలుగా జరిగిపోతున్నాయి!.

దీనికంతా కారణం?

చెప్పినపుడు నారాయణ వింటున్నాడు?

'సుందరం! నీకింకా ఈ పిచ్చి వదల్లా. ముప్పయ్యేళ్ళుదాటి ముసిలోళ్ళం అవ్వోత్తాంటే మనకింకాపిల లేంటే ఎర్రమొగవ?' అన్నాడు—పైకండువా దులిపి బుజాన వేసుకుని పొలం వెడుతూ

సుందరమ్మ మనసు చివుక్కుమంది కనుబొమలు కిందికి జారాయి ముఖం నల్లపడింది

కాని వెంటనే 'చెంచమ్మ పిన్ని' అన్న మాటలు గుర్తువచ్చాయి

'అలుడి మాటలకేం లేయే ఆడి కేప్పుడూ నువంటే పరాచికాలేగా ఎవరనూకారు? 'గొడ్డుమోతు గొడ్డుమోత'ని ఊర్లోవోళ్లంతా తిట్టిపోసిన అవధానిగారి భార్య నలబైయ్యేళ్ళొచ్చాక కనలా. అట్టాగే ఆ బగమంతుడి దయొల్ల నీ కడుపూ పండకూడదూ!'

కళకళలాడుతూన్న నవ్వు ముఖంతో కానీవెడల్పు బొట్టుపెట్టుకుని, వొదులుగా వున్న కొప్పు సరిచేసుకుంటూ చెంచమ్మ పిన్ని ఆ మాట లంటూంటే నిజంగా ఆకవకదుర్గమ్మే బెజవాడకొండ దిగివొచ్చి తనని దీవిస్తున్నట్టుగా తోచింది సుందరమ్మకి.

సుందరమ్మ పరమానందభరితురాలైంది!

నిజమే. తను తల్లికాబోతూంది ఏస్థానం చేరుకోవాలని ఇన్నాళ్ళూ తను తహతహలాడిందో ఆ స్థానం చేరుకోబోతూంది ఇహనుంచీ తను 'గొడ్రాలు' కాదు 'బిడ్డరాలు కాబోతూంది'.

ఒకనాడు కరణంగారింటికి పేరంటానికి వెళ్ళినపుడు తన్ని 'గొడ్డుమోత'ని పరిహసించిన షావుకారు వెంకటరత్నం భార్య జానకమ్మ ముఖం ఈ విషయం తెలిస్తే ఎలా తయారవుతుంది?

## "అంపేరాయని"

అప్పటికి పొద్దువాలి పోతూంది సుందరమ్మ గర్వంతో తెచ్చి చీర సవరించుకొంటూ పంచలోకి నడిచి వీధిలోకి చూచింది, భర్త వొస్తున్నాడేమోనని కాని సుందరమ్మకు కనపడింది నారాయణకాదు, ఆమె విరోధి జానకమ్మ!

బిందె బుజాన పెట్టుకుని ఊరి వెలపటి బావినుంచి మంచినీళ్లు తెస్తూంది జానకమ్మ వొళ్ళొంతా తెగవూపేసుకుంటూ

ఇంకో సమయంలో ఐతే జానకమ్మ కనిపించగానే సుందరమ్మ లోపలికి వచ్చేసేదే కాని ఆమెకు ఈ రోజు "నే సెంగుకు కదలాలి," అనిపించింది తనకేసి నడిచి వొస్తూన్న జానకమ్మనుచూస్తూ అలాగే పంచలో నిలబడింది సుందరమ్మ.

సమీపానికి రాగానే తల పైకెత్తి సుందరమ్మనుచూసి మూతి మూడు వంకలుగా తిప్పి ముందుకు నడిచింది జానకమ్మ!

సుందరమ్మేం సామాన్యురాలా? జానకమ్మ మూడు వంకలుగా మూతి తిప్పితే, తను పదహారు వంకలుగా తిప్పి విసవిసా లోపలికి నడిచింది గర్వంగా!

## 2

'ఏమేవ్ ఇదిన్నావా. సుందరమ్మ నీలోసుకుందంట'

'అదెప్పుడేవ్ నే యినలేదే'

'అదేంటే అలాగంటావ్ మీనాచ్చీ! నీకింకా తెలవదూ!'

'అబ్బే! నీవే ఒట్టు పెడితే ఆ ఒట్టు కవకమ్మదినా నాకసలు తెలకనే తెలవదు. ఎన్నాలయిందేంటి?'

'ఇంకా ఎన్నాలయిందంటా వేంటే. ఇది నాలుగోనెలంట'

'ఓసెమ్మా! ఇంతగావుందే!'

'ఇంతగాదంటే మరి ముప్పయ్యేళ్ళు దాటి ముసిలవ్వోత్తాంటే దానిక్కడుపేంటే నాకారం!'

'మరే! సీతమతి నాతో ఈ మాటన్నపుగు మానుకు మల్లే అయిపోయానంటే నమ్మ!'

'అవరంటేమరీ, యిసిత్రాలు జరుగుతాంటేనూ'

'కల్యాగవేం కల్యాగం ఇసిత్రాలు జరగవంటేమరి!'

ఒకరోజు సాయంకాలం, ఆవూరి అమ్మలక్కలు కొంతమంది ఊరి వెలపటి మంచి నీళ్ళ బావిదగ్గర చేరి ఈ విధంగా అనుకుంటున్నారు

ఆ సమయానికే అటువైపునుంచి పోతూన్న అవధానిగారి భార్య వీళ్ళని పలకరించి— 'ఏవిషే ఆవిచిత్రం సీతాలూ!' అని అడిగింది దూరంగా ఉండే.

'ఏవీలేదు అన్నపూర్నమ్మగోరూ! సుందరమ్మ- కడుపుతో వుండాదంట అదే అనుకుంటున్నాం,' అంది బావిలోంచి నీళ్లు తోడుతూనే సీతాలు.

ఆమాటలు వినటంతోటే అవధానిగారి భార్య కనుకుడు—బెటపడేలా చూస్తూ— 'ఏవిటేషీ! ఏవిటేషీ! దానిక్కడుపు బంగారంకానూ. సుందరమ్మ కడుపుతో వుందిషే! ఉండు ఫుండు అయితే ఇప్పుడేవెళ్లి విచారించి వొస్తాను' అంటూ చరచరా ముందుకు నడిచింది

'ఎక్కడికి అవధానిగారి భార్య మాదూకుడుగాపోతున్నాది' అంటూఎక్కణ్ణుంచో వూడిపడింది జానకమ్మ

'ఇంకా నీదాకా రాలేదా జానకమ్మా! నారాయణపెళ్ళాం కడుపుతో వుందంట' అని తను తెలుసుకున్న విషయం చెప్పింది ఒక పడుచుపిల.

'ఓసినీ, ఇది నమ్మేమాటేనంటే' అంది జానకమ్మ తెచ్చినబిందె కిందపెట్టి, రెండు చేతుల్లోనూ నడుంపట్టుకు నిలబడి

'కావాలంటే అల్లుడుగో చెంగమపిన్ని వొస్తోందిగా అడగరాదూ'' అంది దూరం నించి గడ్డిమోపు నెత్తిన పెట్టుకుని నడిచి వొస్తూన్న చెంచమ్మని చూపించి.

'ఏం చెంచమ్మా! మీసుందరమ్మ నీలోసు కున్నమాట నిజమేనా?' అని అడిగింది జానకమ్మ చెంచమ్మ దగ్గరికిరాగానే

'అది నాకేం తెలుసూ! దానికీ ఆ బగమంతుడికీ తెలవాలి ఆసంగతి' అందిచెంచమ్మ నడుస్తూనే

'వొయిసు మళ్ళిన ఈడులో ఇదేం విడ్డూరం చెంచమ్మా! అది గడ్డాబిడ్డా' అంది జానకమ్మ ఆశ్చర్యం పట్టలేక

'జానక మ్మొవ్! పిల్లలుగలదానివి మంచీ సెడూ లేకండా మాటాడమాక. సుబవాం అది కడుపులోంటే నీకే వొచ్చింది కష్టం! అంటూ నాలుగు చీవాట్లూ పెట్టి ఇంటదారి పట్టింది చెంచమ్మ

'అబ్బో! దాన్నంటే ఎక్కడ లేని రోషం దీని కొచ్చిపడింది!' అంటూ జానకమ్మ చెంచమ్మ వెనకాల మెటకలు విరిచింది.

*  *  *

ఆ రోజు సుందరమ్మ ఆచార్లుగారి భార్య పంపిన పులిహోర అవధానిగారి భార్య ఇచ్చిన దధ్యోదనం, మునసబుగారి భార్య తెచ్చియిచ్చిన ముంతమామిడిపళ్లూ అన్నీ కోరిక తీరతిన్నది

దొడ్డో కాసిన దానిమ్మపండు గింజలు ఒకొక్కటే నోట్లో వేసుకుంటూ, తాతలనాటి వాలుకుర్చీలో కూచుని ఆ మధ్యాహ్న సమయంలో ఏదో అల్లికంపని చేసుకుంటోంది అనుకోనట్లుగా ఆమెదృష్టి పెరట్లో వున్న పనసచెట్టుపైన పడింది సుందరమ్మకు పనస తొనలపైన గాలి మళ్ళింది. కనపడేది ఇంకా చిన్నచెట్టే! దానిమీద ఆశ పెట్టుకుని ప్రయోజనం లేదు

'ఆయన్ని బస్తీకిపంపి పనసతొనలు తెప్పించుకోవాలి,' అనుకుంది మనసులో

'ఏవే పిల్లా నే వుండా? నేనింకా నిదరపోయావనుకుంటుండా' అంటూ ఒక పళ్ళెంలో మినప సున్ని వుండలు పెట్టుకుని వీధి గుమ్మంలోంచి ప్రత్యక్షమైంది పక్కింటి చెంచమ్మ.

'నాకు సారె తెస్తావాపిన్నీ!' అంటూ కుర్చీలోంచి లేచి ఎదురువెళ్ళి పళ్ళెం అందుకుంటూ-' పోనీలే నాకు పుట్టింటోళ్లు లేరనుకోకండా నీవైనా వున్నావు,' అని చీరకొంగుతో కళ్లువొత్తుకుంది సుందరమ్మ గత జీవిత స్మృతులు జ్ఞప్తికిరాగా.

'అట్టా గుక్క పో మాకే పిచ్చిపిల్లా! దేవుడులాంటి బర్తవున్నాడు. తింటానికి ఇంత కూడుంది నీకేం తక్కువే ఇంక కొన్నాళ్లుపోతే అబ్బాయినో అమ్మాయినో ఎత్తుకుని తిరుగుదూ గాని దయిర్యంగా వుండు!' అని సుందరమ్మని ఊరుకోబెట్టి- 'ఒరే నే కూతురా అవతల సన్నాడ్పుకో పోయేఅంత పనుంది' అంటూ అప్పటి కప్పుడే అక్కణ్ణుంచి మాయమైంది చెంచమ్మ

పళ్ళెంచేత పుచ్చుకుని వంటింటివేపు నడిచింది సుందరమ్మ

*  *  *

'చెంచమ్మతా! చెంచమ్మతా!' అని కేక వేస్తూ పక్కింటికి పరిగెత్తాడు ఆరోజు అర్ధరాత్రి సమయంలో నారాయణ.

'ఏవిట్రా అల్లుడా! ఏమైంది!' అంటూ అదిరిపడి లేచింది చెంచమ్మ నిద్ర మంచం మీదనుంచి

'దానికడుపులో నెప్పంట గోలపెడుతోంది నిన్ను పిలుసుకురమ్మంది,' అన్నాడు నారాయణ

'సరె పద,' అంటూ వున్నపాళంగా నారాయణవెంట నడిచింది చెంచమ్మ

ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు సుందరమ్మ పక్కమీద పడుకుని బాధ పడుతోంది చెంచమ్మ మారుమాట్లాడకండా లోపలికి నడిచీ నిప్పుచేసి, అప్పటికప్పుడు వాయిమీద ఏవిటో కాచి ఇచ్చింది

'ఆయీ ఇయీ తిందిగదంట్రా దానికీ ఈ కడుపులో నెప్పి. కాసేపట్లో అంతా తగ్గిపొద్దిలే!' అని ధైర్యం చెబుతూ ఆ రాత్రంతా అక్కడే గడిపింది చెంచమ్మ.

కాని ఆ కడుపులో నొప్పి మరుసటి రోజు కూడ వొచ్చింది ఆదే విడవకుండా వారంరోజులు వొచ్చింది! చెంచమ్మ తనకి తెలిసిన వైద్యాలన్నీ చేసింది కాని ప్రయోజనం కనపడలేదు నొప్పి రోజురోజు!






"అయ్యా! గీతారహస్యం మీ షాపులో దొరుకుతుందా?"

ఎక్కువైంది

చెంచమ్మ విసిగి మాదిగపాలెంలో వున్న మునెమ్మను తీసుకొచ్చి చూపించింది.

మునెమ్మ వచ్చి పరీక్ష ప్యాసైంది. ఆమె సుందరమ్మను పరీక్షించి 'ఇది బిడ్డ కాదు. కడుపులో బల్ల కట్టింది టౌనుకు తీసికెళ్ళి హాస్పిటల్లో మందిప్పించండి. అని సలహా ఇచ్చింది.

చెంచమ్మ నిర్విణ్ణురాలయింది.

నారాయణ బరువుగా తలదించుకున్నాడు.

*　　*　　*

'నే సచ్చినా బస్తీలో మందు పుచ్చుకోను. నా కడుపులోది బల్ల కాదు బిడ్డే, ఆపాడుమందులుతిని నా బిడ్డను పోగొట్టుకోను.' అంటూ సుందరమ్మ మంకు పట్టు పట్టింది.

నారాయణ బతిమాలాడు

చెంచమ్మ ఎన్నో విధాల చెప్పిచూసింది

'ధస్తీనే ఛస్తాను మీ కెందుకుపొండి,' అంటూ ఏడవటం మొదలెట్టింది సుందరమ్మ!

'సరే! ఏంచేదాం అల్లుడా దాని గవాచారం ఎట్టాగుంటె అట్టా అవుద్ది, అంది చెంగమ్మ విసిగిపోయి

కాని ఆ చెంచమ్మే వొచ్చి నొప్పి వొచ్చినప్పుడల్లా సుందరమ్మకి పరిచర్యలు చేసేది అలా రోజులు దొర్లుకుపోయాయి.

*　　*　　*

## 3

'పిన్నావాఁ పొద్దుటాలనించీ నారాయణగారింటి కాడ సిన్న కారు వొచ్చుంది, యాడదే!'

'అదా బస్తీనించి వొచ్చింది లేవే. సుందరమ్మ పెసవిత్తాందంట'

'ఓయమ్మావ్! అదెంటే అట్టాగంటావ్ మాలెమ్మపిన్నీ! పొద్దుటాలనుంచీ పెసవిత్తానే వుందా సుందరమ్మ'

'కాదె కనపొద్దులయి కనపడతావుంటే బస్తీనించి పిలిపించారంట దొరసానమ్మని.'

'అయితే గంగమ్మా! అది కడుపేనంటావంటే!'

'ఏమోనమ్మా నాకేం తెలుసూ మునెమ్మ సెప్పనే సెప్పిందంట కడుపులోది బిడ్డకాగు బల్లని'

'అయినా ఈరోజుల్లో మనుసులకి మనుసులు పుడతన్నారంటే ఈరమ్మా ఆడాన్నో ఒకఊరో ఎవరో నీలాడితే తాంబేలు మాదిరిగా పుటేందంట ఏంటో మొన్న మా పెద్దోడు పేపర్లలో సదువుతోం టేయినాన్నే'

'పలక్కుండావుండే పిన్నావా. మన కెందుకు ఎవుళ్ళన్నా ఇన్నా యినుకుంటారు'

'అవున్లే అమ్మాయా! లేనిపోని గొడవలు నాకెందుకూ'

'ఇంతెందుకే తెల్లారేయాలకి బయటపడదంటే ఆ బండారం ఏంటో'

'ఎడితే నాకేం పడకపోతే నాకేవేఁ. ఇంటికాడ ఎన్ను కట్టుకుపోయినంతి పనుంది పోన్లా'

'నీకొక్కదానికేనా పనుంది పెద్దమ్మా! మేవుఁకూడ వత్తన్నాం, పద'

ఆరోజు మునిమాపువేళ మొదలైన సభ ఆ విధంగా ముగిసింది.

లోకం ఎన్నిరీతులుగా అనుకున్నా ప్రకృతి తన పనితను నిర్వర్తించింది.

ఆరోజు చంద్రోదయంతోపాటే సుందరమ్మకి—శిశూదయం కూడ అయింది.

వచ్చి వొచ్చి ఈ వార్త అందజేసినపుడు నారాయణ సంతోషంతో ఉక్కిరి బిక్కిరవుతూ ఎక్కింటికి పరిగెత్తాడు చెంచమ్మతో ఆ విషయం చెప్పటానికి

చెంచమ్మ నారాయణ చెప్పిందంతా విని—'అట్టాగా నారాయణా! దాని బుద్ది గడ్డకట్టె మునెమ్మకూడె కడుపులో బల్ల నే కాదంట్రా చెప్పింది ఎవరెట్టా అనుకుంటేయేం అది సుకంగా నీలాడింది అంతా ఆ ఎంకటేశరసామి దయరా అలుడూ! మనదేవుంది' అంటూ నారాయణ వెంట నడిచి సుందరమ్మ వున్న గదిలోకి వొచ్చింది

అలసివున్న శరీరంతో అచేతనంగా మంచంపైన పడుకునుంది సుందరమ్మ!

చెంతనే వున్న సుందరమ్మ పడక సమీపించి పొత్తిళ్ళలోవున్న బిడ్డ చిబుకంపుణికి—'నీ కడుపు చల్లగా గుమ్మడిపండులాంటి మగబిడ్డను కన్నావే నా తల్లి!' అంటూ రెండు చేతుల్తో సుందరమ్మ చెంపలు నిమిరి తన కణతల దగ్గర ..చిటపట లాడించింది చెంచమ్మ

బరువుగా ఒకసారి కళ్ళు తెరిచి చూసి నవ్వి వెంటనే కళ్ళు మూసేసుకుంది సుందరమ్మ

బయట ఆకాశంలో చంద్రుడు చల్లని వెన్నెల కాంతులు లోకంపైన చల్లుతున్నాడు.



# మలుపులో పరిమళం

కుసుమ మొదటిసారి రామకృష్ణను చూసి పొంగిపోయింది ఈ సంబంధంగాని కుదిరిందా. అప్పుడూ అని లోపల్లో తేలిపోయింది అబ్బాయి లాడూలా వున్నాడు ఉత్సాహవంతుడుగా కనిపించాడు. మంచి ఉద్యోగంలో వున్నాడు. ఇక నాన్నగారు 'మా అల్లుడు ఫలానా అని' ఏం నామర్దా అనుకోకుండా, రీవిగా నిల్చుని చెప్పి తృప్తి పడతారనుకుందామె

"హాయిగా పట్నంలో కాపురం పెట్టాక అమ్మనూ, చెల్లెళ్ళనూ అందర్నీ తీసుకెళ్లి పట్నం చూపించాలి అక్కడ మంచి బంగళా ఒకటి అద్దెకు తీసుకోవాలి. అందులో కాపురం పెట్టాలి ఇప్పుడు ఆయన వున్నది మంచిఇలు కాకపోతే, మొదటిరోజే ఆయనకు నచ్చజెప్పి, ముందుగా ఇల్లు మార్పించేయాలి మంచి పనిమనిషిని కుదుర్చుకోవాలి ఆయన కుదిర్చిన పనిమనిషి నాకు నచ్చకపోయిందా తన్ని తగలేసి పొమ్మంటాను అంతే అవన్నీ చూసుకోవలసింది నేను అసలు ఇంటి వ్యవహారా లేవీ మావాళ్ళకు వదలకూడదు వాళ్లు నానా హంగామా చేస్తారు ఉట్టినేగొప్పపోవడం తప్పించి నాణ్యమూ, పొదుపూ, జాగ్రతా ఏమీ తెలీవు వాళ్లకి. ఈమగాళ్లు ఉటనే తెక్కలేస్తూ వుంటారుగానీ నిజానికి వీళ్ళకేమీ తెలీగు తమకు తెలీదని తమకు లోపల తెలిసినా పైకి చనేవొప్పుకోరు ప్రతిభర్తా భార్యదగ్గర తను 'సర్వజ్ఞుడు' 'సర్వసమర్థుడు' అని బుజావు చేసుకోడానికి ప్రయత్నిస్తూనే వుంటాడు. కానీ తనముందే అలాంటి 'తెలివిగలది' వుంటే గమనించడు ఏంమగాళ్ళో!

ఇంకోటి! ఆయన రేడియో కొన్నారో లేదో! ఏం అక్కడ ఎలెక్ట్రిసిటీవుందిగా. రేడియో ఎందుకు కొనకూడదూ? ఏ రెండు వందలో ఇస్తే దక్కా ఓ రేడియో వచ్చేస్తుంది కావలిస్తే ఎవరన్నా వచ్చినప్పుడు 'ఇదా ఫలానా రేడియో లెండి' అనేసి, 'మొన్న నే కొన్నాం. నే నే కొనమన్నాను ఆయన వెంట నేవెళ్ళి కొనుక్కొచ్చేశారు ఖరీదుకూడా ఎక్కువేమీ కాదు అంతా ఓఐదువందలం తే! తక్కువఖరీదు రేడియోలో పాటలూ అవీ స్పష్టంగా వినపడవని ఆయనే అన్నారు! నేనేమో చెప్పాను 'ఈ విధవ రేడియో కోసమని ఇంత డబ్బు దండుగెందుకండీ! ఉన్నది మనమిద్దర మేకదా' అని కానీ ఆయన విన్లా ' ఇలా దంచేయాలి'

"అమ్మా, చెల్లెళ్ళూ, తమ్ముళ్ళూ, అందరూ అప్పుడు అక్కడికి వచ్చారనుకో! అన్నట్టు ప్రక్కింటి శారదను కూడా తీసుకుపోవాలి లేదా రమ్మనిరాయాలి దానికి, తనెందుకూ పనికిరానిదనీ తన్నెవడూ పెళ్ళి చేసుకోడనీ అంత సాహసం చేయగలిగినవాళ్లేవరూవుండరనీ, ఓ అభిప్రాయముంది ఉండనీ, ఉండనీలే! ఆఁ—అప్పుడు వాళ్ళందర్నీ వరసగా రేడియో గదిలో నిశ్శబ్దంగా కూర్చోబెట్టాలి. అందరూ కుర్చీల్లో, సోఫాలో హాయిగా కూర్చుంటారు అప్పుడు పేపరు తీసి ప్రోగ్రాం చూడాలి మొన్న వాళ్ళింటికి వెళ్ళినప్పుడు కంట్రాక్టర్ కృపారావుగారి భార్య చూసిందే అలా చూడాలి చూసి అచ్చు రేడియోలో లాగే "ఇప్పుడు సిలోన్ అనే నగరంలోని రేడియో


రాజేంద్ర


స్టేషన్నుంచి 'లలిత్ మహమ్మద్ పాటలు వినిపిస్తాడు అక్కడ రేడియో స్టేషన్ అని ఒకటుంటుంది, అక్కడ పాడితే మన మిక్కడ వింటామన్న మాట!" అని రేడియో తిప్పేయాలి ఝామ్మని పాటలు తియ్యని పాటలు నిజానికి ఈ రేడియో గురించి తనకూ అంతే తెలీదు. అవన్నీ ఆయన్నడిగి తెలిసి పెట్టుకోవాలి—

"చూశావా నా కూతురు" అని శారదకేసి చూస్తుంది అమ్మ శారద ఆఁ ఔరా" అని తన సోగకళ్లు క్రిందకి వాల్చేసి వూరుకొంటుంది

అప్పుడు "పాట బావుందా" అని అడుగాలి తను అది పాపం "బావుంది చాల బావుందే" అని చచ్చినట్లు వొప్పేసుకుంటుంది వొప్పుకోకేం జేస్తుంది మరీ!

"ఊఁహూఁ అప్పుడే అంత దూరం వెళ్ళింది కథ చాల్చాలు ఊరుకో. వూరుకో" అని ఊహాగానం కట్టేసింది కుసుమ!

"అయినా ఈ సంబంధం కుదుర్తుందో లేదో! నాన్నగారు నా మాటకొస్తే విలువిస్తారుగానీ, ఆయన కొంచం తిక్కవుంది ఆ తిక్కతో ఏమంటారో ఊహించలేం కదా! ఆ అబ్బాయి కాస్త దక్కగా ప్రవర్తిస్తే సరి లేకపోతే 'కాడీ కట్టాడనేసి కొట్టిపారేస్తారు దేవుడా! ఆ అబ్బాయి కాస్తా ఈ ఒక్కపూట సరిగ్గా నడుచుకొనేలా చేయి తర్వాత నేను సరిదిద్దుకొంటాను" అని ప్రార్థించింది

"నేను మీకు కావలిస్తే! పాశుపతాస్త్రం కోసం అర్జునుడు, తన ప్రాణం కోసం మార్కండేయుడు శివుణ్ణి మెప్పించినట్లు, సావిత్రి భర్త ప్రాణాల కోసం యముణ్ణి మెప్పించినట్లు . ఏదో 'అట్లు' ఆయన్ని మెప్పించండి" అన్నట్లు రామకృష్ణకేసి చూసింది తను అర్థం చేసుకున్నాడు "సరేలే నాకన్నీ తెలుసులే" అన్నట్లు కళ్లు త్రిప్పాడు

*   *   *

సంతోషంతో కుసుమ చేగుతున్న తాడుని బావిలోకి వదిలేసింది 'సెటిలయిందో' అని తమ్ముడు బావిదగ్గర కొచ్చి చెప్పాడు. అతను చెప్పిన క్షణంలోనే ఆమె చేతులు తాడును వదిలేశాయి

*   *   *

కుసుమ రేడియో ట్యూన్ చేసింది రేడియోనుంచి ప్రణయగీత మేదో వినిపిస్తోంది. కుసుమ హృదయమనే రేడియో నుంచి విషాదగీత మేదో వినిపిస్తోంది!

కుసుమ కాపురానికివచ్చి కొద్దిరోజులే అయింది జీవితయాత్రలో రస్తా మలుపు తిరిగింది

# ★ మలుపులో పరిమళం ★

ఈ కొద్దిరోజుల్లోనూ భర్త రామకృష్ణ ఆమెకెన్నో చెప్పాడు. ఆయన కబుర్లు చెప్పడంలో మంచి ప్రవీణుడని ఆయన చెల్లెలు చెప్పింది. కానీ ఆ ప్రావీణ్యమే ఇప్పుడామెకు కష్టం కలిగిస్తోంది. ఆయన చెప్పేమాటలు ఆమెను అయోమయంలోకి తోస్తున్నాయి ఆమె ఉత్సాహం తగ్గిపోతోంది. ఆయన ఉద్దేశం ఆమెకు బోధపడటంలేదు. అసలు, ఆయన ఎందుకలా అంటున్నారో ఆమెకు బోధపడటంలేదు మొదటి రాత్రినుంచీ ఆయనది ఒక్కటే పాట:

“ఇక నువ్వే నా సర్వస్వం నీ అక్కచెల్లెళ్ళు, తమ్ముళ్ళు, అమ్మా, నాన్నా, పిన్ని వగైరా నీ బంధువులందరూ మరి లేనుకో వాళ్ళంతా నీ జీవిత పూర్వరంగంలో తారసపడ్డారు. తర్వాత రంగంలో భర్త ఒక్కడే నీ సహవాసీ, నీ బంధువున్నూ! ఇక నువ్వు నీ పూర్వరంగంలో వాళ్ళందర్నీ మరచిపోవాలి వాళ్ళను గురించి ఆలోచించడం మానేయాలి. ఇక మనిద్దరం ఒకటి! మన బాగోగులు మనం చూసుకోవాలి మన శ్రేయస్సుగురించి ఆలోచించాలి”

“పుట్టింటిమీది ధ్యాస మరచిపోవాలి. పుట్టింటిమీది మమకారం ఒక వ్యాధిలాంటిది. ఆ వ్యాధి మన జీవితాల్ని నాశనంచేస్తుంది: ధ్యాస అక్కడవుంటే ఇక్కడ నువ్వే సుఖమూ అనుభవించలేవు ఇన్నాళ్లు అక్కడ నీ తమ్ముళ్ళు, చెల్లెళ్లతో ఎంతో కులాసాగా గడిపివుంటావు కానీ ఇప్పుడు నువ్వు పెద్దదానివయ్యావు ఇప్పుడు నీ స్వంత ఇల్లు, భర్త ”

ఇలా ఆయన మాట్లాడుతూ వున్నారు. ఆమెకు బోధపడటం లేదు. తన తమ్ముళ్లు చెల్లెళ్లను తనెందుకు వదులుకోవాలి. సుభద్ర ఎంతమంచి పిల. ఒక్కక్షణం తను లేకపోతే వూరుకోలేదు దానికి తనతో డిదే స్వర్గం ఎన్ని అల్లరిపనులు చేస్తే ఏం? సుభద్ర చలాకీతనం ఎవరికొస్తుంది! సుభద్ర సుశీ, మాలతీ రాముడు సూరీ వీళ్ళ మధ్య తన బాల్యం ఎంత అద్భుతంగా ఆనందంగా గడచిపోయింది! ఆటలతో పాటలతో, చీకూ చింతా లేకుండా కోపతాపాలు లేకుండా ఎల్లా గడిచి పోయాయి రోజులు! తను పెళ్ళి చేసుకొన్నంతమాత్రాన తనబాల్యం గతించిపోయిందా! ఇకతనలా ఆనందంతో వుండటానిక, ఆడుకోడానికీ వీల్లేదా! ఇదేనా పెళ్ళంటే, ‘అమ్మవారి భక్తుడుమల్లే ఆయన దగర జపం చేస్తూ కూర్చోవలసిందేనా! ఆయన ఇంతమంచి వారు మరి! ఆయన కిదేం బుద్ధో! ఇకతను చెల్లెళ్లు, తమ్ముళ్లు, అన్నయ్యల్ని చూడటానికి వీల్లేదా! అసలు వాళ్ళందరూ తనను విడిచివుండగలరా! ముఖ్యంగా అమ్మ!

అమ్మ తనని ఎంత ముద్దుగా, శ్రద్ధగా పెంచింది? ఎన్ని విషయాలు నేర్పింది? ఎంతదానిని చేసింది అలాంటి అమ్మకూ తనకూ ఇంకే సంబంధమూ లేదా! అమ్మో! ఇదేనా పెళ్ళంటే !?

ఆయనే తన సర్వస్వం కావచ్చు. ఆయన్ను తను ఆరాధ్య దైవంగా పూజించుకోవచ్చు, కానీ ప్రపంచంలో తనింకెవరితోటీ స్నేహంగా వుండకూడదా!,

“అమ్మా ఎక్కడున్నావమ్మా
నాన్నా ఏం చేస్తున్నావ్ నాన్నా
సూరీ ఇంకా బువ్వతిన్లా
మాలతీ ఆడుకోమ్మా!
సుశీ సూరీ సుభద్రా రాముడూ
గోపీ మీరంతా ఇంక నాకు శత్రువులు”

ఇంతలో ఆమెకు మరో ఆలోచన తట్టింది ‘పాపం ఆయన ఉద్దేశ్యం అది కాదేమో! తనకూ టిమటికీ పుట్టింటికి

జాబుంగేమోనని ఇలా చెప్పారేమో అయన తనని విడిచి వుండలేరు అందుకని ఇలా పుట్టింటిని కొంత మరిపించాలని చూస్తున్నారేమో స్వతంత్రమైన ఆలోచనలతో ఇక తను తానుగా పెరగడానికి వీలు కల్పించాలనుకొన్నారేమో. .

రేడియో సంగీతం విసుగు కల్పించింది. టక్ మని రేడియో కట్టేసింది.

పుట్టింటిని తలచుకొనేకొద్దీ ఆమెకు విచారం వేయసాగింది. పుట్టింట్లోని ప్రతి అణువులోనూ తను కలిసిపోయింది తన ప్రతి అణువులోని చైతన్యమూ పుట్టింటిలో పుట్టినదే! అలాంటి పుట్టింటికీ, తనకూ ఈకొద్దిరోజుల్లో ఇంతపెద్ద అఖాతం ఏర్పడిపోయిందా!

. .. .. . . . .. ...

* * *

రామకృష్ణ ఒక కంపెనీలో మానేజరుగా పనిచేస్తున్నాడు ఉద్యోగంలో చేరినరెండేళ్ళకే అతను చాల మంచి పేరు తెచ్చుకున్నాడు. ఆ కంపెనీకి ఇండియా అంతా బ్రాంచీలున్నాయి. అందులో ఒక బ్రాంచీకి రామకృష్ణ మేనేజరు ఇలాంటికొందరు మేనేజర్లను ఆ కంపెనీవాళ్లు విదేశాలకుపంపడానికి నిశ్చయించారు రామకృష్ణను కూడా పంపించదలచినట్లు రామకృష్ణకు తెలియజేశారు. ఆ శుభవార్త తెలిసినవెంటనే రామకృష్ణ ఆ విషయాన్ని కుసుమకు చెప్పడానికి తన సైకిలెక్కి ఆఫీసునుంచి సరాసరి ఇంటికి బయలుదేరాడు

సైకిలు ఇంటి వరండాలో ఆపి, లోపల ప్రవేశించాడు అతని కెదురుగా అశ్రులు చిందిస్తూ "అమ్మ-ఇంక మీరంతా నన్ను మరచి పోవాలమ్మా! అని ఇంటి కప్పుకేసి చూస్తూ సన్నగా జీరపోయిన గొంతుతో అంటున్న కుసుమ కనిపించింది. ఆలోచిస్తూ తొందరగా ముందుకు నడిచాడు. అతనికి కొద్దిగా పరిస్థితి అవగాహనైంది

మెలగా దగరచేరి తిన్నగా ఆమె భుజం తట్టాడు. ఆమె మేలుకొంది! కళ్ళెత్తి చూసింది.

"ఏమండీ నన్నింక మాయింటికి వెళ్లొద్దంటారా! మనింట్లోనే వుండి పొమ్మంటారా"అంది ఆ గొంతులో కరకరలాడే 'భాష' అతణ్ణి కదిలించి వేసింది. "ఇంకా మా యిల్లంటుందేమిటా నే నింత చెప్తే ఇదేనా ఫలితం"మనుకొన్నాడు మొదట 'మా' తర్వాత 'మనిల్లు' అనే పదం వాడటంలోని ఆఅమ్మాయి—'సహజ స్వభావంలోని' విశిష్టత అతనికి అర మైంది పుట్టింటమీది ఆమె సహజమైన అభిమానం అతనికి ముందే తెలుసు అయితే అతని ఉద్దేశం వేరు ఆమె మనస్సు జీవనది నీటిని పంటపొలాలమీదికి మళ్లించినట్లు తన మీదికి సంపూర్తిగా మళ్ళించుకోవాలనుకొన్నాడు. ఆమెకు కొంత స్థిరమైన 'మనస్సు' ఏర్పడ్డతర్వాత చదువూ అదీ చెప్పించాలనుకొన్నాడు మంచి విజ్ఞానవంతురాలిని చేయాలనుకొన్నాడు

ఇప్పుడామెకు ఏది ఎలా చెప్పాలో వెంటనే తోచలేదు కొన్ని నిముషాలు 'మౌనంగా' గడిచాయి. ఆ 'నిముషాలలో' ఎవరూ శోకం కలుగజేసుకోలేదు.

"కుసుమా! నన్ను విదేశాలకు పంపిస్తున్నారు మూడు మాసాలు నిన్ను వదిలి వుండాల్సి వుంటుంది ఎలా వుండగలనో తోచడంలేదు నెలరోజుల్లో బయలుదేరాలి" అన్నాడు, ఆమె ముఖంలోకి చూస్తూ! ఆమె ఏమీ మాటాడకుండా విప్పారిన నేత్రాలతో చూసింది ఆ కళ్ళు నవ్వుతున్నాయి "మూడుమాసాలు ఎలావుంటాం కుసుం"అని ఆమెభుజాలు వూపాడు, తన రెండు చేతుల తోటి రామకృష్ణ ఆమె మరింత కదలిపోయింది. 'అవును మూడు మాసాలు ఎలావుండటం? ఇంత త్వరగా, ఇంత కాలం వియోగాన్ని అనుభవించే పరిస్థితి ఏర్పడడమా! ముఖ్యంగా ఆయన తనని విడిచి ఒక్కరోజు వుండలేరు తను మాత్రం ఎలా వుండగలుగుతుంది పెళ్లియింతర్వాత, తనసొంతమంటూ ఒకటి ఏర్పడిన తర్వాత తను చేయవలసిన దేదో ఒక చోటుంటే పుట్టింట్లో ఎలా వుండగలుగుతుంది! ఇప్పటి పుట్టింటి మీది 'ధ్యాస' కన్న అప్పుడాయన మీది 'ధ్యాస' వేయిరెట్లెక్కువయి కలవర పెడుతుంది!

"మీరు నిజంగానే వెళ్లాలండీ" అని భర్తను చుట్టుకొంది కుసుమ

కొన్ని నిముషాలు రామకృష్ణ తనను మరచిపోయాడు

"నిన్నుకూడా తీసుకెళ్తాను కుసుం! నీ ఖర్చు మనమే భరించగలిగితే, నిన్ను తీసుకెళ్ళడానికి వొప్పుకుంటారేమో చూస్తాను" అన్నాడు.

ఆమె అతుకాన జియ్యని విమానంలో ఎగిరిపోతున్నట్టు, క్రిందుగా అమ్మ నాన్న పిలుస్తూ శారదా ఇరుగూ పొరుగూ, చేతులూపుతున్నట్లూ తను ఆయన మీద మెడవాల్చి సన్నగా సినిమా పాట ఆలపిస్తున్నట్లూ భావించుకొని వివశురాలై భర్త మీదికి మెడ వాల్చేసింది కుసుమ! ★




[ఆ ది ప ర్వ ము — తృ తీ యా శ్వా స ము]

వ. మఱియు గర్భయోనియందు ఋతుపుష్పరససంయుక్తంబగుచు రేతంబుగాడ్పుచేతం బ్రేరితం బయి కలసినయందుఁ బంచతన్మాత్రలుపొదవయి క్రమంబున నవయవంబు లేర్పడి లబ్ధజీవులయి యుద్భవిల్లి శ్రోత్రంబుల శబ్దంబును నేత్రంబుల రూపంబును ఘ్రాణంబున గంధంబునుజిహ్వనురసంబునుద్వక్కునస్పర్శంబును మనంబున సర్వంబును నెఱుంగుచుఁ బూర్వకర్మనియోగంబునదుష్కృతంబును సుకృతంబును జేయుచు దుష్కృతబాహుళ్యంబునఁ బుణ్యంబు గీడ్పఱిచి బుద్ధివిరహితంబు లైన తిర్యగ్యోనులందుఁ బుటుదురు సుకృతబాహుళ్యంబునఁ బాపంబు గీడ్పఱిచి బుద్ధియుక్తులై మనుష్యయోనులందుఁబుట్టి యుక్తాచారులును దత్త్వవిదులును నయి దేవత్వంబునం బొంది విశుద్ధజ్ఞానులయి ముక్తు లగుదురు మఱి యుక్తాచారు లెవ్వ రనిన గురుశుశ్రూష సేయుచు నిత్యాధ్యయనాగ్ని కార్యంబులయందప్రమత్తులయి శమదమశౌచంబులుదాల్చియవిప్లుత బ్రహ్మచర్యులయిన బ్రహ్మచారులనుబాపంబునకుఁబరోపతాపంబునకు వెఱచి ధర్మ్యంబైనవిత్తంబున నతిథులం బూజించుచు యజ్ఞంబులుసేయుచుఁ బరుల యీనిధనంబులు పరిగ్రహింపక నిత్యానుష్ఠానపరులయినగృహస్థులును నియతాహారులై సర్వసంగంబులు విడిచి జితేంద్రియులై నవానప్రస్థులును వనంబులనుండిగ్రామ్యవస్తువుల నుపయోగింపక గ్రామంబులనుండి శరీరధారణార్థంబు నియతస్వల్పభోజనులయి నగరప్రవేశంబు పరిహరించి కామక్రోధాదులం బొరయక శౌచాలంక్రియారతు లయి సర్వద్వంద్వంబులు నొడిచి సర్వసంగవివర్జితు లయి యేకచరు లయి యనేకనికేతనులై నయతులును ననువీరలు దమతమపుణ్యాచారంబులజేసి క్రిందం బదిదరంబులవారిని మీఁదం బదిదరంబులవారిని దమ్మును నుద్ధరింతురుగావున.

క. మౌనాగ్ని హోత్రమును మఱి, మౌనాధ్యయనమును మౌన మౌనంబు నవి
జ్ఞానమున మౌనయజ్ఞము, నా నయథార్థంబు లివియు నాలుగు నుర్వీన్

వ. అని యయాతి యష్టకాదు లడిగినవాని నెల్ల సంక్షేపరూపంబునం జెప్పుటయు వార లి ట్లనిరి

తే. సకలధర్మవిదుండవు సర్వలోక, వర్తనము లెఱింగినపుణ్యాకర్త వీవు
నెయ్య మొనరంగ నెఱిఁగింపు మయ్య మాకు, వెలయఁ బుణ్యలోకంబులు గలవె యనిన.

వ. మీకుం బుణ్యలోకంబులు గలవని యయాతి సెప్పిన విని యన్నలువురు సంతోషించి యేము నీదౌహిత్రులము సుమ్మని తమ్మెఱింగించి వానికిఁ బుణ్యలోకంబు లిచ్చిన నట్లయ్యయాతి సత్సంగంతింజేసి తానును దౌహిత్రులు నూర్ధ్వలోకంబునకుం జనియె నని.

క. ఆయతులపుణ్యునకు జనమేజయునకుఁ బరీక్షిదగ్రసుతునకు వైశం
పాయనుఁ డనంతపుణ్యాఢ్య, లాయత్తము గాఁగఁ జెప్పె నని కడుఁ బ్రీతిన్.

క. వీరశ్రీవనితాశ్రిత, భూరిస్థిరబాహుదండ బుధనుతసుగుణా
ధార కలియుగపవిత్ర పు,రారాతిపదాబ్జపూజనాసక్తమతీ.

మత్తకోకిలము. దండితాహితవీర సూరినిధాన దానవినోద కో
దండపార్థ పరాక్రమప్రియ ధామ దిక్పరిపూరితా
ఖండపాండుయశోనిధీ పరగండభైరవ వైరివే
దండగండవిదారి ఘోరతరాసిభాసిభుజార్గళా.

గద్యము ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతమునం దాదిపర్వంబున శ్రీమహాభారతకథా ప్రారంభంబును వ్యాసుజన్మంబును దేవదైత్య దానవ ముని యక్షపక్షి గంధర్వాది నానావిధభూతసంభవంబును దదంశావతారంబును రాజవంశోత్పత్తియు యయాతిచరితంబును నన్నది తృతీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము

శ్రీలలనా స్తనఘటితవి, శాలోరస్థ్సల వివేక చతురానన వా
ణీలీలాస్పద విలస, చ్చాళుక్యాన్వయపయోధి సంపూర్ణశశీ.

వ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు యయాతికిఁ బుత్త్రిండయినపూరుండు సకలమహీరాజ్యంబు సేయుచు వంశకర్త యయిన వానికిఁ గౌసల్య యనుదానికి జనమేజయుండు పుట్టి రాజై యశ్వమేధత్రయంబుఁజేసి ప్రఖ్యాతి నొందె నాజనమేజయునకు ననంత యనుదానికిఁ బ్రాచీశుండు పుట్టి పరాక్రమంబున నుదయాచలపర్యంతంబు ప్రాగ్దిగ్విజయంబు సేసి ప్రాచీశుండునాఁబరఁగె నట్టిప్రాచీశునకు నశ్మకి యనుదానికి సంయాతి పుట్టె వానికి వరాంగి యనుదానికి నహంయాతి పుట్టె వానికిం గృతవీర్యపుత్త్రియైన భానుమతికి సార్వభౌముండు పుట్టె వానికిఁ గేకయ రాజ పుత్త్రియైన సునందకు జయత్సేనుండుపుట్టె వానికి వైదర్భియైన సుశ్రవసకు నవాచీనుండు పుట్టె నయ్యవాచీనునకు విదర్భ రాజపుత్త్రి యైన మర్యాదకు(నరిహుండు పుట్టె వానికి నాంగి యనుదానికి) మహాభౌముండుపుట్టె నామహాభౌమునకుం బ్రసేనజిత్పుత్త్రియైన సుపుష్టకు నయుతానీకుండు పుట్టె వానికిం బృథుశ్రవసునిపుత్త్రియైనకామకు నక్రోధనుండు పుట్టె వానికిం గాళింగియైన కరంభ యనుదానికి దేవాతిథి పుట్టె వానికివైదేహియయినమర్యాదకు ఋచీకుండుపుట్టె వానికి నాంగియైనసుదేవ యనుదానికి ఋక్షుండుపుట్టె ఋక్షునకుఁ దక్షపుత్త్రి యయినజ్వాల యనుదానికి మతినారుండుపుట్టి

క. ఇమ్మగ సరస్వతీతీ, రమ్మునఁ బంౘ్రెండువత్సరమ్ములు విధిమా
ర్గమ్మున సద్గుణసముదా, య మ్మెసఁగఁగఁ జేసె సత్త్రియాగము నిష్ఠన్

క. అతనికి సరస్వతీనది, మతి ననురక్త యయి వాని మానుగఁ దనకుం
బతిఁ జేసికొనియె ధర్మ, స్థితి నయ్యిరువురకుఁ ద్రసుఁడు ధీరుఁడు పుట్టెన్.

## దుష్యంత మహారాజు చరిత్రము

వ ఆత్రసునకుఁ గాళింది యనుదాని కిలిలుండు పుట్టె వానికి రథంతరి యనుదానికి దుష్యంతుండు పుట్టెఁ బుట్టి యనన్య సాధారణగుణయుక్తుం డై

క బాలహరిణములఁ బట్టెడు,లీలను విషమాటవీ చలిత కేసరిశా
ర్దూలేభశరభములఁ దన,బాలత్వమునంద యెగిచి పట్టుచు మఱియున్.

క. ఉర్వీరుహనివహముతోఁ, బర్వతములు వెఱికి యొండు పర్వతముపైఁ
బర్వఁగ వైచుచు యౌవన,గర్వంబున నొప్పె నుర్విఁ గడు నధికుండై.

శా ఆదుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమస్తాశాంతమాతంగమ
ర్యాదాలంకృత మైనభూవలయ మాత్మాయత్త మై యుండఁగా
నాదిత్యాంశుసమీరదుర్గమమహోగ్రారణ్య దేశాళితో
నాదిక్షత్త్రచరిత్ర నేలె నజితుం డై బాహువీర్యంబునన్.

క. ఆతనిరాజ్యంబున నుర్వీతలము ప్రజానమృద్ధి వెలసి రుజాశో
కాతంకక్షుయశంకా,పేతం బై ధర్మచరితఁ బెరుఁగుచు నుండెన్.

వ. అమ్మహీపతి యొక్కనాఁడు మృగయావినోదార్థి యయి యాదిత్యహయంబులకంటె వడిగలవాహంబులు పూనిన రథంబెక్కి యాజానేయతురంగారూఢులైనయాశ్వికులు పరివేష్టించి రాఁగ ననంతకుంతశక్తిచాపకృపాణపాణులయిన వీరభటసహస్రంబులతోఁ జని వనంబులోని మృగంబులం జుట్టి ముట్టి

క కలయఁగ నార్పును బొబ్బయు,నులివున నవ్విపినము మహోదధిఁ బోలుచం
గలఁచెను దుష్యంతమహో, బలమందరనగము సత్త్వభయజననంబై

క. సరభసపరిచలితమహో, శరభ ద్విపరిపు వరాహ శార్దూల మద
ద్విరదాదిప్రకరభయం, కరవనమధ్యమున నృపతి గడుఁ గడిమిమెయిన్

క. ఓసరిలి పఱచుమృగముల, నేసియు డాసినమృగముల నెగిచి భుజాసిం
వేసియుఁ జంపెను మృగయా, వ్యాసక్తినపార ఘోరవన్యమృగాలిన్.

★

# పక్కింటి ఇల్లాలు

## తాళ్ళూరు నాగేశ్వరరావు

పెళ్ళిజరిగిన పదినెలలకే నాకు గుంటూరులో ఉద్యోగం రావటంతో కావడానికి ఆనర్సు గ్రాడ్యుయేట్ నే అయినా "నిరుద్యోగం రెక్కలు విప్పుకుని వీర విహారం చేస్తున్న యీరోజుల్లో ఇంత త్వరగా ఉద్యోగం రావటం కేవలం మీ ఆవిడ శారద అదృష్టమేనోయ్!" అన్నారు ఆప్త మిత్రులు. ఇల్లాలు ఇంటికి వచ్చిన వేళా విశేషం అని తలలు యెగురవేశారు దగ్గర బంధువులు. 'మీ జీవితంలో నేను ప్రవేశించటంతో చూడండి-అదృష్టం ఎట్లా తన్నుకుంటూ వచ్చిందో' అన్నట్లు నావంక కళ్ళలో గర్వచ్ఛాయలు ప్రదర్శిస్తూ చూసింది- మా ఆవిడ శారద.

అరండల్ పేట ఆరో లైనులో ఒక చిన్న ఇల్లు అద్దెకు తీసుకున్నాము. అక్కడకు మా ఆఫీసు ఆరు ఫర్లాంగులు—అయినప్పటికీ బందరు హిందూకాలేజిలో ఇంటర్మీడియేట్ లో చేరినప్పట్నుంచి నన్ను అంటి పెట్టుకొని ఉన్న రాలీసైకిలు ఉండిగనుక ఏమీ ఆయాసం ఉండదు. ఆ ఇంట్లో ప్రవేశించిన మూడోనాటి సాయంకాలం నేను ఆఫీసునుంచి వచ్చి, కాళ్లూ చేతులూ, ముఖము కడుక్కునేందుకు పెరటిదొడ్లో బావిదగ్గరకు వెళ్ళేప్పటికి— మా శారద పాటిమటి గొండిగోడప్రక్కన నిలబడి ప్రక్కఇంటి ఇల్లాలితో కాపోను మాట్లాడుతోంది. నన్ను చూడటంతో ఆమె పరాయి మగవాడి కంటబడ్డ బెరుకుదనంతో సహజమైన సిగ్గుతో, విచిత్రమైన వినయంతో తడబడుతూ వాళ్ళఇంటి పెరటి దొడ్లోని జామచెట్టు ప్రక్కకు తప్పుకుంది. నేను చూసీ చూడనట్టు—అంతా గ్రహించాను. కాని మాట్లాడకుండా ముఖం కడుక్కొని టర్కీటవల్ తో ముఖం తుడుచుకుంటూ ఇంట్లోకి వెళ్లాను.

నిలువుటద్దం ముందు నిల్చున్నా-ఆలోచనలన్నీ ఆమెమీదే ఉన్నాయి. కొత్తవాళ్లని తనంతట తానుగా పరిచయం చేసుకొని, మాట్లాడే ధైర్యం నేర్పు చొరవ—శారదకు లేవు. ఎవరైనా యెరుగనివాళ్లు ఎవరీపిల్లమ్మ అని పలుకరిస్తే మూతిముడుచుకొని మెదలకండా వుంటే మనస్తత్వంగల మా శారద, ప్రక్కఇంటి ఇల్లాలితో మాట్లాడుతున్నదంటే—అదంతా ఆ ఇల్లాలి చొరవా ప్రోద్బలం, ప్రయత్నమే అనుకున్నాను.

"ఆమె ఎవరు?" అన్నాను తర్వాత శారద ఇంట్లోకి వచ్చాక.

"సుభద్రమ్మగారు" అన్నది తాను అంతకు ముందు యెరిగి ఉన్నట్టు.

"అంటే—"

"ప్రక్క ఇంటి ఇల్లాలు ఎంతో మంచిది లాగా అగపడుతుందండీ! ఆప్యాయంగా పిలిచి పరిచయం చేసుకుంది. ఆమెభర్త హైస్కూల్లో సైన్సు అసిస్టెంటుట. ఆమెకు ముగ్గురు పిల్లలట—"

"నీకు ఎంతమందని చెప్పావు?" అన్నాను నవ్వుతూ.

ఆ ప్రశ్నతో శారద సిగ్గుపడని కన్యలాగ సిగ్గుతో ఉక్కిరిబిక్కిరై, చెంపలపైన కెంపు జనించగా, ఎర్రని పెదాలు కదలాడగా, కళ్లు కళకళలాడగా, "పోండి—మీరు మరీనూ!" అంటూ గదిలోంచి పారిపోయింది. పెళ్ళికాకముందు మొగుడంటే సిగ్గు- పెళ్ళిఅయిన తర్వాత పిల్లలంటే సిగ్గు వయస్సులో ఉన్న చాలమంది వనితలకు ఈ జాతికి చెందినదే మా శారదకూడా. మాకు ఇంకా పిల్లలు లేరు

మా శారద ఆ ఇంటికి, కాపురానికి కొత్త కావడం చాతనైతేనేమి, నేను ఆఫీసుకు వెళ్లటంతో పలుకరించే దిక్కు లేక పోవడం చాతనైతేనేమి, ఏకాంతంగా ఉండేందుకు అలవాటు పడింది కాకపోవడం చాతనైతేనేమి,- క్రమేపీ సుభద్రమ్మగారికి గాఢ స్నేహితురాలిగా తయారైంది నేను ఆఫీసుకు వెళ్ళేటైమే సుభద్రమ్మగారిభర్త వీరభద్రయ్యగారు కూడా హైస్కూలికి వెళ్ళే టైము. దాదాపు నేను ఇంటికి వచ్చేవేళకే ఆయనకూడా ఇంటికి వస్తాడు. నిత్యమూ ఈ మధ్యకాలంలో సుభద్రమ్మగారు మా ఇంటికి అధమము మూడు నాలుగుసార్లు రావడమూ, లోకాభి రామాయణము మాట్లాడుకోవడమూ, జరుగుతూవుంటుంది. మాశారద వాళ్ళ ఇంటికి ఎప్పుడో తప్ప వెళ్ళదు అదిగాక అంత అగత్యంకూడా ఉండదు సుభద్రమ్మగారే ఎక్కువగా వస్తూవుంటుంది ఏమైనా కావాలంటే పట్టుకు వెళుతుంది. ఏమైనా అవసరమైతే ఆమే తెచ్చిఇస్తుంది.



సుభద్రమ్మగార్ని తల్లిగానూ శారద పరిగణిస్తూన్నట్లు, ఆమె నాకు చెప్పే మాటల్నిబట్టి సులభంగా గ్రహించానుగానీ-మా శారదకు సుభద్రమ్మగారిమీద అంత నమ్మకం ఏర్పడటమూ, అభిమానం పెంపొందటమూ, భక్తి కుదరటమూ చూస్తే, ఆమె మా ఆవిడ మీద ఏదో మతుమందు చల్లినట్టుగా నే తోస్తూన్నది

కాని నా అభిప్రాయం మా శారదతో చెప్పలేదు. 'సుభద్రమ్మగారు ఉత్తమ ఇల్లాలండీ సంసారాన్ని ఎంతో పొదుపుగా, గుట్టుగా సాగిస్తుంది!' అనీ,

సుభద్రమ్మగారికి దైవభక్తి మెండు. నిత్యం తులసిపూజచేసి, లక్ష్మీదేవికి హారతిస్తుందండీ!' అనీ, 'సుభద్రమ్మగారికి ధ్యాత్మిక చింతన ఎక్కువ! ప్రతి ఆదివారమూ అగ్రహారానికి వెళ్ళి స్వామి వారి ర ఆధ్యాత్మికబోధను పొందుతూంటుండి!' మా శారద ఏమేమో సుభద్రమ్మ కిని గురించి చెబుతూంటే ఎదురుప్రశ్న కుండా, వెకిలిగా వెక్కిరించకుండా వటం నా వంతు.

సుభద్రమ్మగారికి ముప్ఫైయేళ్లకు మించి ండవు; కానీ, ఆమె బలహీన అంగసౌష్ఠవం కలది కావడం చాలా, ఎన్ని కష్టాలనైనా చిరునవ్వుతో టి సహించగల సామర్థ్యంగలది కావడంవల్లనూ, నడకలూ, మాటలూ, నవ్వులూ—నడియవ్వనాన్ని నిలుపుకోగలగడంలోనూ—ఆమెను చూసిన ప్రతివ్యక్తి 'ఆమెకు పాతికేళ్ళకంటె ఉండవు' అనే భావనకు గురికాకమానదు. ఆమెకు ఇద్దరు మగపిల్లలు—ఒక ఆడపిల్ల. బయటకు ఎంత పుత్రప్రేమను ప్రకటించినా, వాస్తవానికి ఆమెకు ఆ అందాల ఆడపిల్ల ఒకయెత్తూ—ఇద్దరు మగపిల్లలు మరొకయెత్తూ. పెద్దవాడు సెకండుఫారం చదువుతున్నాడు, రెండోవాడు అయిదోక్లాసు చదువుతున్నాడు. అమ్మాయికి మటుకు అయిదోయేడు ప్రవేశించక పోవడంవల్ల అక్షరాభ్యాసం చేయలేదు 'అమ్మాయికి ఇంకా అక్షరాభ్యాసం చేయలేదేం?' అని మా శారద ఒకసారి అడగ్గా, "ఊఁ! అప్పుడే చదువా! ఆరోయేడు వస్తేగాని అక్షరాలు దిద్దపెట్టం. ఈ అమ్మాయి బి.ఏలు, ఎం.ఏలు చదివి ఉద్యోగాలుచేస్తుందా! ఊళ్ళేలుతుందా! సంసారాన్ని చక్కగా దిద్దుకోగల సామర్థ్యాన్ని ఇచ్చేచదువు వొస్తే చాలు! ఈనాటి ఆడపిల్లలాంటి పిల్లకాదు మా అమ్మాయి" అన్నదట సుభద్రమ్మగారు

సుభద్రమ్మగార్ని అర్థంచేసికోవడం అంత



# పక్కింటి ఇల్లాలు 

సులభమైన పనికాదు. ఆమెను చూడగానే ఎంతో సులభంగా అరమయ్యేట్లు అగపడుతుంది గానీ—ఎన్నోయేళ్ళనించి ఆమెతో సంసారంచేస్తూన్న వీరభద్రయ్య గారే, స్కూలుమాష్టరై వుండికూడా ఆమెను సంపూర్ణంగా అర్థంచేసికొని ఉండరు ఇక నిన్నగాక మొన్న ఆమెనుచూడటం తటస్థించిన నేను—ఆమెను అరంచేసికోగలిగానని సంతోషించేందుకు సాహసించను ప్రపంచంలో ముఖాన్ని చూడగానే మనిషి తత్వాన్ని ఇట్టే గ్రహించి, దగువుగల నిపుణులైనా—ఆడవాళ్ళ విషయంలో తగిన తీర్మానాలకు రావటం కష్టమేనని చెప్పొచ్చు. సుభద్రమ్మగారిలాంటి స్త్రీలవిషయంలో అటూ మరీ సాధ్యపడదు ఆమె మాటాడేమాటలూ, నవ్వేనవ్వూ, కనబర్చే సిగ్గూ, నడిచేనడక, చూపేతిగ్రహమూ, ప్రదర్శించే వినయమూ, నటించేభక్తీ—ఆమె ప్రవర్తనని నిర్ణయించటంలో ఏవిధంగా గీటురాళ్ళుగా ఎంతవరకు ఉపయోగపడగలవో చెప్పటం అసాధ్యం, ఎందుచేతనంటే ఆమె ఒకఉద్దేశ్యాన్ని కడుపులో పెట్టుకొని, మరోఉద్దేశ్యాన్ని వెల్లడిస్తూ మాటాడుతుంది—ఫలితం ఇంకోవిధంగా వుంటుందని ఊహిసుంది అప్పుడప్పుడూ మాఇంటికి కాఫీపొడి బదులుకోసం వొచ్చి, పంచదార ఉన్నదనే విషయం చెప్పి—మాఆవిడ నోటిమీదుగానే 'కాఫీపొడి కావాలా? పట్టుకెళ్ళండి! దానిదేముంది?' అనిపించి ఊరికనే పట్టుకెళ్ళుతుంది తనకుకావాల్సిన అవసరాల్ని—ఎదుటవ్యక్తిచే గుర్తింపజేసి, ఎదుటవ్యక్తి పరువుమర్యాదల్ని పెంపొందింపజేస్తున్నట్టుగా మాటాడి, ఊరికనే తీర్చుకోవడం సుభద్రమ్మగారి ప్రధాన గుణమని ఉదేశపడేందుకు ఎన్నో అవకాశాలు ఉన్నాయిగానీ—ఆమెలో అది ప్రధాన గుణం కాదు

భరని అరిచేతిగుప్పిటలో ఇరికించుకున్నఖ్యాతి సుభద్రమ్మగారికి కొపురానికివొచ్చిన ఏడాదిన్నరకే దక్కిందట వీరభద్రయ్యగారు మంచివారు హైస్కూలూ, పిలలూ, పాఠాలూ హెడ్మాస్టరూ - తప్ప బయట ప్రపంచ గొడవలు ఆయన చెవులకి ఎక్కవు జీతంరాగానే భార్యకిచ్చి సంసారాన్ని ముందుకు నెట్టే బాధ్యత నీదేనంటాడు ప్రైవేటు చెప్పడంవల్ల నెలకు మరోవంద రూపాయలు గడించవచ్చుననే సలహా ఆమె ఇవ్వటంవల్లనే - వీరభద్రయ్య కష్టపడి పదిహేనుమందికి ప్రైవేటు చెబుతున్నాడు బాల్యంలో పిలలు అమాయకత్వంచేతనైతేనేమి, అజ్ఞానంవలనయితేనేమి ఆకతాయి తనంచేతనైతేనేమి చెడిపోతారని అదుపు ఆజ్ఞల్లో ఎట్లా వుంచుతారో - సుభద్రమ్మగారు కూడా తనపిల్లల్ని అట్లా నించడమే కాకుండా, భర్తనుకూడా కొన్ని నియమాలు ఉల్లంఘించకుండా చూచుకుంటూంది భార్యచెప్పినట్లు భర్తనడుచుకుంటే - కుటుంబం ఎంతో బాగుపడుతుందనీ, జీవితంలో ఎంతో డబ్బును కూడబెట్టవచ్చుననీ, వంశానికి ఎంతో పేరు గడించవచ్చుననీ ఆమె నమ్మింది; భర్తచేత నమ్మించింది

సుభద్రమ్మగారిలాంటి ఉత్తమస్త్రీ ఇంటి ప్రక్క ఇల్లాలిగా లభించినందుకు మా శారద గర్వపడింది ఆమె మా ఆవిడకు కుటుంబాన్ని చక్కదిద్దుకోవడం, మగవాడ్ని గుప్పిట్లో ఇరికించుకోవడం, మగవాడి నైతిక విలువల్ని ఎప్పటికప్పుడు కనిపెడుతూ వుండడం వాడి ఖర్చుల విషయంలో జోక్యం కలిగించుకోవడం - మొదలైన విషయాలో సలహాలు యిచ్చి, పాఠాలుచెప్పి, తర్ఫీదు ఇచ్చినట్టు - గ్రహించగలిగాను

ఒకరోజు రాత్రి జేమ్స్‌జాయిస్ నవల చదువుకుంటూవుండగా, ఇల్లు సర్దుకొని మా శారద నా సరసనవొచ్చి కూర్చుంది చప్పుడు చేయకుండా. ఆమె నీడ పుస్తకం మీద పడగా, పుస్తకం మూసివేశాను త్రాగుతున్న త్రీ కాజిల్స్ సిగిరెట్టును సగంలోనే పారవేశాను. పసిమి పచ్చని పారగన్ నెలన్ చీర ధరించి, లావెండర్ కలర్ ప్యారిస్ సిల్క్ జాకెట్టు వేసుకుంది. పెళ్ళిలో మావాళ్ళు పెట్టిన మామిడి పిందెల రత్నాల కంఠాభరణం పెట్టుకుంది బ్లూ లైట్ కాంతిలో, నిజంగా - శారద ఎంతో 'ఇది'గా అగుపించింది ముఖంలో కొట్టవచ్చే అందం, నవ్వులో ఆకర్షణ, చూపులో పిలుపులే, అనురాగమూ- ఆక్షణంలో నన్ను మూగవాడిగా మార్చివేయి రెప్పలు ఆర్పకుండా కళ్ళు విప్పి ఆమెవంక అటాగే చూడనారంభించాను

"సుభద్రమ్మగారు—" ఏదో చెప్పబోయింది శారద మెల్లగా

"ఛా! ఇప్పుడెందుకు ఆమె గొడవ" విసుక్కున్నాను.

ప్రణయ సన్నివేశాల్లో పరాయి మనుషుల్ని గురించి ప్రసక్తే రాకూడదు

శారద మాటి మాటి మూడు రకాలుగా త్రిప్పింది

ఆమె ఇంటరెస్టుకు ఎవరైనా అసహ్యించుకుంటే మాటి అట్లా త్రిప్పటం అలవాటు

ఏం మాట్లాడకుండా—శారదను ముఖం దగ్గరకు లాక్కుని, ముంగురులు సవరించాను మెలగా

"ఏరండీ! సాయంకాలం సుభద్రమ్మగారు ఏం చెప్పిందో తెలుసా?"

ముఖం చిట్లించుకొన్నాను ఆమె మళ్ళీ మాట్లాడలేదు.

*　　*　　*

మేం ఉంటూన్న ఇంటిని గురించి ఒక రహస్యం ఆరోజు సాయంత్రం ఒకమిత్రుని ద్వారా నాకు తెలియవొచ్చింది అదేమిటంటే—ఆ ఇంట్లో కొన్ని యేళ్ళనించీ ఎవ్వరూ రెండు మూడు నెలలకంటె నివసించటం లేదుట. అద్దెకున్న ప్రతివారూ నెలకో నెలా పదిహేను రోజులకో, ఖాళీచేసి మరోపేటలో ఇల్లు మారుకునేవాళ్ళుట. "కారణమేమిటి?" అని ఆ మిత్రుడ్ని అడగా—"ఆ పరమాత్మునికే ఎరుక!" అని చక్కా సాగారి వెళ్ళాడు

ఈ విషయమే అక్షరం పొల్లుపోకుండా మా శారదకు నివేదించాను

శారద ముఖంలో మెరుపు మెరిసి గుండెలో పిడుగు పడినంత పనైంది

"అమ్మ బాబోయ్! ఇదేదో ప్రమాదంతో కూడుకున్న రహస్యమై వుంటుంది ఏం తెలుసుకోక, అనువైన ఇల్లు దొరకనే దొరికింది గదా అని-జొరబడ్డాము ఏక్షణం

ఏ ముప్పు వొస్తుందో-ఏమిటో!-సుభద్రమ్మ గార్ని అడిగి తెలుసుకుంటాను" మా శారద వెంటనే సుభద్రమ్మగారి ఇంటికి పరుగెత్తింది

మా శారద స్కూలుఫైనలువరకు చదువుకున్నదేయైనా-ఆమెలో పాతకాలపు భావాలు, భయాలు, నమ్మకాలు సామాన్యమైన యువతికి ఉన్నట్టుగానే ఉన్నాయి ప్రతికట్టుకథనూ ఎంతో ఆసక్తితో ఆలకిస్తుంది! పసిపిల్లకంటె ఎక్కువగా నమ్ముతుంది!

నేను బయట బాదంచెట్టుక్రింద కుర్చీ వేసికొని ఇంగ్లీషు పేపరు చదువుతూ మధ్య మధ్య మా ఆవిడ రాకకోసం ఎదురుచూస్తూ కాలక్షేపం చేస్తున్నాను. మా శారద ముప్పావు గంట తర్వాత ముఖం యింత చేసికొని వచ్చింది.

ఏమిటి విషయమని అడిగాను.

అంతా చెప్పింది శారద.

సావకాశంగా విని-"ఓహో! ఇదా సంగతి!" అని తేల్చేశాను

"ఏమిటి అట్లా తూస్కారించివేస్తారు? నాకు భయంగా ఉన్నది తక్షణం మనయిల్లు మార్చటం శ్రేయస్కరం! రేపు ఉదయమే బయల్దేరండి—" అన్నది మా శారద ఒణుకుతూన్న భయంతో

నేను చిరునవ్వు నవ్వి—పేపర్లో ముఖం దూర్చాను. మా శారద ఒక్కత్తే ఇంట్లోకి వెళ్లేందుకు ఆ క్షణంలో తగని భయంవేసి అక్కడే నా కుర్చీ ప్రక్కని గట్టుమీద చతికిల బడి, ఆలోచించ నారంభించింది

అసలు సంగతి ఇది

"మేం ఉంటూన్న ఇంట్లో దెయ్యం వున్నదట అయిదు సంవత్సరాల క్రిగం ఒక గుమాస్తా భార్య సంసారబాధలు పడలేక, దారిద్ర్యాన్ని అనుభవించలేక, కష్టాల్ని ఎదుర్కోలేక—దూలానికి ఉరి బోసికొని చనిపోయిందట ఆవిడ ఈ ఇంట్లో రాత్రులు ఇంకా సంచరిస్తూనే ఉన్నదట. 'ఈ ఇంట్లో నివసించేవాళ్లకు శాంతి లేకుండా చేయడమే' ఆ దెయ్యపు ప్రధాన ఆశయమని సుభద్రమ్మగారు నొక్కి వక్కాణించారుట అది నగ్నసత్యమని నిరూపించేందుకు సుభద్రమ్మగారు ఎన్నో దృష్టాంతరాలు సహేతుకంగా చూపెటటం జరిగింది

"ఆ దెయ్యం సామాన్యమైనది కాదుట. అది చేసే చెడుగు ఒక రూపంలో ఉండదట. ఆ ఇంట్లో ఒకసారి వున్న ప్లీడరు గుమాస్తా భార్యకు బాలింతలో మతి చెడిందట. ఎన్ని మందులు వాడినా మతి కుదరలేదుట

"ఆఇంట్లో మరొకసారి ఉన్న హైస్కూలు పంతులు పెళ్లానికి క్షయ వొచ్చిందట.

"ఆ ఇంట్లో ఒక్క నెలరోజులు ఉన్న కంట్రాక్టరు కోదండరామయ్యకు ఇరవై వేలు నష్టం వొచ్చిందట.

"ఎవరికో జబ్బుచేసి, నయం చేయించుకొనేందుకు డా గుపగర కొచ్చి, ఇలు ఖాళీ లేక ఈ ఇంట్లో ఉంటే—వారం తిరక్కుముందె ఆ రోగి మాయగా ప్రాణాలు వొదిలాడుట.

ఓవర్సీరు వెంకటసుబ్బయ్య కొడుక్కి చిన్నతనంలో జబ్బుచేసే—ఎన్ని మందులు వాడినా, అంటనలు, తాయెత్తులు కట్టించినా విభూతి పెట్టించినా నయంకాక, గోగుపుల్లలాగా ఎండిపోతే—ఇల్లు మార్చిన అయిదు రోజులకే కోలుకున్నాడట

చివరకు సుభద్రమ్మగారు అన్నదట

"ఈ ఇంట్లోకొచ్చి వుండేవాళ్లతో ఎంతో స్నేహంగా, కలుపుగోలుతనంగా, సందడిగా ఉండామంటె ఎవ్వరూ పట్టుమని నెలరోజులు కూడా ఉండరారె! అదేం ఖర్మమో! ఆ దెయ్యానికి ఎంత అక్కసున్నదో! ఆ ఇంట్లో వున్నవాళ్లమీద పగదీర్చుకోవాలని దానికెంత కక్ష ఏమిటో!"

ఇల్లు మార్చమని మా శారద పోరు పెట్ట నారంభించింది

"అసలే మనది కొత్తకాపురం జీవితములో కష్టాలేమిటో, బాధలేమిటో అనుభవించినవాళ్లం కాము ఆ దెయ్యం ఏ క్షణంలో ఏం ప్రమాదం తెచ్చిపెడుతుందో! ఇల్లాంటి దెయ్యాల కొంపలో మనం కాపురం చేయుట మేమిటండీ! నామాట వినండి మరోచోట ఇల్లు మాటాడండి నాకు తగని భయంగాఉంది మీరేమో అప్పుడప్పుడు రాత్రుల్లు పదీ, పదకొండూ దాటాక ఇంటికి వస్తారు. ఈలోపల ఆ దెయ్యం నాపైన బడితే దిక్కెవ్వరు?" మా శారద ఈ ధోరణిలో నన్ను ఎగుర్కోనారంభించింది

నిజం చెప్పొద్దూ—నాకు మటుకు ఆ దెయ్యం మమ్మల్ని ఏంచేస్తుందో చూడాలని ఉంది. ఇట్లాంటి విషయాల్లో నమ్మకం లేనివాణ్ని కనుక ధైర్యంగా ఉన్నానుగానీ—మా శారద గుండెల్లో దడను ఎవరు అరికట్టగలరు?

"అట్లా అనవసరంగా ఎందుకు భయపడతావు శారదా! ఇందులో ఏదో కిటుకు ఉంటుంది వాళ్లంతా కేవలం దెయ్యంవల్లనే అటువంటి కష్టాల్ని అనుభవించలేదు. వాళ్లవాళ్ల కర్మలు అట్లా పరిపక్వమై వుంటాయి. కంట్రాకరుకు ఇరవై వేలు నష్టం రావటానికి దెయ్యానికి సంబంధమేమిటి? కాస్త ఆలోచించు! హైస్కూలు పంతులు పెళ్లానికి క్షయ రావటానికి దెయ్యానికి ఏమైనా సరిపడే కారణమున్నదా? దెయ్యాన్ని చూసి దడుచుకుంటే—క్షయ వొస్తుందా? రోగం నయం కాక చచ్చేవాడు—మరోయింట్లో వుంటే మాటుకు చావడా? రోగాలు నయంకావడం—డాక్టర్లూ, మందులుమీద కాక ఉండే కొంపలమీద ఆధారపడతాయా? ఇంత పిచ్చిగా నమ్ముతావేం శారదా! నువ్వేం భయపడవాకు ఆ దెయ్యం మన చాయలకే రాదు ఒకవేళ వొస్తే ఒక్క దెబ్బతో ఆ దెయ్యాన్ని పారద్రోలే బాధ్యత నాది. నీకు ఏమీ అపకారాన్నీ అపాయాన్నీ జరక్కుండా చూడటం నావంతు అట్లా వసి



అప్పుడే ఇలా జరిగివుంటే. (1)



# పక్కింటి ఇల్లాలు



పిల్లల్లాగ, పందు ముత్తైదువులాగ భయపడతా వేం?" అన్నాను నేను.

కాని నా మాటలమీద శారద లక్ష్యం వుంచలేదు. సుభద్రమ్మగారి సూక్తులు బాగా తలకు పట్టించుకుంది.

"ఈ ఇంటినిగూర్చి మనకేం తెలుసండీ నిన్నగాక మొన్న వొచ్చాం. అందులో దెయ్యం ఉన్నా, భూతం ఉన్నా సుభద్రమ్మగారికి తెలియాలిగానీ—మనకేం తెలుసు. ఆమెగారు పాపం మన క్షేమంగోరి, మనమీద అభిమానంకొద్దీ ఉన్నది ఉన్నట్టు చెప్పింది. ఇట్లాంటి విషయాల్లో పంతాలు పెట్టుకు కూర్చుంటే పనికిరాదండీ! దయ్యాలు ఉన్నా లేకపోయినా—ఉన్నవని నమ్మి ఇల్లుమారిస్తే మనకు వొచ్చే నష్టమేమిటి? కష్టాలు, నష్టాలు, ప్రమాదాలు, పరిపీడలు—మనకు చెప్పి వొస్తాయా, ఏమిటి? నామాట విని, ఇల్లు మార్చండి!"

మా శారద ధోరణి రవ్వంత మారలేదు.

ఏం చేయను?

ఏమీ తెలియని, అంతా తెలిసిన వాళ్లకు నచ్చజెప్పవచ్చుగానీ — తెలిసీ, తెలియని వాళ్లకు బ్రహ్మదేవుడుకూడా నచ్చజెప్పలేడనే సూక్తి ఉండనే ఉన్నదికదా! మా శారదపట్ల యీ సూక్తి అక్షరాలా వర్తిస్తుంది.

కాని, నేను ఇల్లు మార్చే ప్రయత్నం ఏమీ చేయలేదు, చేయదల్చుకోలేదు. ఏమిటో ఈ తంతు చూడాలని ఉబలాటంగా ఉంది సుభద్రమ్మగారి మాటలమీద నాకు అంత గట్టిగా నమ్మకం ఏర్పడలేదు ఆమె కొస్తంతని కొండంతలుగా చేసి చెబుతూనైనా ఉండాలి, లేదా కేవలం కల్పించియైనా ప్రచారం చేస్తూవుండాలి మేముంటూన్న ఇంటిమీద ఇట్లాంటి అభాండం ప్రచారంలో ఉంచేందుకు సుభద్రమ్మగారు కొంతవరకు కారకురాలై వుంటుందని నేను వూహించగలిగాను. ఇంటిప్రక్క ఇల్లాలిగా ఆమె ఇట్లాంటి ప్రచారం ఎందుకు చేస్తూందో అర్థం చేసికొనేందుకు ఎవ్వరూ ప్రయత్నించినట్టులేదు. ఇందులో ఆమెకు స్వార్థంఉందో, కేవలం 'గమ్మత్తు'గా ఇట్లా చేస్తూందో ప్రత్యేకించలేము.

ఒకరోజు శనివారపు రాత్రి లైటు ఆర్పి-ఆ దయ్యపు ఆచూకీ తెలిసికొందామని డిటెక్టివ్ లాగా కళ్ళు తెరుచుకు తెల్లవార్లూ కూర్చున్నాను. ప్చ్! నిద్ర దండుగతప్ప—దయ్యపు జాడలు అగుపించలేదు

కాని మా శారదకు ఇంకా భయంగానే ఉన్నది. మేల్కొనిఉంటె దయ్యాలు సంచరించవట.

దెయ్యంమాట ఎట్లాఉన్నా, మా శారద బాగా జడుసుకుంది తీసుకోవలసిన జాగ్రత్తలమీద తీర్మానాలు చేసి నాకు వినిపించి, ఆచరించమని ఆదేశించింది నేను ఆఫీసు వదలగానే ఆరుగంటలకి ఇంటికి వొచ్చి వుండాలట రాత్రుళ్ళు సినిమాలకు వెళ్ళరాదట. అథవా వెళ్ళితే ఆమెను వెంట పెట్టుకు వెళ్ళాలిట పడకగదిలో గజమున్నర పొడుగూ, ఇంత లావుపాటి కర్రా హాజరుగా పెట్టాలిట—దెయ్యాన్ని కొట్టేందుకు అవన్నీ వింటూంటే నాకు నవ్వొచ్చింది. కర్రను మినహాయించి మిగతా తీర్మానాలకు తలయొగ్గక తప్పలేదు

మా శారద సుభద్రమ్మగారితో స్నేహం పెంచింది ఆమె ఇంటికి ఎక్కువగా వెళ్ళ నారంభించింది

కాని సుభద్రమ్మగారు మా శారదకు 'ఇల్లు ఖాళీచేయుటమే క్షేమకరము' అని ఇంకా సలహా ఇచ్చినట్టుగాలేదు. ఇన్ని విషయాల్ని నూరిపోసిన ఆమె-అట్లా ఎందుకు సలహా ఇవ్వలేదో బోధపడలేదు నాకు.

ఆరోజు ఇంటికిరావడం ఆలస్యమైంది జిమ్నాటవర్ దగ్గర స్కూలుఫైనలు క్లాసుమేట్ కాంతారావు కనబడగా, నిలబెట్టి మంచీ-చెడ్డా మాట్లాడాడు. అతను సేల్సుటాక్సు ఇనస్పెక్టరు చేస్తున్నాడు బి కామ్ ప్యాసై. అతన్ని వొదిలించుకు వొచ్చేప్పటికి ఎనిమిదన్నరైంది శ్రీమతిగారు చిర్రుబుర్రుమంటూ నా రాకకోసం కళ్ళు రజేసి నిరీక్షిస్తూవుంటుందేమోననుకుంటూ ఇంట్లోకి వెళ్ళాను

మా శారద డ్రాయరుమీద ఉన్న వస్తువుల్ని ఆదుర్దాతో అటూఇటూ సర్దుతూ దేనికోసమో వెతుకుతూంది వెనగావెళ్ళి నిలబడ్డ నా రాకనుకూడా ఆమె తెలిసికోలేదు.

"దేనికోసం వెతుకుతున్నావు శారదా!" అన్నాను

"నెక్ లెస్ అండీ! స్నానానికి వెళుతూ డ్రాయరుమీదపెట్టివెళ్ళాను వొచ్చిచూస్తే లేదు" అన్నది మా శారద బిక్కముఖంవేసి

"ఆఁ .. లేదా? ఏమైంది? బయటతలుపు వేశారా?" అన్నాను నేను ఆత్రుతగా.

"వేశాను"

"దక్షిణవేపు తలుపు—"

"వేయలేదు. అంతా పదినిముషాలండీ!-అంతలో మాయమైంది!" మా శారద గొంతు కొద్దిగా జీరపోయింది. నేనేమైనా అంటానేమోనని ఆమె భయం. ఆ నెక్ లెస్ ఖరీదు సుమారు 650 రూపాయలు

"ఏంచేస్తాం? ఈ నాటితో ఋణంతీరింది దొంగ ఎట్లా ప్రవేశించాడో నాకు అర్థం కావటంలేదు.

"ఎలుకలూ, పిల్లులేమైనా లాక్కెళ్ళాయేమో? అన్నాను. మా ఇంట్లో ఆ సమానమూర్తిగే ఆ జంతుజాలాన్ని గుర్తుకు తెచ్చుకొని.

అంత విచారంలోనూ నా సందేహానికి నవ్వొచ్చింది శారదకు

"నువ్వు స్నానం చేస్తూన్నప్పుడు ఇంట్లో ఎవరేనా వొచ్చిన అలికిడి వినిపించిందా?"

'ఆఁ! స్టెయిన్ లెస్ స్టీల్ గ్లాసు దొర్లిన చప్పుడు వినిపించింది. పిల్లి కామోసు ననుకొని 'ఉష్! ఉష్!' అన్నాను అంతే! - ఇదుగొండి గ్లాసుకూడాను" దక్షిణ వేపు ద్వారపు ముంగిటప్రక్కన పడిఉన్న స్టెయిన్ లెస్ గ్లాసు చూపించింది.

దక్షిణవేపుద్వారంలోంచి మనషి రావాలంటే సుభద్రమ్మగారిఇంటి పెరటిదొడ్లోంచే రావాలి.

"సుభద్రమ్మగారు ఇంట్లో ఉన్నారా?"

"లేరు అరగంటక్రితమే నాతో పండరీపురం వెళ్ళవస్తానని చెప్పింది. తర్వాత అక్కడ ఎవ్వరో బంధువులు ఉన్నారుట. తర్వాత అయిదునిముషాలకి రిక్షావొచ్చి వాళ్ళ ఇంటిముందు ఆగింది"

'సుభద్రమ్మగారి ఇంటికెళ్ళి ఆమెను చూచిరా! ఉంటే తన పెరట్లోంచి ఎవరేనా ఇటు వొచ్చినట్టు చూసిందేమో అడుగు" అన్నాను

శారద సుభద్రమ్మగారి ఇంటికి వెళ్ళింది.

ఆమె పండరీపురంవెళ్ళి ఇంకారాలేదుట.

ఆమె కొడుకును కనుక్కోగా - ఎవ్వరూ వొచ్చినట్టు లేదన్నాడు.

పోలీసు రిపోర్టు ఇవ్వటంకంటె వేరే గత్యంతరం అగపడలేదు.

శారద సరేనన్నది.

రాత్రి తొమ్మిదిగంటలకల్లా సుభద్రమ్మగారు ఊడిపడింది. ఆమె సొంతం ఇంట్లోకి వెళ్ళిందో లేదో - ఎంతో ఆదుర్దాతో వొచ్చింది.

"ఏమమ్మా! శారదమ్మా! ఏదో పోయిందిటగా. మా వాడు చెప్పాడు" అంటూ వొచ్చింది సుభద్రమ్మగారు.

(47-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

[20-8-58 మొదలు 26-8-58 వరకు]

బి. నరసింగరావు

గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| | శు కే | | |
| | 24 తేదీని శని వక్రత్యాగం తుల, వృశ్చిక, ధనుర్మకరములలో చంద్రుడు. | | కు |
| | | | ర బు |
| | శ | గురా | |

## * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈవారము మీ ధనాదాయము ఎక్కువవుతుంది నీటిపై ప్రయాణము చేయవలసివస్తుంది బంధుమిత్రులతో కలిసి కవితాగోష్ఠి గానసభల వంటి వినోదములలో పాల్గొంటారు. తలపెట్టిన పనులు అనుకున్నట్టుగా జరుగుతవి విద్యార్థులు క్రొత్త సంగతులు శ్రద్ధగా నేర్చుకుంటారు ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ వుంటుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ద్రవపదార్థములు, బియ్యము వెండి వ్యాపారస్తులకు లాభము. దక్షిణ దిక్కునుండి మంచివార్త వస్తుంది. వారమంతా కార్యసిద్ధియున్నా 22, 23 లలో మానసికాందోళన ఎక్కువగా వుంటుంది

## * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము సంఘసంక్షేమ కార్యాలు చేసి కీర్తిని పొందుతారు. తలపెట్టిన పనులలో ఫలితప్రాప్తి వుంటుంది. ధనాదాయము అనుకున్న దానికన్నా ఎక్కువగా వుంటుంది పుణ్యకార్యాలలో పాల్గొంటారు. ఉద్యోగస్తులకు మేలుగా వుంటుంది విద్యార్థులు విలాసములలో నిమగ్నులైనా చదువుపై శ్రద్ధ వుంచుతారు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు ద్విగుణలాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము 22, 23 తేదిలలో మానసికాందోళన తక్కినరోజులలో తీరికలేని కార్యక్రమము ఖర్చులు ఎక్కువ

## * కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ] *

ఈ వారము కార్యభారము ఎక్కువ పరాక్రమమువల్ల ఘనత ధనలాభము వింత మాటలు వినుట, రాజవార్తా ప్రసంగములు, ప్రయాణము వుండును త్రిప్పట, అకాల భోజనములనూ వేడిచేసి బలహీనత కడుపు నొప్పి, కళ్ళుమంట, తలపోటు వంటి సూచనలు కనబడగానే, ఔషధ చికిత్స పొందుటవల్ల మేలు కలుగుతుంది ఉద్యోగస్తులకూ బదిలీయగుటగాని లేక శెలవు పెట్టుటగాని జరుగును విద్యార్థులకు శ్రద్ధ తక్కువ 22 23 చాంచల్యము, అనారోగ్యము, బదిలీ ఆపైని ప్రయాణము, పితృవర్గ సహాయము, కార్యలాభము

## * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము ప్రతిపనికి అనవసరముగా ఆలస్యము జరుగుతుంది. ఏ పని చేసిందికి సమాధానము కుదరదు. ఆశాభంగం ఎక్కువ వర్తకులకు లాభం తక్కువ. రహస్యములను కనిపెట్టుటకు ప్రభుత్వముచే నియోగింపబడుతారు ఉద్యోగస్థులకు వనపర్వత ప్రాంతములకు బదిలీ కావచ్చును. ప్రయాణము చేయుటలో అన్యదేశస్తుల పరిచయము విచిత్రవస్తు సంపాదన చేస్తారు. 22, 23 ఆత్మీయుల అనారోగ్యముచే వ్యధ, చాంచల్యము, బదిలీ 24, 25, 26 అనుకోని మిత్ర సహాయము కార్యలాభము

## * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈవారం మీరు ఎవరి సహాయము పొంది కార్యములు చేయదలచుకున్నారో వారే మీకు ఆటంకములను కలుగచేసారు ధనాభవము ఎక్కువగా వుంటుంది పుణ్యక్షేత్రసంచారము, దేవతాదర్శనము, విచిత్రములను చూచుట కలుగుతాయి ఆధ్యాత్మచింతకల వారగుటవల ఈశ్వర కృపచే అన్ని కష్టములను గడిచి క్రమేణా కార్యసిద్ధిని పొందుతారు. ఇంట్లోవారి అనారోగ్యము ఆందోళన కలుగచేస్తుంది. ఉద్యోగస్తులకు ఒత్తిడి వ్యాపారస్తులకు నిరాశ విద్యార్థులకు అశ్రద్ధ 22, 23 ఆటంకములు, ఆరోగ్య చింత 24 25, 26 సాధుసాంగత్యము, ఆత్మవిశ్వాసము, కార్య సాధన, నష్టద్రవ్య లాభము.

## * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈవారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ, శ్రమ ఎక్కువగా పడినగాని యత్నకార్యములు ఫలించవు దావాలలో గెలుపుపొందుతారు పరోపకారమునకు యత్నపడి పనుల ఒత్తిడివల చేయలేక నింద పొందుతారు ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణవున్నా తోటివారి సహకారముతో సర్దుబాటుగావుంటుంది వర్తకులకు వారమంతా నిరాశగా వున్నా వారాంతమున మేలుగా వుంటుంది 22 23 అధికార్య ఒత్తిడి, నిందలు, వివాదములు, భార్య అనారోగ్యము 24, 25, 26 కార్యలాభము, దావాలలో గెలుపు

## * పునర్వసు [కే, కో, హా, హీ] *

మీ ఆలోచనలు కార్యరూపమునకు వచ్చేందుకు ఎన్ని ఆటంకములు కలిగిగా, నిరుత్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి తుదకు కార్యసాఫల్యమును పొందుతారు. ఖర్చులకు అవసరపడిన సొమ్ము సమయానికి చేతికిరాక అప్పుచేయవలసివస్తుంది కాని వారాంతము తీరుస్తారు. అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు లోహపు సామానులు, రంగు వర్తకులకు, గనుల యజమానులకు, కష్టముతో కూడిన లాభము ఇంజనీరింగు శాఖ ఉద్యోగస్తులకు యంత్రము నడుపు నిపుణులకు మేలు కాలము 22, 23 ఆరోగ్య చింత, ప్రమాద సూచన 24, 25, 26 కార్యసాధన, సోదర సహాయ్యము అప్పు తీరుట

## * పుష్యమి [హూ, హే, హో, డా] *

గత రెండు వారములనుండి కలుగుతూ వచ్చిన ఆటంకములు గడిచి, ఈ వారము అధికారుల సహాయము చేతను, మీ యుక్తి చేతను కార్యసిద్ధిని పొందుతారు ధనాదాయము వృద్ధి అవుతుంది 20, 21 తొందరలు తగ్గి కార్యక్రమము ఒక దారికి వస్తుంది. 22 23 త్రిప్పట, తొట్రుపాటు. 24, 25, 26 అధికారుల ఆదరణ, ధనలాభము, బంధుదర్శనము కార్యసిద్ధి, ఈశాన్య దిక్కునుండి సంతోష వార్త. కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. విద్యార్థులకు ఉత్సాహము.

 # నక్షత్రఫలితాలు 

### *ఆశ్లేష [డి, డూ, డే, డో] *

ఈవారము మీకు యోగము ఎక్కువ. ఉన్న యిబ్బందులు తీరుతవి. అనుకున్న సొమ్ము చేతికి వస్తుంది దావాలలో గెలుపు కలుగుతుంది పుత్ర సంతానము సుఖసంతోషాలకై చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. పండితులతో శాస్త్ర ప్రసంగము చేయుటచే విజ్ఞానము వృద్ధిపొందుతుంది ఉద్యోగులకు అధికారము పెరుగుతుంది 20, 21, భాగ్యవృద్ధి, కార్యానుకూలత 22, 23 బంధువుల రాకపోకలచే అధిక ఖర్చులు. 24, 25, 26 ధనలాభము, పండిత గోష్ఠి ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు, న్యాయ స్థానములలో ఉద్యోగులకు మేలుకాలము విద్యార్థులు కొత్తసంగతులు తెలుసుకుంటారు

### * మఖ [మా,మీ,మూ,మే] *

ఈ వారము మీకు యోగదాయకమయినను మానసికాందోళన వుంటుంది. ధనయోగము వుంటుంది కవితాగోష్ఠి, సంగీత సభలవంటి వినోదాలలో బంధుమిత్రులతో కలసి పాల్గొంటారు. ఇంతవరకూ అనారోగ్యముగావున్న అపులు కోలుకొంటున్నవార్త తెలియుటచే సంతోషము పొందుతారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యం, వెండినగల వ్యాపారస్తులకు లాభయోగము. 20, 21 ధనయోగము, కార్యసిద్ధి 22, 23 మానసిక ఆందోళన 24, 25, 26 శుభవార్త, బంధువుల రాక విందు, వినోదము.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టూ

గతవారము పూర్తికాకుండా వుండిపోయిన కార్యములు ఈ వారము లాభకరముగా పూర్తి అవుతవి ధనయోగము అనుకున్నదానికన్నా అధికముగా వృద్ధి అవుతుంది శుభకార్యాలలో ధనలు చేస్తారు సాంఘిక సేవచేసి కీర్తిపొందుతారు ఉద్యోగస్తులకు అధికార హోదాలు పెరుగుతవి. వాహనయోగము కలుగుతుంది. విలువగల వస్తుల క్రయ విక్రయాలలో వర్తకులకు ద్విగుణముగా లాభిస్తుంది 20, 21 ధనయోగము, పరోపకారము. 22, 23 అధిక ఖర్చులు 24, 25, 26 ప్రయాణము, స్త్రీలతోను, ఆప్తులతోను, విందు, వినోదము సంఘసేవ, కీర్తి.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈ వారము యత్న కార్యములకు ఆటంకములు కలుగుతవి కార్యభారమువల్ల తీరుబడి వుండదు ఆర్థికస్థితి సంతృప్తికరముగా వుండనందున గృహావసరములు తీరక యిబ్బంది కలుగుతుంది అకాలభోజనము వల అనారోగ్య చిహ్నాలు కనబడగానే చికిత్స చేయించుకొనుటవల్ల మేలు కలుగుతుంది ఉద్యోగస్తులకు ఒత్తిడి వున్నా అధికారుల ఆదరణకూడా లభిస్తుంది వర్తకులకు శ్రమ ఎక్కువ విద్యార్థులకు శ్రద్ధ తక్కువ రాజకీయవాదులకు మేలుగా వుంటుంది 20, 21 కార్యభారము, త్రిప్పట, ఆటంకములు, 22, 23 అనారోగ్యము 24, 25, 26 ధనయోగము, కార్యలాభము

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదట నిరాశగా వుంటుందిగాని క్రమేణా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు ధనలోపమువల్ల ఆందోళన ఉద్యోగస్తులకు మంచిరోజులు కావు అధికారుల ఆగ్రహమునకు లోనై బదిలీ అవవచ్చును. ప్రయాణము చేయవలసివస్తుంది ప్రభుత్వముచే రహస్యములు కనుగొనుటకు నియమితులవుతారు 20, 21 నిరాశ, మనోవ్యధ 22, 23 గృహకలతలు, బదిలి, ఆప్తుల అనారోగ్యము 24, 25, 26 ప్రయాణము, మిత్రసహాయము, కార్యలాభము విదేశీయుల పరిచయము, విచిత్రవస్తు సంపాదన

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము తలపెటిన పుణ్యకార్యచింత సానుకూలము కావచ్చును తీర్థయాత్రలలో చిత్రవిచిత్ర వస్తువులను చూస్తారు. దైవభక్తి కలిగి వ్యవహరించుటచేత నష్టద్రవ్యలాభము పొందుతారు అమితముగా తినుటవల్ల ఆరోగ్యము చెడుతుంది సాధుసాంగత్యమువల్ల ఆధ్యాత్మికచింతచే మనోవికాసము కలుగుతుంది ఉద్యోగస్తులు కొంత శ్రమపడిన మీదట మేలు పొందుతారు వర్తకులకు నిరాశగా వున్నా పాత బాకీలు వసూలవుతాయి 20, 21 చాంచల్యము ప్రయాణము 22, 23 నష్టద్రవ్యలాభము 24, 25, 26 కార్యసిద్ధి పుణ్యతీర్థసేవ

### * స్వాతి [రూ, రే, రో, తా] *

స్థిరాస్తి విషయములలో మీరు చాలా జాగ్రత్తగా వుండాలి శ్రమ, ఖర్చులు ఎక్కువ. ప్రయోజనము తక్కువ అంతేకాకుండ కొన్ని చిక్కు వ్యవహారాలు కొత్తగా తలెత్తవచ్చు ఉపయోగము లేని ప్రయాణము చేయవలసివస్తుంది భార్యఆరోగ్యం విషయమై కొంత జాగ్రత్తగావుండాలి. ఉద్యోగస్తులు కొలువు పెట్టవలసి వస్తుంది. కొర్రలు, సజ్జలు, శనగలు, వగైరా అపర దినుసులు, ఉప్పు, మినుములు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభము మొత్తముమీద వారమంతా ఒడిగుడుకులుగావుంటుంది 22, 23 భార్య అనారోగ్యము, ఉద్యోగస్తులకు బదిలీ. విద్యార్థులకు బదకము

## —ధరలు:—

నూనెలు, వస్త్రములు మందముగా వుండును

నూనె దినుసులు మార్పులేదు

బెల్లము, పచందార, చింతపండు : నిలకడగా వుండును

ఆహారధాన్యములు కొంచముతగును

పప్పుదినుసులు . నిలకడగా వుండును.

వెండి, బంగారము ధరమందమగును

అంతటా సప్యానుకూలముగా వర్షించును

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమున్నూ, కృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది

### * విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము మీకు పైకి కనబడేటంత యోగదాయకము కాదు. బంధువుల రాకపోకలు ఎక్కువగుటచే డబ్బు బరువు ఒకవేపు ఎక్కువవుతుంది ప్రతి పనికి ఆటంకాలు ఏర్పడుతవి కాని పట్టుదలతో ప్రయత్నించి తుదకు జయంపొందుతారు ఉద్యోగస్తులకు అధికారుల పోటుమాటలచే మనోవ్యధ కలుగుతుంది శరీరముపై కురుపులు లేస్తాయి అగ్నివల్లగాని, యంత్రములవల్లగాని ప్రమాదము జరగవచ్చును స్థిరాస్తి లేవా దేవాలలో పేచీలు ఏర్పడుతవి రసాయనిక శాస్త్రజ్ఞులకు, ఇంజనీరింగు, పోలీసుశాఖలలో వారికి, గనుల యజమానులకు శ్రమతో కూడిన లాభయోగము. 22, 23 అనారోగ్యము. ప్రమాద సూచన ఆ పైని యత్నకార్యసిద్ధి, ధనయోగము.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మాటపలుకుబడితో అనేకమందిని కూడగట్టుకొని కార్యలాభము సాధించగలకాలము డబ్బు ఇబ్బంది సర్దుబాటుకు వుండే అడ్డంకులు తీరిపోతవి అధికారం హోదా పెరుగుతవి. పెద్ద స్థితిలో

వుంటే వారి స్నేహబలం లభిస్తుంది. మంచి ఉత్తరములు వస్తవి. డాక్టర్లకు, గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు, యోగకాలము. 20, 21 కార్యానుకూలత, ధనయోగము 22, 23 అధిక ఖర్చులు, బద్ధకము 24, 25, 26 జ్యోతిష విద్యాగోష్ఠి. కవులు నూతన రచనలు ప్రారంభిస్తారు. విద్యార్థులకు అనుకూలము.

## *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము మీకు చాలా అనుకూలమైన కాలము. అప్రయత్నముగా పెద్దమొత్తము లుగా డబ్బు చేతిలోకి వస్తుంది. అదృష్టబలం ఎటువంటిదో అనుభవమువల్ల తెలుస్తుంది. తలపెట్టినపనులు సాధనసంపత్తి తగినంత వున్నా లేకపోయినా సాధించగలుగుతారు. ఉద్యోగస్తులకు గౌరవప్రతిష్ఠలు: పలుకుబడి పెరుగుతవి. పండితగోష్ఠివల్ల, ఉత్తమగ్రంథ పఠనమువల్ల, విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. పుత్రప్రయోజకత్వము సంతోషము కలిగి స్తుంది. విద్యార్థులు ఆసక్తితో నూతన విష యాలు నేర్చుకుంటారు. 20, 21 ధనాదా యము కార్యసాధన 22, 23 అనుకోని అనా రోగ్యము. 24, 25, 26 పండితగోష్ఠి, గౌరవ ప్రతిష్ఠలవృద్ధి.

## * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారము మీ యత్నములు లాభిస్తాయి. ఆర్థికస్థితి బాగుంటుంది. బంధుమిత్రులతో కలసి వినోదగోష్ఠి సంగీతసభలువంటి వినో దాలలో పాల్గొంటారు. దక్షిణ దిక్కునుంచి, మంచి ఉత్తరములు వస్తవి, నీటిపై ప్రయా ణము చేయవలసివస్తుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, పంచదార బెల్లము, బియ్యము, వెండివ్యాపారస్తులకు లాభయో గము. విద్యార్థులకు మేలుకాలము. కవులకు, గాయకులకు, కళాకారులకూ యోగకాలము 20, 21 ధనలాభము, కార్యసాధన. 22, 23 ప్రయాణము, చాంచల్యము, మానసిక ఆందో ళన, 24, 25, 26 శుభకార్య ఆలోచన, విందు, వినోదము.

## *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢా]*

ఈ వారము చాలా అనుకూలముగా వుంటుంది. ప్రారంభించిన ప్రతీపనిలోను. విజయము లభించే అవకాశాలు కనబడుతవి. మాట పలుకుబడివల్ల అనేకమందికి ఉపకా రము చేస్తారు. మీరు అనుకోకుండా అదృ ష్టము, ఐశ్వర్యము. పట్టేఅవకాశాలు వున్నవి. స్త్రీలకు అలంకార ప్రాప్తి. బంగా రము వజ్రములవంటి. ఖరీదైన వస్తువుల క్రయ, విక్రయములలో వర్తకులకు ద్విగుణ లాభము దావాలలో గెలుపుకలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీ నటులకు యోగకాలము, విద్యార్థులకు ఉత్సాహముగా చదువు సాగుతుంది.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము మీరు ఆదాయాభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. కార్యభారము, ఎక్కువవుతుంది. ప్రభుత్వ వార్తాప్రసంగ ములు, వింతవార్తలు వినుట పరాక్రమముల వల్ల ఘనత సంపాదించుటవంటి కార్యా లలో పాల్గొంటారు. ధనలాభము కలుగుతుంది. శరీరములో వేడి, కాళ్ళపీకు, కళ్ళమంట, తలపోటులాంటి, అనారోగ్య సూచనలు. కనబడగానే ఔషధచికిత్స పొందుట మేలు. ఉద్యోగస్తులకు, అటవీ, వన, దుర్గపర్వత ప్రదేశములకు బదిలీ అయే సూచన లున్నవి. వర్తకులకు రావలసిన బాకీలు వసూలుకాక ఇబ్బంది. 22, 23, అనారోగ్యము, రాజకీయాలలో భయము. 24, 25, 26, ఘన కార్యాచరణ కార్య సాధన.

## *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఈ వారము నిలకడలేని ఆలోచనలతో యే పనీ చెయ్యలేకపోతారు. ధనలోపము వల్ల యిబ్బంది. శ్రమ పడినప్పటికి మాట దక్కదు. డబ్బు సర్దుబాటు విషయములో సహాయము చేస్తామన్న అపులు చేయలేక పోతారు. ఎవరు సహాయముచేస్తారో తెలి యక చికాకు వేస్తుంది. అకస్మాత్తుగా తటస్థపడ్డ మిత్రుని సహాయముతో నారాంత మునకు కార్యసానుకూలత కలుగుతుంది. ఉపయోగము లేని ప్రయాణములు చేయవలసి వస్తుంది. వింతవస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. ఉద్యోగస్తులకు బదిలీ అయేభయము కలుగుతుంది. విద్యార్థులు వ్యర్థముగా కాలక్షేపము చేస్తారు. 22, 23 ఆశాభంగము, తొట్రుపాటు, అనా రోగ్యము. 24, 25, 26 మిత్రసహాయము, కార్యలాభము.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. అనుకున్నట్టుగా పనులు జరగవు ధనలోపము వల్ల గృహావసరములు తీరక కలతలు కలుగు తవి. కోరినసహాయము లభించదు. కొందరు ఆధారంలేని ఆశలను కలిగించి మీ చేతి డబ్బు దండగచేయించి మిమ్ము చిక్కుల లోనికి లాగడానికి ప్రయత్నము చేయ వచ్చును. మెలకువగా ప్రవర్తించి తప్పు కొండి. ఇంటికి గురుజనులు, సజనులు రావటమువల్ల ఆధ్యాత్మిక జ్ఞానము వృద్ధి అగు టచే ఆనందము కలుగుతుంది కోర్టు వ్యవ హారములు. వాయిదా పడుతవి. పుణ్యక్షేత్ర ములు, అక్కడి విశేషములు చూచుట అవుతుంది. 20, 21 చెడువార్త వినుట 22, 23 అనారోగ్యము. ఆందోళనము. 24, 25, 26 వ్యర్థముగా తిరుగుట. నష్ట ద్రవ్యలాభము.

## *శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈ వారము కార్యభారముచే శ్రమ ఎక్కువ. ఇతరులకోసం శ్రమ పడినా చేసిన ప్రయత్నములు ఫలించక మాట పడతారు. కోర్టువ్యవహారములు మీ పరము అయినా కొంచిక్కులు మళ్ళీ తలెత్తు తాయి. భార్యకు అనారోగ్యము చేకుటచేతను ఆందోళన కలుగుతుంది ఉద్యోగస్తులకు బదిలీ అయేసూచన లున్నవి. అపరదినుసులు. ఉప్పు. నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభము. 22, 23 అన్నివిధాలాఅసంతృప్తిగా వుంటుంది. అనారోగ్యము 24, 25, 26 కార్యలాభము, వర్తకులకు లాభయోగము, విద్యార్థులకు బద్ధకము.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈ వారము మీ ప్రయత్నాలు ఫలించక అనేక చిక్కులు కలుగుతవి. ధైర్యముగా పట్టుదలతో కార్యరంగమునకు దిగి అఖరుకు ఫలప్రాప్తిని పొందుతారు. సోదరుల సహా యమువల్ల చాలావరకూ ధనలోపము తీరు తుంది. ఉద్యోగస్తులు అధికారుల ఒత్తిడి భరించలేక సెలవు పెట్టలేక బదిలీ అవుట జరుగుతుంది. యంత్రములు, అగ్ని మొదలగు వాటివల కలిగే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయన ఎరువుల వ్యాపా రస్తులకు, ఖనిజములు, లోహములు వర్తకు లకు శ్రమతో కూడిన లాభయోగము. 22, 23 ప్రమాద సూచన 24, 25, 26 సోదర సహా యము, కార్యసాధన.

## *ఉత్తరాభాద్ర [దూ, శం. ఛా, ధా]*

ఈ వారము మీరు యుక్తివల్ల ప్రయత్న ములను సాధిస్తారు. జ్ఞాతులవల్ల ధనసహాయము మిత్రులవల్ల కార్యసహాయమును పొందు తారు. ఈశాన్యదిక్కునుండి సంతోష వార్త తెలుస్తుంది. ఉద్యోగస్తుల హోదా పెరుగుతుంది. దానితో బాధ్యతకూడా పెరు గుతుంది. ఉల్లాసముగా విద్యార్థులు కొత్త సంగతులు నేర్చుకుంటారు. గణిత శాస్త్రజ్ఞు లకు, డాక్టర్లకు, కవులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలము. 20, 21 ధనా దాయము. 22, 23 మానసికాందోళన. 24, 25, 26 కార్యసిద్ధి, మిత్రలాభము. కవులు నూతన రచనలు ప్రారంభిస్తారు.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము ఉత్సాహముతో కొత్త పనులు ప్రారంభిస్తారు. ధనాదాయము ఎక్కువవుతుంది. దావాలలో గెలుపు కలుగు తుంది. పిల్లల అభివృద్ధికి కావలసిన కార్య క్రమము జయప్రదముగా నెరవేరుస్తారు. విద్యార్థులు కొత్త సంగతులు శ్రద్ధగా నేర్చు కుంటారు. పండితగోష్ఠివల్ల విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది వారమంతా తీరికలేని కార్య క్రమములలో ఘనతవహిస్తారు. న్యాయస్థాన ములలో మీ మాట నెగ్గుతుంది. పండితులకు ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు, న్యాయకార్యాలయ ఉద్యోగులకు మేలు కాలము. 24, 25. 26 ధనయోగము, పండిత గోష్ఠి ఘనత.

★






# మనసుకు దగ్గరగా   మనిషికి దూరంగా

సంవత్సరము క్రితమనుకుంటా. చుట్టాలొస్తున్నారు అన్న వ్యాసంలో ఇంటికివచ్చే చుట్టాలవల్ల వచ్చే ఇబ్బందులు వ్రాశారు సర్వమంగళగారు. ౫, ౬ నెలలక్రిందట కమలగారు తమవ్యాసంలో ఈరోజుల్లో బంధువులింటికివెడితే పడే అగచాట్లు వర్ణించారు మొన్నీమధ్య రాసిన దద్దనాల రంగనాయకమ్మగారు "చుట్టమై చూడొచ్చి" అన్న దాంట్లో అక్కడక్కడ కనుపించే బంధువులలో సహృదయతను చూపించారు. వ్యాసాలమాటలా వుండగా కథలుసరేసరి. చిన్నవారు రాస్తున్నారు పోనీ అనుకుంటే సంఘసంస్కర్త అని పేరుపొందిన వీరేశలింగంగారుకూడా తమ రాజశేఖరచరిత్రలో బంధువులను దుయ్యబట్టినవారే నాయిరి పైవాటినిబట్టి చూస్తే (వాళ్ళు మన ఇంటికి వచ్చినా మనము వారింటికి వెళ్ళినా) బంధువులయందు సద్భావము చాలామట్టుకు క్షీణించిందనే చెప్పవచ్చు

కారణము లేని కార్య ముండదంటారు ఒకప్పుడు అతిథిసేవే పరమావధిగా ఎంచిన తెనుగునాట బంధువులమీద ఇంత దురభిప్రాయము కల్గటానికి కారణము ఆలోచించ తగ్గదే

ఆనాటి జనసామాన్యంలో మరీ ఇంతగా అల్లుకుపోలేదేమో కాని మొత్తానికి చాలా కాలము క్రిందటే బంధువులంటే సదభిప్రాయము సడలిపోయిందేమో ననిపిస్తుంది కనుకనే ఏనాడో రచించిన సుమతిశతకంలో బంధువులను గూర్చి ప్రస్తావినూ తెప్పలుగ చెఱువు నిండిన కప్పలు పదివేలు చేరునని వ్రాసి అర్థముంటే అంతా బంధువులేననే అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు కాని ఆ శతకములోనే మరొకచోట, అక్కరకు రాని చుట్టాలను వదలాలని చిన్నమాత్ర సూచించాడు. ఒకనాటి వ్యథలు మరొకనాటి గాథలంటారు అల్లా రాసేందుకు ఏ అనుభవము ఆ కవిని ప్రేరేపించిందో ఎవరికి తెలుసు?

ప్రబలమైన సంతోషాన్నైనా దుఃఖాన్నైనా మానవుడు ఒక్కడే అనుభవించలేడు కనీసం ప్రక్కవారి సానుభూతినైనా వాంఛించటము మానవనైజము అందుకే శుభాశుభాల్లో బంధువులను స్నేహితులను ఆహ్వానించటమనే ఆచారము పుట్టింది.

## అర్ధబలం, అంగబలం

చాలా దగ్గర చుట్టాలు వచ్చినప్పుడు చుట్టంచూపుగా వచ్చి చూసి పోయినప్పటికీ, అక్కర సమయాలలో మాత్రం (దగ్గరా, దూరము) పాటించకుండా నలుగురూ వచ్చేవారు, పిలువబడ్డవారు, పిలచిన వారు కూడా కృత్రిమము కాని బంధువాత్సల్యము కలవారే, కాబట్టి బంధు సహకారము బాగా లభించేది ఒక వేళ ఆహ్వానించిన గృహస్థు ఆర్థికంగా చిక్కులకు గురైనప్పటికీ బంధు సహాయము తగ్గని రోజులవి (ఈ రోజుల్లో పేదవాడిని బంధువు క్రిందే జమకట్టరు) డబ్బువున్నా లేకపోయినా బంధు సహకారముతో ఎంతెంత కార్యాలనయినా అవలీలగా నెరవేర్చుకునే బంగారు కాలమది. కనుకనే అర్ధబలముకన్నా అంగబలము గొప్పదని భావించేవారు అంతే కాదు. "మాడ చుట్టము ప్రక్కలో దివము" లేనివారమవుతామేమో ననే భయముతో అతిథిని అతిగౌరవంగా చూసేవారు. అతిథి మనస్సులోకూడా అటే భావ ముంటేదేమో? తనవల్ల అగృహస్తుకి ఏ కష్టసుఖాలు కలుగుతాయోనని ప్రక్క బెదురుతోనే కాలము గడిపేవారు అందుకే ఒక్కనాటి ఆతిథ్యముతోనే ఆనాటిగృహిణి అన్నపూర్ణగా వాసికెక్కగల్గింది.

## అయితే డబ్బు: కాపోతే చాకిరీ

అయితే ఆనాటిరోజులు కావివి ఆమనుష్యులూ కారు స్వార్థము గూడుకట్టుకుని పరార్థము క్షీణించిన రోజులివి అర్థమున్నవానికి ఎంత అంగబలమేనా (మనస్సుతో నిమిత్తములేకుండా) అవలీలగా లభించే కాలమిది అది లేనివారిని పలుకరించేవారే వుండరు మీరూ గమనించే వుంటారు అర్థహీనులైనవారికి అట్టే బంధుమిత్రులుండరనే సంగతి ఈనాడు పురుషునికి అర్థము అంగబలాన్ని చేకూర్చినట్లే లక్స్త్రీ రెక్కలు బంధువుల్ని తెచ్చిపెడతాయి

మంచి ఓపికవుండి బాగా పనిపాటలు చెయ్యగలిగిన స్త్రీకి అంతా ఎడాపెడా బంధువులే ఆమె ఓపిక వుడిగిననాడు ఒక్క బంధువు కనుపించరు రెక్కలవంటి బంధువులు లేరు, అనేమాట స్త్రీపట్ల అక్షరాలా నిజము ఇలు, ఒళ్ళు గుల్లచేసుకు బంధుసేవ చేసినా చివరకు వచ్చేది ఏదో ఒక నిష్ఠూరమే. ఆపదేదేదోపడ్డాక, "చుట్టాలు తిన్నయిల్లు కుదికుండం" అని (పెటలేక) తిట్టుకునే పురుషులూ, "చుట్టమైవచ్చి దెయ్యమై పట్టుకున్నార"ని (చెయ్యలేక) వాపోయే స్త్రీలు ఈనాడు ప్రతియింట్లోను కనిపిస్తున్నారు.

మాబాబాయి ఎప్పుడూ అంటుండేవాడు మనసుకు దగ్గరా మనిషికి దూరంగానూ బంధువులుండాలి కానీ మనుషులుదగ్గరై మనసులు దూరము కాకూడదని. ఆలోచిస్తే ఆయన మాటలో ఎంతైనా వాస్తవముందనిపిస్తుంది ఒక్కొక్కయింట్లో, చూస్తూంటె ఈ మాటలో ఎంత నిజముందో చక్కగా బోధపడుతుంది ఇంటినిండా చుట్టాలుంటారు. ఒకరూ గృహిణి కష్టసుఖాలు పట్టించుకోకపోగా, అయ్యతరపు చుట్టాలనీ, అమ్మతరపు చుట్టాలనీ, ఆడిపోసుకుంటూ, వడ్డించేవాడు తనవాడైతే కడబంతిని కూర్చున్నా రనే సూక్తులతో ఈర్ష్యలు వెళ్లబుచ్చుకుంటూండే

బి. యస్. లక్ష్మి
(పెడన)

ఒక యువకుడు తను పెళ్లి చేసుకో దలచిన అమ్మాయి తండ్రి దగ్గరకు వెళ్లి "మీ అమ్మాయిని నేను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను," అని జంకుతూనే అన్నాడు.

"మా అమ్మాయినా? నీకేమన్నా మతి ఉందా? ఏమిటి నీ ఉద్దేశం?" అని అమ్మాయి తండ్రి గద్దించాడు.

"అంత కోపం దేనికండీ? ఆ అమ్మాయికేం నిక్షేపంలా ఉంటుంది," అని యువకుడు నచ్చ చెప్పబోయాడు.

బంధువులలో ఎవరు గృహిణి మనస్సుకు దగ్గిరవుతారు?

మనస్సుకదూరమైన బంధువులు లెక్కకు మిక్కిలి వుండేదానికన్నా మనుష్యులు దూరమైనా మనస్సుకు దగ్గరయినవారు ఒక్కరైనా చాలు, వారే నిజమైన అంగబలము, వెనకటికి ఎవరో ఒకకవి చెప్పినట్లు (పేరుజ్ఞాపకములేదు) వచ్చిన బంధువు పురుషుడైతే కాళీపర్సు చూపించి కొత్త అప్పు అడగటం; స్త్రీలయి నట్లయితే ఇంటియిల్లాలు బయటచేరినట్లో, సుస్తీగానున్నట్లో, చెప్పడం—ఈ పరీక్షతో ఆ వచ్చిన బంధువులు మనసుకు దగరయ్యేవారో? మనుషులు మాత్రము దగరయ్యేవారో సులభంగా తేలిపోతుంది.

పదుగురాడుమాట పాటియైధర చెల్లుచున్నట్లు లోకమంతా అర్ధబలము మీద నడుస్తూంటె మనముమాత్రము పూర్వపు గాధలూ-కథలూ తల్చుకుని అతిథి సేవకోసం ఇల్లూ-ఒళ్ళు గుల్లచేసుకుని ఆ పైన బంధువులను దూరినందువల్ల ప్రయోజనముండకపోగా వాచాదోషము కూడా పట్టుకునే ప్రమాదముంది.

అంగబలముకన్నా-అర్ధబలమే దొడ్డదనే రోజులివి. ఈమాట మరచిపోకుండా అర్థబలముకన్నా అంగబలమే దొడ్డదనిపించే విశాల హృదయుల సంఖ్య పెరిగే పాత రోజు లొచ్చేవరకూ, పూర్వపుకథలూ-గాథలూ మరచి, పదిమంది పోయేదోవని పోవటమే ఈనాటివారికి ఉత్తమమేమో ననిపిస్తుంది.



# ఆడపిల్ల పుట్టింది...

'క్యార్' మంటూ గదిలోనుండి పసిగుడ్డు గొంతు వినబడగానే, జారిపోతున్న పంచె సరిచేసుకుంటూ, పరుగెత్తుకొచ్చాడు పరంధామయ్య. మంత్రసాని తలుపుసందులోనుంచి తొంగి చూచి. 'ఆడపిల్ల' అని ముసి ముసి నవ్వులతో లోపలికి వెళ్ళింది. పరంధామయ్య మొదలు నరికిన చెట్టులా కూలిపోయాడు. కూతుర్ని, మనమరాల్ని చూచి, సంతృప్తిగా బయటికి వచ్చిన నరసాయమ్మ అల్లుడ్ని చూచి 'ఏమైందంటూ' కంగారుగా ప్రశ్నించింది. 'మంచినీళ్ళు' నీరసంగా మూలిగాడు. నరసాయమ్మకి పరిస్థితి అర్థం కాక గబగబా వంటింట్లోకి పరుగెత్తింది.

అత్తగారు తెచ్చిన నీళ్ళు గొంతులో పోసుకుని, కాస్త తేరుకున్నాడు పరంధామయ్య. అరగంట క్రితం కులాసాగా కబురు చెప్తూ స్నేహితుణ్ణి సాగనంపి, మంత్రసానిని పిలుచుకొని వచ్చిన, పరంధామయ్య ఇంతట్లో ఇలాగయిపోవటం చూచి, నరసాయమ్మ అయోమయస్థలో పడింది.

"అసలు సంగతి నేను చెప్పనా అమ్మా. బావగారు అక్కయ్యకి ఆడపిల్ల పుట్టిందనగానే "

మరదలంటున్న మాటలు వినిపించుకోకుండా, బయటికి నడిచాడు పరంధామయ్య. తిన్నగా పార్కుకెళ్ళి, బెంచిపై చతికిలబడ్డాడు.

* * *

మామయ్యా! ఓ. మామయ్యా!! నీకు పుత్రికారత్నం పుట్టింది'

కుర్చీలో కూర్చుని పేపరు చదువుతున్న వీరభద్రం ఒక్కసారి బాంబు పేల్చినట్టు ఉలిక్కిపడి, ఎగిరి, పదిగజాల దూరంలో పడ్డాడు. 'హరి! భగవంతుడా! మళ్ళీ ఆడదయ్యం పుట్టిందా? మగపిల్లాడు పుట్టి, నన్నేదో ఉద్ధరిస్తాడనుకుంటే, నామెడకో గుదిబండను తగిలించావు'. రెండుచేతులతో తలపట్టుకున్నాడు

"ఏమిట్రా భద్రం! సుఖంగా కాన్పు జరిగినందుకు సంతోషించక ఆడదానిలా ఈ ఏడుపేమిట్రా?"

"ఏడుపుకాక ఆనందం అనుకున్నావా? అవిడ ఆడపిల్లల్ని కని పారేస్తే, అఖరున అనుభవించాల్సింది నేను నా ఖర్మ. "

ఇద్దరి పిల్లలకే యింత బేజారైతే, అరడజను ఆడపిల్లలు గలవాళ్ళు ఏం చేస్తారురా? మన చేతుల్లో ఏమిలేదురా? భద్రం! యేదో భగవంతుడు ఇచ్చినదానికి తృప్తిపడాల్సిందే.. "

'తృప్తి—తృప్తి' అనుకుంటూ కుర్చీలో వాలిపోయాడు భద్రం.

"విన్నావా? వదినా! జానకికి మళ్ళీ ఆడపిల్ల పుట్టిందట"

"ఆడపిల్లా—! ఈ సారైనా మగపిల్లవాడు పుట్టకూడదూ? దరిద్రానికి తోడు ఆడపిల్లలొకటి".

ఆడపిల్లో? మగపిల్లాడో! పుట్టినవాళ్లు చల్లగావుంటే చాలదూ

"ఆడపిల్ల పుట్టగానే సరా? దానికి పెళ్లి చేసి అత్తారింటికి పంపేటప్పుడు తెలుస్తుంది కదే?" విసురుగా బిందెతీసుకుని వెళ్ళిపోయింది రత్తమ్మ,

పిల్లపుట్టి గంటన్నరకాలేదు పెళ్ళి, పెళ్ళిఖర్చు ఖర్చు, అని యిప్పటినుంచె భయపడతారేం? విచిత్రలోకం, అందరికీ మగపిలలే కావాలంటారు-వ్చ్ , అనుకుంది చిన్నప్పరడి కోడలు తనకి ఆడపిల్ల పుట్టలేదన్న బెంగతో.

* * *

'ఒరేయ్ రాముడు! కోడలిని ఎప్పుడు తీసుకు వస్తావురా? నీ మామగారు ఒక్కవరసన ఉత్తరాలు వ్రాసున్నాడు'

'అమ్మా! నీకెన్ని సార్లు చెప్పాను, దాని మాట నా ముందెత్తవద్దని. ఆడపిల్లపుట్టె దానిముఖం చూడననీ అప్పుడే చెప్పాను'

"బాగానేఉంది నీ వరస, ఆడపిల్ల పుట్టినదని, ఎవరైనా పెళ్లాన్ని వదులుకుంటార్రా? అయ్యో! అయ్యో!! ఎవరైనా వింటే నవ్విపోతారు. మొదటికాన్పు మగపిల్లలు ఇంక పుట్టరా? పుట్టబోరా? సిగులేకపోతే సరి "

'నీవు తిట్టు, దీవించు, అంతే నా మాటకి తిరుగులేదు'

* * *

"ఏమేవ్ విన్నావా? కోడలికి ఆడపిల్ల పుట్టిందట అంతా కులాసాయేనట" 'అయ్యో! అయ్యో!! ఆడపిల్లా? ఎందగ్గా మనవడు పుట్టాడు, ఈ చేతులతో ఆడిద్దామనుకున్నాను నా ఆశ కూల్చేశావురా భగవంతుడా? ఎన్ని మొక్కులు మొక్కాను' తల చేత్తో పట్టుకుని కూలబడింది లక్ష్మమ్మ.

* * *

స్పృహ వచ్చిన తర్వాత, పొత్తిళ్ళలో పసిగుడ్డును చూచి, 'ఆడపిల్లా? మగపిల్లవాడయితే ఎంతబావుండేది!' ఆ మాతృమూర్తికి ఆ ఆశ రేఖామాత్రంగా క్షణంలో సగం సేపు అనిపించింది మగపిల వాడు పుడతాడని, వాడి కోసం అల్లిపెట్టిన స్వెట్టరు, మేజోళ్ళు, కళ్ళముందు నాట్యం చేశాయి. దీర్ఘాలోచనలో పడి వేడి నిట్టూర్పు విడిచి పిల్లను దగ్గరకు తీసుకుంది.



సి. రాధ, (హైదరాబాదు).

# వంటలు

## బాదుషా

28-7-58 తేదీ ఆంధ్ర వారపత్రికలో శ్రీమతి ఎం. సుగుణవతిగారు బాదుషా చేయడంగురించి అడిగారు నాకు తెలిసినదీ మేము తరచుగా చేసుకొనేదీ అయిన విధం వ్రాస్తున్నాను. ఇలా చేసే బాగా పొరలు పొరలుగాను, గుల్లవిచ్చి కరకరలాడుతూ, రుచిగా, కొన్నాళ్ళపాటు నిలువ ఉండేట్లుగానూ వస్తాయి. ప్రయత్నించి చూచి ఫలితం తెలియబరుస్తారని ఆశిస్తున్నాను కొట్లలో అమ్మేరకమే ఇక్కడ చెప్తున్నాను

1 కప్పు బాగా మైదాపిండి, 1 కప్పు చక్కెర, 1 కప్పు నెయ్యి, నిమ్మకాయంత మంచివెన్న, చిటికెడు ఉప్పుపొడి, చిటికెడు సోడా.

మైదా శుభ్రంగా జల్లించి, అందులో ఉప్పుపొడి, సోడా, నిమ్మకాయంత వెన్న (వెన్న దొరక్కపోతే పేరిన నెయ్యిఅయినా ఫరవాలేదు) వేసి బాగా కలపాలి ఈ మిశ్రమం మరీ ముద్దగా కాక కాస్త అంటీ అంటక ఉండాలి అప్పుడందులో కొద్దిగా పాలుగాని, నీళ్ళుగాని చిలకరించి పూరీల పిండికన్నా గట్టిగా పిసికి ముద్దచెయ్యాలి. ఈ ముద్దలో నీళ్ళు మరీ కాస్త పడాయంటే మాత్రం బాదుషాలు మెత్తబడతాయి గాబట్టి చాలా కొద్దిగా వెయ్యాలనే విషయం మరవకూడదు. ముద్దగా గట్టిగా కలిపిన ఈ పిండిని మూతవేసి బాగా 2 గంటలసేపు నాననివ్వాలి నానకపోతే బాదుషా చివర్లో పగుళ్ళు పగుళ్ళుగా రావటమేకాక బాగా పొంగవుకూడాను 2 గంటల తర్వాత పీట మీద ఈ పిండిని వేసి బాగా మర్దించాలి. అలా చెయ్యలేనివారు రోట్లో వేసి బాగా దంచినాసరే తర్వాత ఈ పిండిని సుమారు మన పెద్దసైజు ఉసిరికాయలసైజున ఉండలు చేసి ఉంచుకోవాలి. ఈ ఉండలు తయారయ్యేక చేతులు శుభ్రంగా కడిగి, తుడుచుకొని, ఒక్కొక్క ఉండనే ఎడమ అరచేతిలో మధ్య నుంచుకుని, కుడిచేతి బొటనవ్రేలు, చూపుడువేళ్ళతోను చుట్టూ ఉండే పిండిని మధ్యకు వచ్చేట్టుగా ముడుస్తూ, తేలిగ్గా నొక్కుతూ రావాలి. ఇలాగ ఎంతబాగా పిండిని నొక్కుతూవస్తే, బాదుషా అంత పొరలు పొరలుగా వస్తుంది. ఇలా తయారు చేసిన బాదుషాలు మన రూపాయికన్నా కాస పెద్ద సైజుగాను, మధ్య గుండుగా, ఇంచుమించు ¼ అంగుళం మందంగాను తయారుకావాలి ఇలా అన్నీ సిద్ధం చేసుకున్న తర్వాత కుంపటి రాజేసి సన్నటి సెగన బాణలిపెట్టి, నెయ్యిపోసి సుమారుగా మరగనివ్వాలి అంటే మరీ పొగలు గక్కుతూ, మాడిపోయేంత వేడికాకూడదని అర్థం ఇప్పుడు రెండేసి మూడేసి బాదుషాల్ని నెయ్యిలో వేసి సన్నని సెగన తాపీగా వేగనివ్వాలి. ఒక్కొక్క వాయి వేగేవరకీ 15, 20 నిముషాలు పట్టుంది కాస్త ఎరుపు చాలు వచ్చేవరకు (మరీ ఎర్రగా కాదు) వేగనిచ్చి తీసివెయ్యాలి. నెయ్యి బాణలిలో మిగలవచ్చు. కాస్త ఎక్కువైతే ఫరవాలేదుగాని తక్కువైతే మాడుతాయనే ఉద్దేశ్యంతోనే అలా కొలత చెప్పానంతే. ఇలా తయారైన బాదుషాల్ని ఒక ప్రక్క ఉంచి, కుంపటిసెగ మరికాస్త హెచ్చించి, వెడల్పాటి గిన్నెలో, పైన చెప్పిన కప్పు చక్కెరలోను సగంపోసి, కొంచెంనీళ్ళుపోసి తీగపాకం రానివ్వాలి అంటే కాస్త లేతగానే ఉండాలన్నమాట పాకాన్ని దించి అందులో ఈ బాదుషాల్ని ఒక్కొక్కటిగా వేసి, బాగా రెండువేపులా పాకం అంటగానే తీసి వెడల్పాటి పళ్ళెంలో వరసగా పేర్చాలి మిగిలిన పాకంలో, అట్టే తీసి ఉంచిన అర్ధకప్పు చక్కెరా వేసి కొద్దిగా నీళ్ళుపోసి తిరిగి కుంపటిమీద ఉంచి బాగా ముదురుపాకం రానివ్వాలి. ఇది బాగా ముదిరి అంచుల్ని చక్కెరలాగా తెల్లగా పేరుకుంటుంది చూడండి అప్పుడు వెంటనే దించి ఒక గరిటెలో బాగా సన్నగా అయ్యేటు కలయబెడ్తూ, లేతపాకంలో ముంచిన బాదుషాల్ని ఒక్కొక్కటిగా ఇందులో వేసి రెండువైపులా పాకం అంటగానే తీసేస్తూ రావాలి వెంట వెంటనే తీసివెయ్యకపోతే పాకం గట్టిపడిపోతుంది. ఇలా చేస్తున్నప్పుడు పాకంగనక గట్టిపడిందంటే, అందులో కొద్దిగా నీళ్ళు చిలకరించి పొయ్యిపైన పెడితే పాకం కరిగి మళ్ళీ యథాప్రకారం తయారవుతుంది అన్ని బాదుషాలు పాకంలో ముంచేశాక, ఒకవేళ మరికాస్త మిగిలుంటే స్పూనుతో పాకాన్ని బాదుషాలపైన పోస్తే తెల్లగా, బాగా పేరుకుని అందంగా ఉంటాయి. అన్నట్టోమాట. పాకంలో రంగువేయ దలచుకున్నవాళ్ళు, రెండోసారి పాకం తయారవగానే రంగుని ఒక టీస్పూను పాలలో కలిపి రెడీగా ఉంచుకుని అందులో కలిపేయవచ్చు. కొబ్బరి కోరూ, బాదంపప్పు చీలికలూ వెయ్యాలనుకున్నట్లైతే పాకంలోనుండి రెండోసారి బాదుషాల్ని తీయగానే ఆ వేడిమీదనే చల్లేస్తే అంటుకుని, చూడానికి గమ్మత్తుగా ఉంటాయి కూడాను. ఈ ప్రకారమే తయారుచేసిన బాదుషాలు ఎన్నిరోజులైనా రుచిచెడక నిలవ ఉంటాయి. ఎసెన్సులు వెయ్యాలనుకునేవారుకూడ పాకంలోనే కలిపేయవచ్చు. ఒకసారి ప్రయత్నించి చూడండి!

కుమారి డి. ఎస్. రాజ్యలక్ష్మి.
(రాయచోటి)

* * *

## మరిరెండు పద్ధతులు

కావలసిన సామానులు 1 పావుశేరు మైదాపిండి, ½ కప్పు తియ్యని పెరుగు 2 కప్పుల చక్కెర, 8 కప్పుల కమ్మనినెయ్యి, కొన్నిలవంగాలు.

బాగా మధ్యాహ్నము చేసుకొంటాము అనగా ప్రొద్దున పదిగంటలకు మైదాపిండి శుభ్రంగా జల్లించి అరకప్పు పెరుగు 1 కప్పు నెయ్యిపోసి (వేరేచుక్క కూడ నీరుపోసి కలపకుండా) గట్టిగా పూరీలపిండి మాదిరిగా కలిపి ఉంచుకొనవలెను పిండి బాగా నానిన తరువాత రోలు శుభ్రంగా (కారంలేకుండా కడిగి) రోటోవేసి అప్పడాలపిండి మాదిరిగా బాగా మర్దన చేయవలెను (ఇప్పుడు ఇద్దరు మనుష్యులు ఉండవలెను ఒకరు బాదుషాలు సిద్ధముచేసి ఇచ్చేటప్పటికి ఒకరుపాకం పట్టి ఉంచవలెను ఈపాకం ముదురుపాకం రావలెను అంటే నీళ్ళలో పాకం వేస్తే ఉండగారావాలన్నమాట, అట్లా పట్టినపాకం సన్నని సెగమీద ఉంచుకోవాలి) అటూ మర్దనచేసిన పిండిని పెద్ద నిమ్మకాయంత ఉండలుచేసి అప్పడాల పీటమీద పెట్టిపూరీ మాదిరిగా (అరచేయంత సైజులో) వత్తి పదిసార్లు మడతవేసి చివరసారి బాగా గుండ్రముగా వత్తినాలుగు కొనలు మధ్యకు మడచి ఒక లవంగము గుచ్చి కుంపటిమీద బాణలి ఉంచి మిగతా నెయ్యిపోసి నెయ్యి బాగా కాగినతరువాత ఇవి (తడి ఆరకుండా, వత్తినవెంటనే) ఒక టొకటిగావేసి గోధుమ రంగు వచ్చేదాక వేగనిచ్చి ఒకపళ్ళెములో ఉంచి అంటే బాణిలోనుండి తియ్యగానే ఒక గరిటెడుపాకం తీసి దానిమీద పోయవలెను ఇప్పటికి బాదుషాలు తయారయినవి అన్నమాట ఇట్లాచేస్తే హోటల్సులో చేసి

(41 వ పేజీ చూడండి)




# ఇవి మీకు తెలుసా!

ఆవనూనెలో పసుపు కలిపి పాదాలకు వ్రాస్తే కాళ్లపగుళ్లు 2, 3 రోజులలో తగ్గిపోతాయి. మామిడి జిగురు వ్రాసినా పగుళ్ళు పోతాయి తరుచు నీళ్ళలో తిరగడం చేత కొంతమందికి కాళ్ళు పాస్తాయి (అంటే పాదాల ప్రక్కన వేళ్ళ సందున తెల్లగా ఏర్పడుతుంది) అటువంటప్పుడు పాదాలకు గోరింటాకు పెట్టకోవాలి గోరింటాకు పెట్టుకుంటే పిప్పిగోళ్ళు కూడా పోతాయి

చెవులో పోటు చీము కారుటకు – తేనె వేడి చేసి 2, 3 చుక్కలు చెవిలో వేస్తే చెవిపోటు తగ్గిపోతుంది తేనెలో నిమ్మతొక్కల రసము పిండి కాచి చెవిలో వేసినట్లయితే చీము కారుట చెవిపోటు తగ్గిపోతాయి

అజీర్ణమునకు – శొంఠి మెత్తగానూరి అందులో బెల్లం కలిపితినాలి లేకపోతే శొంఠిపొడిలో బెల్లం బదులు సైంధవ లవణం కలిపి తినినా అజీర్తివ్యాధి మారిసుంది సమానపాళ్లలో అల్లము బెల్లము నూరి తినిన పైత్యము, నోట్లోంచి నీరు కారుట తగ్గిపోతుంది

కడుపు నెప్పి – వాము ఉప్పు కొని, ఆవాలు, ఉప్పు కొని అరచేతిలో నలచి నోట్లో వేసుకుని నీళ్లు త్రాగిన కడుపులో నెప్పి వెంటనే తగ్గిపోతుంది వాతంవల్ల కడుపులో నెప్పి వస్తే వాము మిరపగింజలు, ఉప్పు నూరి సేవించాలి వేడిచేత వచ్చిన నెప్పయితే సోపు (సబ్బు కాదు సుమండి) నలచి నోట్లో వేసుకోవాలి పొత్తికడుపు నరాలు బిగబడితే కచ్చిక నీళ్ళలో తడిపి బొడ్డుమీద పెట్టుకుంటే 5 ని॥ లలో తగ్గిపోతుంది బాగా వేడిచేస్తే చిట్టుడుకు నీళ్ళలో పేరిన నెయ్యి కంచుదార వేసుకు త్రాగితే వేడి తగ్గిపోతుంది

విపరీతంగా తలనొప్పిగా వుంటే లేక తల దిమ్ముగా వుంటే రాత్రిపడుకునే ముందు నడినెత్తిమీద ఆముదపు ఆకులు పెట్టుకుని అవి జారిపోకుండా ఒక శుభ్రమైన బట్ట కట్టినట్లయితే తెల్లవారేసరికి తలదిమ్ము తలనొప్పి తగ్గిపోతాయి. ఆకులు ఎండి పోతాయి

తలలో పేలు పట్టునట్లయితే వస మెత్తగా నూరి తలవెంట్రుకల్లో పట్టించి తలకు తెల్లని బట్ట కట్టాలి తెల్లవారేసరికి పేలు చచ్చిపోయి బట్టకు అంటుకుంటాయి సెల్లులి రసము రాసినా పేలు చచ్చిపోతాయి

జలుబురొంప – నీటిని బాగా మరగకాచి అందులో పసుపు వేసి ఆవిరి పట్టవలెను జలుబు వెంటనే తగ్గిపోతుంది మిరియాలు పొడవేసి కాచినపాలు త్రాగిన జలుబు తగ్గిపోతుంది మిరియపు గంధం కంట్లో పెడితే జలుబు తగ్గిపోతుంది

గవద బిళ్లలు – శోభిమచ్చలు – జాజికాయలు నీటితో అరగదీసి గంధం వ్రాస్తే గవద బిళ్లలు మానిపోతాయి. తులసాకు రసం తీసి అందులో హారతి కర్పూరం కలిపి రాస్తే శోభి మచ్చలు పోతాయి

ఉలిపాయలు పుప్పి మెత్తగా నూరి దంతాలమీద రుద్దితే దంతాలనుండి రక్తం కారదు

పొడిదగ్గుకి – రోజూ ఉదయం పూట తాజా వెన్న తింటే వారంరోజుల్లో తగ్గిపోతుంది

పొట్లకాయ సొనరాస్తే మొటిమలు మళ్లీ రావు.

ఒండ్రుమట్టి అరారా రాస్తే సెగడ్డలు నెత్తురుగడ్డలు తగ్గిపోతాయి.

కుంకుడుకాయ అరగదీసి నురుగుతో పళ్లు దంతములు తోమితే తళతళ లాడతాయి దంతిపుష్టికూడా

కళ్ళ గురదలు మంటలు వున్నచో సీమకరక్కాయ గంధం కంట్లో పెడితే దురదలు మంటలు తగ్గిపోతాయి

—ఇవటూరి శ్యామలాదేవి.

# కుంకుమవల్ల మచ్చపడితే

'కుంకుమ పెట్టుకుంటే మచ్చపడ్డది ఏం చేసే పోతుంది' అని ఒకసారి అడిగారు నాకు తెలిసినది వ్రాస్తున్నాను ప్రతిరోజు రాత్రిపూట పడుకునేముందు మచ్చ పడ్డ చోట 'క్యూటికురా ఆయింట్ మెంట్" 5 నిమిషాలు రుద్దుతే త్వరగా తగ్గుతుంది.

కుమారి కాజ వెంకట సువర్చలాదేవి
(విజయవాడ)

(హైదరాబాదునుండి మాదిరెడ్డి లక్ష్మీ చక్రపాణిగారు కూడా ఇదే సూచన చేశారు)

* * *

ఎండుకొబ్బరి టెరడు పైపు గంధం తీసి మూడు నాలుగు రోజులు ప్రొద్దున, సాయంత్రం రాసి రెండుగంటలసేపు వుంచుకోవలెను మేము స్వయముగా వాడి చూచినాము తగ్గినది.

కె. సత్యవతి, (విజయవాడ)

* * *

మా అమ్మగారికి కుంకంవల్ల నుదుట మచ్చపడింది ఎన్నో మందులు వాడితిమి కాని తగ్గలేదు కొంతమందికి పసుపుపడక మచ్చపడుతుందట. అందుచేత విసిగి తిలకం పెట్టుకున్నారు కొద్దిరోజులకే మచ్చపోయింది తిలకం పెడుతుంటే మచ్చపడుతుందని అందరు అంటారు కాని కుంకం పడనివాళ్ళకి ఇదే మందు. ఇప్పటికి మా అమ్మగారికి కుంకుమ పెట్టుకుంటే మచ్చ బయలు దేరుతోంది అందుచేత సందేహించకుండా తిలకం పెట్టుకోవలెను

ఆత్మూరి రత్నావతి (పెద్దాపురం)

# వనితా వాణి



"మన సమాజంలో భర్తృవిహీనల దుస్థితి"లో "కావలసింది చల్లనిమాట" అనే వ్యాసం శ్రీమతి ఇంద్రాణీది చదివాను చాలా బాగున్నది.

ఎం. గిరిజ (నెల్లూరు.)

* * *

## అందరికీ కాదు

వైధవ్యంవలన కలిగే ఆర్థికమైన, సాంఘికమైన బాధల్నిగురించి వారు వ్రాసినదంత ఒక్క బ్రాహ్మణ కుటుంబాలకే వర్తిస్తుంది కాని, మిగత కుటుంబాలలో యీ నాడు ఎవ్వరు చాకిరీలుచేస్తు జీవించడంలేదు కాయకష్టంతో నో, లేక ఏ చిన్న వుద్యోగం చేస్తూనో స్వతంత్రంగ జీవించెవాళ్ళు చాలామంది వున్నారు అంతేకాని వారు తెల్పిన అగచాట్లకు లోనై జీవించడంలేదని నా అభిప్రాయం

జి. డేవిడ్, (ద్రోణాచలం.)

* * *

అగష్టు 6 వారపత్రికలో దాడి వెంకట్రావుగారు "విషాదగాధ వింటే బాధ" అను శీర్షికపై వ్రాసిన విమర్శనీ చదివాను. వారు "ఈ రచనలోని కవిత్వమంత ఘాటుగా జీవితములో ఉండడము అసంభవము" అని వ్రాశారు. అది అనుభవించే వారికే తెలుస్తుంది ఎంత ఘాటుగా వుంటుందో! బాలవితంతువులు చదువు పూర్తి చేసుకొని ఉద్యోగము చేసుకోవచ్చునని వారి ఉద్దేశము కాని అపూర్తి చేసుకో దానికి అవకాశా లుండొద్దూ! వితంతువులు వుద్యోగాలు చేస్తూ బ్రతుకుతున్న వారిని చూసున్నాము కాని, అపశపాలూ, అవమానాలూ పడుతున్న వారిని అంతకంటే యెక్కువగా చూస్తున్నాము అటువంటె వారికి యెప్పుడు విముక్తి లభిస్తుందో!!

జయశ్రీ.

శ్రీమతి గాయత్రికి అభివందనలు తెలుపుతూ తాడేపల్లిగూడెంనుండి శ్రీమతి ఎం. సరోజనీశేషుగారు కూడా లేఖ వ్రాశారు

25-6-58 వ తేదీ ఆంధ్రపత్రికలో శ్రీ కుంటపల్లినుండి మురళీధరరావు గారు వ్రాసిన విమర్శ దానికి సమాధానంగా శ్రీమతి కె రాజ్యలక్ష్మి (చిన్నగంజాము)గారి లేఖ చదివాను. కె రాజ్యలక్ష్మిగారు చాలా బాగా సమాధానం వ్రాశారు

—జి. భారతీదేవి, విజయవాడ.

* * *

శ్రీమతి దద్దవాల రంగనాయకమ్మగారు వ్రాసిన విమర్శ చాల బాగున్నది వారితో పూర్తిగ నేను ఏకీభవిస్తున్నాను శ్రీమతి రంగనాయకమ్మగారు, తమ విమర్శలో మహిళలను విద్యరానిచో వచ్చు కష్టములు, విద్యవలన ఉపయోగములు చాల విపులముగ వ్రాసినారు ఇంత విపులముగ విమర్శించినందుకు నా ధన్యవాదములు.

మాడభూషి శీతమ్మాళ్,
(నరసాపురం)

* * *

రంగనాయకమ్మగారు వ్రాసిన "ప్రియమైన ప్రభావతీ" వ్యాసం చాలా బాగుంది వారి వ్యాసంలో వారు ప్రతి విషయాన్ని కూడ చాల చక్కగా విమర్శించారు. ఒకరు మన చదువునుగూర్చి ప్రశ్నించనంతమాత్రమున నే మనం నిరుత్సాహ పడకూడదు. విద్య కేవలము విజ్ఞానముకొఱకే అంటె విద్య ఉద్యోగంకొరకు కాదని నా అభిప్రాయం కాదు మన, అవసరాలనుబట్టి, ఉత్సాహాన్నిబట్టి ఉద్యోగంచేస్తే చెయ్యొచ్చు.

సి పి. డి గిరిరాజకుమారి (ఏలూరు)

* * *

ఈ రోజులలో సామాన్యంగా జరుగుచున్నటువంటి విషయాలను స్పష్టంగా చక్కగా వ్రాశారు స్త్రీ నిర్వహించవలసిన బాధ్యతలు వారు చక్కగా వివరించారు. వారికి నా ధన్యవాదాలు.

"ఘస్టుకింకా ఎన్నిరోజులు" అన్న వ్యాసం చదివాను. చాలబాగుంది

కుమారి. శైలజ (నర్సాపురం)

* * *

ఘస్టుకెన్నిరోజులు అన్న వ్యాసము నాకు బాగా నచ్చినది. ఆవిడ యిచ్చిన సలహాలు అమూల్యమైనవి. శ్యామలాదేవి గారికి నా అభివందనాలు.

ఈ పత్రికలోనే శ్రీమతి దద్దనాల రంగనాయకమ్మగారు వ్రాసిన "ప్రియమైన ప్రభావతీ" అనే వ్యాసం చదివాను అందులో భావాలతో నేను మీతో ఏకీభవిస్తున్నాను.

ఏడిద కనకవల్లి (విజయవాడ)

* * *

ప్రతి సాధారణ కుటుంబములోను జీతాలు అందిన మొదటి రోజుల్లో అనవసరపు ఖర్చులు పెట్టకుండా, నెల మొత్తంమీద ఒకేవిధమైన ఖర్చు పెట్టుచూవుంటే, సరిగా ఆ యా సంసారములకు తమ తమ భర్తలు ఆర్జించెడి జీతాలు అప్పుచేయకుండా సరిపోవచ్చును.

జల్లేపల్లి పద్మావతి
(అసన్‌సోల్)

* * *

శ్యామలాదేవిగారు వ్రాసిన "ఘస్టుకింకా ఎన్నిరోజులు?" అన్న వ్యాసము చాలా బాగుంది ఆమెకు నా ధన్యవాదాలు వనితా లోకంద్వారా తెలియపరుస్తున్నాను

గోపరాజు భారతీదేవి (నరసాపురం)

* * *

## నొప్పించక

టి. ప్రభావతిగారు వ్రాసిన "నేనూ చదివాను బి ఏ." అను వ్యాసంమీద చాలా మంది సోదరీమణులు తీవ్రంగ విమర్శించేరు. విమర్శించినపుడు ఎదుటివారి మనస్సును నొప్పించకూడదని నా అభిప్రాయము. ఈ దృష్టితో చూస్తే దద్దనాల రంగనాయకమ్మ వ్రాసిన విమర్శ చాల బావుంది.

జి గోపాలస్వామి
(పిఠాపురం)

* * *

## అభివందనలు

సోదరి రంగనాయకమ్మగారు చదువు సార్థకతగురించి చాలా బాగా రాశారు. చదువుకు గమ్యస్థానం ఉద్యోగం కాదు విజ్ఞానం అని బాగా విపులీకరించారు సోదరి గాయత్రి కాశీయాత్రాది విశేషాలు బాగా రాశారు. త్వరలో మేము కాశీ వెళ్లదలచినాము. చూడవలసిన స్థలాలు ముందుగా మాకు సూచించినందుకు వారికి నా ధన్యవాదాలు.

—టి. రఘుమురళీ, కొల్లాపురం.

## "అది సబబుగా లేదు"

23-7-58 ఆంధ్రవారపత్రికలో "కుమారి టి. ఎస్. ఆర్ కృష్ణగారు బి ఎ, కుమారి సరోజిని, బి. ఎ. గారూ, ఏ ఎం. విమల గారూ, టి ప్రభావతిగార్ని హేళనచేస్తూ "నేను చదివాను బి ఎ, కాని ఏం లాభం" అన్న దానిమీద, బ్రోచీలు తగిలించుకోమని, లేదా, లాకెట్లో పైకి కనిపించేటట్లు బి. ఎ అని పెట్టుకోమనీ అన్నారు. ఇంకా కాకపోతే మాటలమధ్యలో చెప్పుకోమని, యింకా కాకపోతే వారుచేసినట్లు బి. ఎ. అని అడుగున వ్రాసుకోమనీ అన్నారు. మరి, వారేకాదా పబ్లిసిటీకోసం చదువు కాదన్నారు కదా, మరలాంటప్పుడు అడుగునమాత్రం వారి డిగ్రీ వేసుకోవడం ఎందుకు? వారు టి. ప్రభావతి గార్ని హేళన చేశారు కాని, వీరి వుద్దేశ్యం, వారి వుద్దేశ్యం ఒకటే అయ్యింది. అయితే వీరు వ్రాసి చూపించుకున్నారు వారు వ్యాసంలో నన్ను ఎవరూ అడగలేదని చెప్పారు

—పసుమర్తి రాజేశ్వరి, (బి. ఎ. కి)
(విజయనగరం)

* * *

## ఒక్క స్త్రీ పదిమంది పురుషుల పెట్టు

స్త్రీవిద్య ఒక్క ఉద్యోగం కొఱకేనా?—కాదు స్త్రీకి, పురుషునికంటె కూడ యెక్కువ బాధ్యతలు నిర్వహింపవలసి యున్నవి. తల్లిదండ్రులమీదనే, అందులోనూ ముఖ్యముగా తల్లిమీదనే బిడ్డల యోగ్యతాయోగ్యతలు ఆధారపడి వుంటవి. కనుకనే 'ఒక స్త్రీకి విద్యాజ్ఞానము కలుగచేసినచో పదిమంది పురుషులకు విజ్ఞానము కలుగజేసినంత లాభదాయకము' అని ఈమధ్యనే మన పెద్దలొకరు. దేశాభ్యుదయమునుగూర్చి మాట్లాడుచు చెప్పియున్నారు

ఇట్టి పరిస్థితులలో, విద్యకు గల విలువను వివరపఱచుచున్న రంగనాయకమ్మగారి వ్యాసము విద్యావ్యాప్తికి కొంతవఱకు సాయపడవచ్చునని నా నమ్మకము. రచయిత్రికీ ఈ వ్యాసము వ్రాయబడుటకు కారకులయిన ప్రభావతిగారికి కూడ నా ధన్యవాదాలు

పి ఎస్ నారాయణరెడ్డి
(కాకినాడ)

* * *

వనితాలోకము శీర్షికలో, 23-7-58 ప్రచురించిన మీ పత్రికలో పి కామేశ్వరి గారు వ్రాసినట్టి "ఇది సాధ్యమా? అభిప్రాయాలు" అనే వ్యాసమును పి ఎస్ ప్రభావతిగారు వ్రాసినట్టి "కట్నపిశాచి ఫాన్సీ డ్రెస్" వ్యాసము చాల బాగవున్నవి వారికి నా అభినందనలు తెలియచేసేది. కానుకలు, లాంఛనములు వీటికి కట్నపిశాచి ఫాన్సీ డ్రెస్ అని మంచి నామకరణము చేసినారు. నేడు వరకట్న చట్టము శారదాబిల్లు మాదిరి నామకార్థముమాత్రము అమలులోనున్నది.

వి. సుబ్రహ్మణ్యము (కాకినాడ)

* * *

శ్రీమతి కె క్రిష్ణవేణి మద్రాసుగారు వ్రాసిన "సంస్కారం అంటే—" అన్న వ్యాసం చాలా బాగుంది.

ఎందుకంటే యీ రోజుల్లో అమ్మాయిలను కూడా చదివించడంమట్టుకే తల్లిదండ్రులు చేస్తున్నారు కాని వారు యెంత వరకూ జీవితంలో నెగ్గగలరో వారికి, వివేకం సంస్కారం అబ్బుతున్నాయో లేదో ఆలోచించటంలేదు కృష్ణవేణిగారు చెప్పినట్లు యెంత చదువుకుంటేమాత్రమేం 'సరళ'లాగా కాకుండా 'మంగమ్మ'లాగున వ్యవహరించ కలగాలి. సంస్కారం వుంటేనే చదువు విలువ తెలుస్తుంది 'కల్చర్' లేనిది యెంత చదువుకున్నా ప్రయోజనంలేదు. అమ్మ, నాన్నగారే కొంత కారణం ఆడ పిల్లలు పను నేర్చుకోక పోవటంలో చదువుకుంటున్నారు కదా అని పూరుకుని అపైన అత్తవారింట్లకు పనులు రాకుండానే పంపేస్తున్నారు. అమ్మ యే మాటన్నా బాధపడని స్త్రీ, అక్కడ పనిచేయలేదని అత్తగారో, ఆడబిడ్డో అంటే అంత బాధపడటం దేనికి? ఆ అహంభావం లేనపుడే అందరికీ సుఖం. వారుకూడా మన శ్రేయస్సుకోరే చెబుతున్నారనే విచక్షణతో చూసిననాడు యెవరికీ బాధ వుండదు.

బండి వేవి: (గుడ్లవల్లేరు కృష్ణా జిల్లా)

* * *

## కుట్టు

28 వ తేదీ పత్రికలో మంగళాకందూరు గారు వ్రాసిన దోమతెరమీద డిజైను కుటి నాకు చాలా బాగా కుదిరింది వారికి పత్రిక ద్వారా నా ధన్యవాదములు తెలియపరుస్తున్నాను.

ఎస్. శంకరి. (చిత్తూరు)

---

## వంటలు

(38 వ పేజీ తరువాయి)

నట్లు ఆకారము రాకపోయినప్పటికి నోట్లో వేసుకొంటే కరగిపోయేట్లు కమ్మగా ఉంటాయి

పి. అనసూయ. (బాపట్ల)

* * *

కావలసిన సామాను (12 బాగుషాలకు) 2 కప్పుల మైదా 8 చెమ్చాలు నెయ్యి (లేక డాల్డా) చేయువిధానం రెండు కప్పుల మైదాలో, ఎనిమిది చెమ్చాల నెయ్యి కలుపవలెను కొంచం నీళ్ళలో మిఠాయి రంగు బాగుగా కలిపి, ఆనీళ్ళు పిండిలోపోసి మెత్తగా కలుపవలెను. వుండల్లాగచేసి మధ్యకి రంధ్రం లాగ చెయ్యాలి. ముందు పంచదార చిక్కటి పానకంపట్టి వుంచాలి. మూకుట్లో నెయ్యి మరగపెట్టి దించవలెను. ఈ బాగుషాహీ వుండలు ఆ వేడి నెయ్యిలో వేయాలి ఆ వేడి వున్నంతసేపు కొంచం బుడగలువచ్చి వుడుకుతుంటుంది. అది వుడకడం ఆగిపోతే మళ్ళీ పొయ్యిమీద పెట్టాలి. మళ్ళీ మరుగుతుంటే క్రిందికి దించవలెను తరువాత ఆ వుండలు బాగా పొంగి వేగినట్టు కనిపిస్తాయి అలాగ పొయ్యిమీద పెట్టి మరగంగానే దించిస్తు వుండాలి చట్రంతో కలుపకుండా, మూకుడ్ని ఆవుండలు కదిలేటట్లు కుదపాలి బాగా వేగిన తరువాత వాటిని చల్లారబెట్టవలెను. తరువాత చట్రంతో తీసి, వాటి మించి ఈ చిక్కటి పానకం పోయవలెను. ఈపాకం పోస్తున్నప్పుడు అన్నిటిమీదా ఒక్కలాగ పొయ్యాలి. అన్నిటిమీదా ఒకలాగ లేకపోతే ఒకటి తియ్యంగా, ఒకటి చప్పగా వుంటాయి. అందుచేత ఈ పాకం వేసినప్పుడు జాగ్రత్తగా వేయవలెను.

ఎస్. సుభద్రాదేవి
(హిస్సార్ తూర్పు పంజాబ్)

* * *

## "జీడిపప్పుతో ఒడియాలు"

ఒక అర్థపావు తొక్కవలచిన జీడిపప్పు, దానికి తగినన్ని పచ్చిమిరపకాయలు, నీరుల్లిపాయలు, తగినంత ఉప్పువేసి నూరవలెను. ఈ ముద్దలో ఒక టేబులుస్పూను శెనగపిండిగాని వరిపిండిగాని వేసి, ఈ ముద్దను పలుచగ వడియాలు మాదిరిగ వేయించవలెను. ఇవి చాలా రుచిగా వుండును.

ఎన్. ఎస్. మణి, (టెక్కలి).

---



దర్జా అంటే నాదే!
—చిత్ర రచన: వేమూరి లక్ష్మి]

 

# మనిషిలో మనిషి



(16-వ పేజీ తరువాయి)

రఘు :
సుజాత : } (చూడనట్టు) అబ్బే.

సరళ : సరి సరి. శేఖర్ గారు మొన్న శ్రీరామనవమికి హరిశ్చంద్రలో బాహుకుడు వేశాడు. దానిమీద మనవాడొకడు రివ్యూ చేశాడులే.

శేఖర్ : ఆంధ్ర నాటకరంగానికి మనవల్ల కావాల్సిన సహాయం ఎంతైనా వుందని రాశాడా!

సరళ : ఏం లేదు. శేఖర్ బాబుగారు రంగ్గ సన్యాసం చేస్తేనైనా నాటకరంగం బాగు పడుతుందేమోనని ఆ రాసినాయన అభిప్రాయం!

శేఖర్ : (లేచి సరళను పట్టుకోబోతూ) ఏయ్—సరళా!

[సరళ లేచి టేబిలు వెనక్కి పోయి తప్పించుకుంటుంది.]

సరళ : ప్రమాదం! ప్రమాదం! రక్షకరో రఘువంశ సుధాకరా!

[అంటూ రఘువెనక నిలబడుతుంది.]

శేఖర్ : క్షమాపణ కోరుకుంటావా లేదా?

సరళ : ఐనా నాటకరంగానికి నువ్వా మాత్రం సహాయమైనా చెయ్యకపోతే ఎలా శేఖరం?

శేఖర్ : ఆఁ యేఁ—

[మళ్ళీ సరళను పట్టుకోబోతాడు. రఘు, సుజాత విరగబడి నవ్వుతూంటారు. చివరకు శేఖర్ సరళ చెయ్యిపట్టుకు నిలబడతాడు. సరళ చెయ్యివదిలించుకోడానికి పెనుగులాడుతుంది.]

సరళ : శరణు శరణు. ఇంకెప్పుడూ అనను గా.

శేఖర్ : (చెయ్యివదుల్తూ) ఆఁ. అల్లా దారికిరా!

సరళ : (మణికట్టు సవరించుకుంటూ లేని గాంభీర్యంతో) నేనిప్పుడే బాత్ రూంలోకి వెళ్ళొస్తాను.

[వెళ్తుంది.]

శేఖర్ : (సోఫాకేసివస్తూ) నాటకాల్లో ఇలాంటివైనా పెట్టకేం?

సుజాత : మీ కు స్లిపట్లా?

శేఖర్ : నాటకాల్లో కొన్ని పాత్రలు రంగంమీదికెందుకు వస్తారో ఎందుకు వెళ్ళిపోతారో ఎవళ్ళకీ తెలీదు. ఆ వెళ్ళేముందు ఇప్పుడు రాణీ చెప్పినమాట కాస్త చెప్పిస్తే ఆ పాత్ర నిష్క్రమణ ఎంత నాచురల్ గా వుంటుందో చూడండి.

సుజాత : చాలా బాగుంది నీ సలహా.

రఘు : శేఖరం చెప్పేది కొంత నిజమే. పాత్రల ప్రవేశ నిష్క్రమణాల విషయంలోనే చాలామంది రచయితలు తప్పులో కాలేస్తూంటారు. ఏ కారణం లేకుండానే ఒక్కో పాత్ర లోపలి కెళ్ళిపోతూంటుంది. ఎందుకూ — మన నాటకంలో రెండో అంకంలో నాగతి చూడరాదూ. నువ్వూ ఆ రిహార్సలూ మాట్లాడుతూండగా 'క్షమించండి-ఇప్పుడే ఓ క్షణంలో వస్తాను' అంటూ పోవాలి నేను! ఎందుకో అక్కల ఏం కొంప మునుగుకుపోయే పనుందో నాకే తెలీదు!

శేఖర్ : రేపు నాటకంలో 'బాత్ రూంకి వెళ్ళొస్తా' నని కూడా అనేసెయ్.

సుజాత : అలాంటి exits అరడజను న్నాయి గాబోలి. అన్నిసారూ ఆ మాటంటే ప్రతి ప్రేక్షకుడూ ఓ డాక్టరై పోతాడు.

శేఖర్ : ఐనా పుస్తకంలో లేనిమాట నువ్వు ఛస్తేవాడవుగదా!

[రంగడు వస్తాడు]

రఘు : ఆ డ్యూటీ కూడా మనకెందుకోయ్. మనవల్లా మనకు నచ్చినా నచ్చకపోయినా మన పాలిట బహు నంగి వెనక పాత్రల్ని తల్లకిందులుగానో ఎల్లాగో నిలబెట్టడమే!

సుజాత : అదేమిటి—ఐతే ఈ వేషం నీకు నచ్చలేదా?

రఘు : సినిమాల్లో నే నా తత్వానికి భిన్నంగా వెనక దేవయ్య వేషాలు వేసివేసి ఛస్తున్నాను.

సుజాత : మరైతే ఎందుకు వేస్తున్నావీ వేషం?

శేఖర్ : వాళ్ళ డైరెక్టరుగారి నాటకాల పిచ్చి నీకు తెలీదూ? ఆయనమాట తీసెయ్యలేక ఈయన!

రంగడు : అయ్యా! ప్లేట్లూ అవీ అన్నీ సర్దిపెట్టాను. ఒక్కసారి చూసి రండి. ఓకే అంటే పట్టుకొచ్చేస్తాను.

[రఘులేచి లోపలికి వెళ్తాడు. రంగడు గబగబా లాగూ జేబులోంచి వుత్తరం తీసి శేఖర్ చేతుల్లో పెడుతూ—]

బాబూ బాబూ—ఈ వుత్తరం చదవండి. తొందరగా చదవండి బాబూ.

శేఖర్ : ఏమిటిది? ఏమిట్రా ఇది?

రంగడు : అమ్మగారు రాసిన వుత్తరాలు బాబూ. ఇది అయ్యగారికి. ఇదేమో నాకు రాశారు. చదవండి బాబూ మళ్ళీ అయ్యగారొచ్చేస్తారేమో.

[శేఖర్ రంగడి వుత్తరం చదువుతూంటాడు]

అమ్మయ్య మీరొచ్చార్స-నా ప్రాణం కాస్త లేచుకుంది. మీరు రాకపోతే నాపనే మూసో...అసలే బాబుగారు—

సుజాత : ఏం? ఏంమైంది?

శేఖర్ : (చదివేసి) ఓహ్! My God!

[లేచి కవరు చేతిలో వుంచుకుని రంగడి వుత్తరం వాడికిచ్చేస్తాడు]

[లోపల్నుంచి రఘు 'రంగా' అని కేక వేస్తాడు]

రంగడు : నే వెళ్తా బాబూ. ఎలా చెప్తారో ఏంచేస్తారో అంతా మీదే భారం!

[లోపలికి వెళ్తాడు]

సుజాత : ఏమిటి శేఖర్ - ఏంజరిగింది?

శేఖర్ : మీనాక్షీ గారి వుత్తరం! (కవరు ఆమెకిస్తాను) రఘుని వదిలేసి వెళ్ళిపోయింది!

సుజాత : ఏమిటీ — మీనాక్షి లేచి పోయిందా?

శేఖర్ : ఆఁ. పామరభాషలో లేచి పోయిందనే దానర్థం.

సుజాత : శేఖర్!

శేఖర్ : పైగా ఈ సంగతి వాడికి మనం చెప్పి ఈ వుత్తరం ఇవ్వాలట!

సుజాత : ఇది నేను నమ్మలేను శేఖర్... చాలా ఉత్తమురాలు! రఘు అంటే ప్రాణానికి ప్రాణంగా చూసుకుంటుంది కూడానూ!

శేఖర్ : అబ్బ - ఇవానువ్వు సైకాలజీలోకి దిగావంటే ఛచ్చామే. ముందు మన నెత్తినపడ్డ భారం చూడవయ్యే బాబూ. ఎలా ఈ సంగతి వాడికి చెప్పడం? ఏమిటి చెయ్యడం?

సుజాత : నాకు రేమీ తోచడంలేదు... కాని చెప్పక తప్పదుగా మరి... నెమ్మది నెమ్మదిగా చెప్పాలి - ఏదో మాటల ధోరణిలో మనిషికి అర్థమయ్యేట్లు చెయ్యాలి.

శేఖర్ : నువ్వు చెపావా?

సుజాత : నేనా? నేను-

శేఖర్ : అవును సుజాతా. నువ్వైతేనే కాస్త tactful గా చెప్పగలవ్ కూడానూ.

సుజాత : నువ్వుకూడా పక్కనుండి సాయం చెయ్యాలి మరి - ఏం?

శేఖర్ : తప్పకుండానూ...(కొత్త ఆలోచనతట్టి) ఈ సంగతి సరళకేం తెలియనీయొద్దు. చాలా మంచిపిల్లే గాని బడబడా వాగేస్తుంది.

సుజాత : శేఖర్! నువ్వు పక్కనే వుంటావుగదూ? లేకపోతే నన్నొక్కతెనీ

[రఘు వస్తాడు. చేతుల్లో ప్లేటతో ట్రే వుంటుంది. సుజాత గబగబా కవరు తన జాకెట్లో దోపి దాస్తుంది. శేఖర్ ఏం ఎరగనట్లు ఓపక్కకి పోయి సోఫా చేతిమీద కూర్చుంటాడు.]

—ఇంకా వుంది]

# మే లు కొ లు పు

నాన్న లేచిరి, అక్కయు, అన్న లేచె;
వచ్చెనదిగో పనిమనిషి పాచిచేయ,
తెచ్చినది పాలుగొల్లది, తెల్లవారె,
నిదుర లేర ! వాగించక నిదుర లేర !

బడికిపోవు వేళయ్యెను, పంతులయ్య గూడ
కేక వేసియు పోయె, పాడునిద్ర-
ఏమి బద్ధకమ్మది వీడనీయ దేమి?
నిదుర లేర! వాగించక నిదుర లేర ।

కడుగుకోరా మొగమునీవు వడిగ లేచి,
బడికి రమ్మనిపిలువంగ వచ్చినారు
పరుగు పరుగున, చూడరా బాలురరుగో!
నిదుర లేర! వాగించక నిదుర లేర!

అదిగో చూడు ! అక్కబడికి అన్నతోడ
పోవుచుండెను నీకన్న ముందు లేచి.
చదువెటుల వచ్చురా యిట్లు నిదురపోవ?
నిధుర లేర ! వాగించక నిదుర లేర !

అదిగో చూడు ! వీధిని జంగమయ్య కూడ
జోలిపుచ్చుకొనియు రాగ మాలపించి
పాడుచుండెను ముష్టికైవచ్చి, లేర
నిదుర లేర! వాగించక నిదుర లేర

ఎక్కముల పుస్తకమ్మది చక్కనిదియు
తెచ్చినారు నాన్నారు చూడు తెలుగు
వాచకమ్మదియు లేపుకొనెదరు నమ్మవేమి?
నిదుర లేర! వాగించక నిదుర లేర !

వడిగ కొట్టుచుండిరి గంట బడికి రమ్మ
టంచును గుడిగంటలుగను ఇంచుకంత
చెవికి వినిపించుటయు లేద! చిన్నవాడ!
నిదుర లేర! వాగించక నిదుర లేర !

కూలిపని చేసుకొనువారుగూడ
పోవుచుండిరి పసిపిల్లలతోడ,చూడు లేచి,
వయసులోన నీకును చిన్నవారు వారు
నిదుర లేర! వాగించక నిదుర లేర!! ★

జి. జె. రామశర్మ



# ప్రాణం కిమ్మతు

పాలంకి
వెంకటరామచంద్రమూర్తి

కోటిపల్లివద్ద గోదావరీ నదినిదాటి వెడితే లంక వస్తుంది ఆలంక దాటి వెడితే నది పాయవస్తుంది ఆ పాయదాటితే ముక్తేశ్వరం అనే గ్రామం ఎదురౌతుంది.

ముక్తేశ్వరంలో మూలాస్వామి అనే భూస్వామి ఒకడుండేవాడు గోదావరి లంకలో చాలా భాగం మూలాస్వామి వ్యవసాయం క్రిందే ఉండేది. లంకలో అతను పొగాకూ, మిరపకాయలూ పుచ్చకాయలూ, గుమ్మడిపళ్ళూ పండించేవాడు.

అతడు ధనవంతుడు గనుక పంటను ఐనకాడికి కళ్ళంలోనే అమ్మవలసిన అగత్యం లేదు ధర పెరిగే దాకా దాచి మంచిలాభాలకు అమ్మేవాడు ఈ విధంగా అతడు మరీ ధనవంతుడయ్యాడు

డబ్బు చేరినకొద్దీ అతనికి లోభిత్వం కూడా ఎక్కువైంది. దానధర్మాలమాట అటుంచి, కింద పని చేసే పాలేళ్ళకే, నౌకర్లకే వాళ్ల కష్టానికితగ్గ జీతా లిచ్చేవాడుకాదు

అతని పాలేళ్ళలో నారాయడనే వాడొకడుండేవాడు వాడు జబ్బలో పుష్టి, పనిలో నేర్పూ ఉన్నవాడు. వాడికి పూర్వులు చేసిన ఋణం నూటఇరవైరూపాయ లుండిపోయింది వాడు మూలాస్వామివద్దకు ఒకనాడువచ్చి, 'అయ్యా, నాఋణం తీర్చేసుకోడానికి బదులు ఇవ్వండి మీకు పాలేరుగా కుదిరి నౌకరీ చేస్తూ నెలకి పది రూపాయలు చొప్పున ఏడాదిలో తీర్చేసుకుంటాను,' అన్నాడు మూలాస్వామి, 'సరే' అని వాడికి సొమ్ము బదులిచ్చాడు.

ఏడాదీ అవడంతోనే నారాయడు 'మీ ఋణం తీరిపోయింది గనుక నాకు సెల విప్పించండి.' అన్నాడు.

'ఋణం ఎక్కడ తీరిందిరా? అసలు తీరిందిగాని వడ్డీ ఇవ్వనక్కర్లేదా?' అన్నాడు మూలాస్వామి.

'వడ్డీ ఎంత బాబూ?' అన్నాడు నారాయడు.

'అర్వై రూపాయలు. ఇంకా ఆరునెలలు పనిచేయవలసి ఉంటుంది' అన్నాడు మూలాస్వామి. నారాయడికి కష్టం తోచింది కాని చేసేది లేక ఆ ఆరునెలలూ కూడా పాలేరు తనానికి వప్పుకున్నాడు.

మృగశిరా ప్రవేశం ఔతుందనగా మూలాస్వామి నారాయణ్ణి వెంటబెట్టుకుని లంకలోకి వెళ్ళేడు. గోదావరికి వరద తగలడం చూచాడు 'నారాయడూ ఈ వరద తొందరగా వచ్చిందే?' అన్నాడు

'అడంగులో వర్షాలు కురిసినట్లున్నాయండి,' అన్నాడు నారాయడు

'ఎందుకైనా మంచిది. మనం మెరకలో పాక నొకదాన్ని వేసి అందులోకి పుచ్చకాయలూ, గుమ్మడిపళ్లూ, నాగళ్ళూ వగైరా పనిముట్లూ చేర్చేద్దాం పాకపని ఇప్పుడే మొదలెడదాం,' అన్నాడు మూలాస్వామి

మొదలెట్టేరు కాని చీకటిపడ్డా పాక పూర్తి కాలేదు 'రాత్రి ఇక్కడే ఉండిపోదాం. పొద్దు పొడవడంతోనే పని ప్రారంభించి పాక పూర్తిచేద్దాం' అన్నాడు మూలాస్వామి.

నారాయడు 'సరే' అన్నాడు. అలిసిపోయి ఉన్నారేమో ఆ రాత్రి లంకలో వాళ్ళకి బాగా నిద్రపట్టింది. తెల్లవారి చూసుకునే సరికి వరద పొంగి వచ్చి లంకలో చాలాభాగం మునిగిపోయి కనపడింది 'చూస్తావేం నారాయడూ, సరుకుని పాకలోకి జేర్చు!' అన్నాడు మూలాస్వామి

'నది ముంచుకొస్తోంది కామందూ వెంటనే ఇక్కడనుంచి మనం పరుగెత్తిపోయి పాయదాటి అవతల పడకపోతే ప్రాణాలు దక్కవు!' అన్నాడు, నారాయడు, అంటూ పరుగెత్తడం ప్రారంభించాడు.

మూలాస్వామి నారాయడికి మల్లే సన్నటివాడు కాకుండా ఆతడు పండించే గుమ్మడికాయలకు మల్లేనే పెద్దబొజ్జ కలిగిన స్థూలకాయుడు ఆగరోయ్, ఆగరోయ్, నన్ను కూడా రానియ్యి!' అంటూ వెనకాలే రొజుకుంటూ వెళ్లాడు.

ఇప్పుడు ముక్తేశ్వరంపాయ

# ★ ప్రాణం కిమ్మత్తు ★

మీద పెద్ద ఇనుపవంతెనను కట్టేరు. దానికి పూర్వం కఱ్ఱవంతెన మాత్రమే ఉండేది ఈ కథ జరిగిన కాలంలో ఆ కఱ్ఱవంతెన కూడా ఉండేది కాదు అడ్డంగా రెండు తాటిపట్టెలు మాత్రమే ఉండేవి. ఆ పట్టెలమీదనుంచి నడిచి వెళ్ళడమంటే అవి కదులుతూ ఉండడం వల్ల 'ఎక్కడ జారిపడిపోతామో!' అన్న భయం వేసేది.

నారాయడు నిర్భయంగా ఆ పెట్టెలమీద అడుగులు వేసుకుంటూ వెళ్లేడు. 'ఉండరా ఆగు కాస్త నా చెయ్యి పట్టుకో' అన్నాడు మూలాస్వామి

నారాయడు వెనక్కి వచ్చి కామందు చెయ్యిపట్టుకుని నడిపించుకు వెళ్లేడు వంతెన కింద వరదనీరు పుష్కలంగా వ్యాపించి, ఆ ప్రవాహవేగాన్ని చూసేసరికి మూలాస్వామికి వళ్లు తిరగడం ప్రారంభించింది. అతడు గజగజ వణుకుతూ 'నారాయడూ, నీకు పుణ్యముంటుంది. నీవు బలమైనవాడివి. నన్ను నడిపించి తీసుకువెళ్లడం కాకుండా నీ మూపున ఎక్కించుకుపోయి అద్దరిని చేర్చు! ప్రత్యుపకారం ఏది చెయ్యమంటే అది చేస్తాను!' అన్నాడు.

నారాయడు 'మీకు నేను ఇవ్వవలసిన వడ్డీ అరవైరూపాయలూ కొట్టెయ్యండి అంతకన్నా ప్రత్యుపకారం ఏమీ వద్దు' అన్నాడు

మూలాస్వామి 'సరే' అన్నాడు నారాయడు అతణ్ణి బుజాలపై ఎక్కించుకుని తాటిపెట్టెమీద మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్లాడు

మూలాస్వామి తలతిరక్కుండా కళ్లు మూసుకునేసరికి ఒక ఆలోచన వచ్చింది 'ఈ కాస్త మేరా మోసుకుపోయినందుకా వీడు అరవైరూపాయల వడ్డీనీ కొట్టెయ్యమంటున్నాడు. పది కాదు, పదిహేను కాదు, ఏకంగా అంతా చీదాగా చెల్లుపెట్టెయ్యమంటున్నాడు' అనిపించింది మూలాస్వామికి

'నారాయడూ' అని పిలిచాడు మూలాస్వామి

'ఏం బాబూ?' అన్నాడు నారాయడు

'పదిరూపాయలకన్నా తగ్గించుకోమనడం ధర్మం కాదురా. కాదంటే మరో ఐదురూపాయలు కొట్టేస్తాను మిగత నలభైయైదూ జీతంలో లెక్కచూసుకుందాం'! అన్నాడు మూలాస్వామి

నారాయడికి ఆ మాట వినేసరికి అసహ్యం వేసుకొచ్చింది 'నీ ప్రాణం కాపాడినందుకు పదిహేను రూపాయలేనా తగ్గిస్తానంటున్నావు! ఇంతకీ ఈ అప్పు అధర్మంగా పెంచిన వడ్డీగాని నువ్వు ఇచ్చిన సొమ్ముగాదుగా? నీ లోభిత్వం మండిపోనూ? నీ నిండు ప్రాణం విలువ పదిహేను రూపాయలేనా? నీ చచ్చుప్రాణాన్ని కాపాడి యేం ప్రయోజనం? నువ్వుపోతే నీవు కూడబెట్టినదంతా నీ వంశంవాళ్లు సుఖంగా అనుభవిస్తారు' అంటూ, వాడు తాటిపట్టెమ్మటే వెనక్కిపోయి మూపున ఉన్న మూలాస్వామిని ఉప్పుమూటలాగ లంకలోకి విసిరేశాడు

మూలాస్వామి వళ్లు దులుపుకుంటూ లేచి, 'వెళ్ళకురోయ్, మరో ఐదు కొట్టేస్తాను,' అని వంతెనమీంచి పోతూన్న నారాయణ్ణి ఆపబోయాడు నారాయడు వినిపించుకోకుండా తాటిపట్టె మధ్య దాకా పోయాడు

'మరో ఐదు కొట్టేస్తాను. మొత్తం పాతిక తగ్గిస్తాను' అన్నాడు మూలాస్వామి

నారాయడు వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు మూలాస్వామి వేలంపాటలోలాగ ఐదుచొప్పున ఎక్కించుకుంటూ వెళ్లేడేగాని, వడ్డీ మొత్తమంతా కొట్టేస్తానని అనడానికి ఆ పిసినారి మనసొప్పింది కాదు.

అతడి వేలంపాట నలభైయైదు దాకా వెళ్లేసరికి నారాయడు తాటిపట్టి అద్దరికి జేరుకున్నాడు మరు

# ★ పక్కింటి ఇల్లాలు ★

(32 వ పేజీ తరువాయి)

నేను అక్కడనే ఉన్నాను!

మా శారద అంతా చెప్పింది.

"అయిందీ! ఇట్లాంటి అఘాయిత్యమేదో జరుగుతుందని నాకు మొదట్నుంచీ తెలుసు శారదమ్మా నువ్వు ఏమైనా అనుకో! ఇది ఆ దెయ్యం చేసినపనే సందేహం అక్కరలేదు ఎంగుచాతనంటావా? మా డేళ్ళ క్రితం తహశీలుదారుగారి గోవర్ధన గొలుసుకూడా ఇట్లనే నిమషాలమీద మాయమైంది వాళ్లు ఎవరిమీదనో అనుమానాలు పెట్టుకుని, చివరకు దెయ్యం చేసినపనేనని నమ్మారు ఈ నెక్ లెస్ కూడా అదే తీసి వుంటోందని నా నమ్మకం. అది చేసేపనులు ఒకరూపాన ఉండవు శారదమ్మతల్లీ!" అని దీర్ఘాలుతీసింది సుభద్రమ్మగారు

మా శారద నోరు తెరుచుకున్నది, అంతా నిజమేకామోసునన్నట్టు - చివరకు నిటూర్పు విడిచింది

కాని నాకు సుభద్రమ్మగారి మాటలమీద రవ్వంత విశ్వాసం కుదరలేదు

పోలీసు రిపోర్టు ఇచ్చాను

"మీకు ఎవరిమీదనైనా అనుమానం ఉన్నదా సార్!" అన్నాడు సబ్ ఇన్స్పెక్టరు సుందర్రావు

'ప్చ్! ఎవ్వరిమీదలేదు" అని పెదవి విరిచాను.

"సాధ్యమైనంతవరకూ ప్రయత్నిస్తాను" అన్నాడు సబ్ ఇనస్పెక్టరు

ఇది జరిగిన దగ్గర్నుంచీ శారద ఇలు మార్చేసే తప్ప వీల్లేదని గట్టి పట్టు పట్టింది.

కాని నాకు ఆమె పట్టుదల కేవలం అర్థంలేనిదిగాతోచి, నచ్చ చెప్పేందుకు ఎంతో ప్రయత్నించాను కాని ఆమె నా మాటలు ఆలకించలేదు

ఆ మరునాడు ఉదయం మా శారద లేవలేదు తల నొప్పిగా ఉన్నదన్నది అమృతాంజనం నా చేతితో నే రాశాను తొమ్మిది గంటలకల్లా తలనొప్పి తగ్గినదన్నది కాని అదేం ఖర్మమో—సాయంత్రం మళ్ళా జడక వేసింది జ్వరమట ధర్మామీటరు పెట్టచూస్తే—నూట రెండు మీద నాలుగు పాయింట్లు ఉన్నవి. డాక్టరుకోసం పరుగెత్తాను.

డాక్టరువొచ్చి ఇంజక్షన్ ఇచ్చి వెళ్ళాడు.

ఆ రాత్రి సుభద్రమ్మగారు మా ఆవిడను చూసి పోవటానికి వొచ్చింది ఆమె కేవలం తాను వొచ్చిన పనికాగానే వెళితే బాగానే ఉండేది మా శారదలో లేనిపోని భయాల్ని కలిగించింది

"శారదమ్మా! నేను అనుకున్నంతా అయింది నిన్నగాక మొన్న నేమైనా ఆ నెక్ లేస్‌ను పొట్ట బెటుకుండా! ఇవాళ చూడు. ప్రొద్దున్నించీ నీ వొంట్లో బావుండలేదు సాయంత్రానికి జ్వరం పొంగివచ్చింది తెలవారేసరికి ఈ జ్వరం నిన్ను ఏ స్థితికి తెస్తుందో! నాకు భయంగా లేందమ్మా శారదమ్మా! ఇదంతా ఆ దెయ్యం ప్రభావమే! శారదమ్మా! నువ్వింకా చిన్నదానివు. సంసారసాగరంలో సగం దూరం వొచ్చినదాన్ని జీవితంలో 'మంచీ-చెడూ' అర్థం జీర్ణంచుకున్నదాన్ని నా మాట ఆలకించు. ఈ ఇంటిని సాధ్యమైనంత త్వరలో ఖాళీ చేసి మరో పేటలో ఇంకో ఇలును చూసుకోడం శ్రేయస్కరం. శారదమ్మా! ఇందులో నా స్వార్థం ఆవగింజంత కూడా లేదు నీలాంటి ఉత్తమ ఇల్లాలి పొత్తును వొదులుకోవడం నాకుమటుకు చచ్చే విచారంగాలేదూ! అయినా, నీ మేలు కోరి, నీ సంసారం క్షేమం కాంక్షించి—ఇట్లాంటి సలహా నివ్వటం పాతంగా, నిష్కల్మషంగా యివ్వాల్సి వొచ్చింది ఆ పైన నీ ఇష్టం శారదమ్మా!" అన్నది సుభద్రమ్మగారు.

ప్రక్క గదిలో ఉండి ఆ మాటల నన్నింటినీ పొలుపోకుండా విన్నాను.

నాకు అరికాలి మంట నెత్తికెక్కింది ఇందులో సుభద్రమ్మగారికి కొంత స్వార్థం వాస్తవంగానే ఉందని పించింది మా విషయంలో ఆమె ఇంత ఇంటరెస్టు కేవలం 'పరోపకారంగా' తీసుకుంటూన్న దన్న దాంట్లో నాకు కించిత్తుకూడా నమ్మకం చిక్కడం లేదు

నేను శారదతో ఖచ్చితంగా చెప్పాను. ఇల్లు ఎటాంటి పరిస్థితుల్లో కూడా మార్చటానికి వీల్లేదని నా దృఢ నిశ్చయానికి శారద ఏడ్చింది.

మరునాడు ఉదయానికి శారద జ్వరం చప్పగా తీసిపోయింది.

మా శారదకు దెయ్యాన్ని గురించి ఉన్న భయం కూడా కొద్దిగా దిగజారింది.

ఆ సాయంత్రం నేనూ ఒక స్నేహితుడూ వరండాలో కూర్చుని మాట్లాడుకుంటూ వుండగా—సుభద్రమ్మగారు మా ఇంట్లోకి వొచ్చింది పంచదార కోసం. మా శారద పంచదార ఇస్తానని చెప్పింది

'అయితే ఇంకా మీ నెక్ లెస్ ఆచూకీ తెలియలేదన్న మాట" అన్నాడు స్నేహితుడు సుబ్బారావు.

క్షణంలో ఆ ఉప్పెనలో ఆ తాటి పట్టెల వంతెనే కొట్టుకుపోయింది! అది చూసుకోకుండా మూలాస్వామి, 'నలభైమైదుకంటేనా? ఆశ కంతు ఉండాలి!' అన్నాడు ఆ లోగా లంక అంతటా జలమయమై అతడికి పీకెల దాకా నీరు చేరింది

'క్షణక్షణం వీడికి నా అవసరం లేందే గడవదు కదా! డబ్బుకి తికానాలేని వీడు భీష్మించుకు చక్కాపోయాడు! చెపుతాగా వీడి పని,' అనుకుంటూనే మూలాస్వామి గోదావరి తల్లితోబాటు సముద్రం చేరుకున్నాడు ★

# పక్కింటి ఇల్లాలు

మా సంభాషణ వింటూ తలుపు చాటునే నిలబడ్డది సుభద్రమ్మగారు.

"కాదండీ! రేపు ఉదయం చుట్టు ప్రక్కల ఇళ్ళు సోదా చేయాలని సబ్ ఇన్‌స్పెక్టరుగారు అన్నారు. అతనికి అనుమానం బయటనించి ఎవ్వరో దొంగలు కారని," అన్నాను కొంచెం బిగ్గరగా, సుభద్రమ్మగారికి స్పష్టంగా వినిపించాలని.

"మీ పిచ్చిగాని లేసిన వాళ్ళు ఇంకా ఇంట్లో పెట్టుకు కూర్చుంటారుటండీ!" అన్నాడు సుబ్బారావు.

"కూర్చోక పోతేయేం? ఇరుగు పొరుగూ ఇళ్ళవాళ్ళకు ఊళ్ళో ఎక్కడెక్కడ బంధువులూ, స్నేహితులూ ఉన్నారో తెలుసు కాని—వాళ్ళ ఇళ్ళు కూడా సోదా చేస్తారు"

"ఉహూఁ!"

మా ఈ సంభాషణంతా సుభద్రమ్మగారు సందేహం లేకుండా విన్నది. ఆమె తలుపు చాటునించి తర్వాత కదిలి పోతూండగా స్పష్టంగా చూశాను.

ఆ రాత్రి కూడా మా శారద పడుకొనే ముందు అరగంట బ్రతిమాలింది—ఇల్లు మార్చేందుకు ప్రయత్నాలు జరుపమని.

ససేమిరా వీల్లేదన్నాను.

ఇంకా సరిగా తెల్లవారక ముందే మా శారద నన్ను ఎంతో ఆదుర్దాగా లేపింది.

"ఏమిటి నీగోల" అన్నాను విసుగ్గా కళ్ళు పూంతం తెరవకుండానే.

"నెక్ లెస్ దొరికిందండీ!"

"ఆఁ!" గబుక్కున ముసుగు తొలగించాను.

"ఆ దెయ్యం నెక్ లెస్‌ను బ్రాయరుమీద వదిలేసిందండీ!"

"ఆఁ! నిజమా!...ఎట్లా?"

"ఏమో!"

ఆ గదిలోకి వెళ్ళి పరీక్షించాను. రాత్రి తలుపులు బిగించుకొనే పడుకున్నాము. కాని బ్రాయరుకు దగ్గరగా ఉన్న కిటికీతలుపు మటుకు కొద్దిగా తెరచి ఉన్నది.

ఈ పాటికి సుభద్రమ్మగారు కూడా వొచ్చారు—మా ఆనందంలో పాలుపంచుకొనేందుకు కాబోలు!

"దెయ్యం మనకు భయపడిందండీ!" అన్నది మా శారద సంతోషంతో!

"అవును" అన్నాను సుభద్రమ్మగారివంక చూస్తూ.

ఎందుకో సుభద్రమ్మగారు చిటుక్కున ముఖం చిట్లించుకున్నది ఆ పైన ఆమె 'పొయ్యిమీద కూర మాడిపోతూన్న'దని వెంటనే వెళ్ళింది.

ఆ రోజంతా సుభద్రమ్మగారు మా ఇంటి చాయలకే రాలేదు కారణం నాకు తెలియదు. మా ఆవిడకు తెలీదు. ఇట్లా మా ఇంటి మీద ఆమె అలుక బూనడం—ఇదే మొట్ట మొదటిసారి.

తర్వాత రెండు రోజులకే సుభద్రమ్మగారు ఇలు మార్చింది పండరీపురంలో బంధువుల ఇంటిప్రక్కనే అద్దెకు ఇల్లు తీసుకున్నదట

అకస్మాత్తుగా ఎన్నో యేళ్ళనించి ఆ ఇంట్లో ఉంటూన్న సుభద్రమ్మగారు-ఇల్లు మార్చటం ఆ వీధిలో అందరికీ తగని ఆశ్చర్యం వేసింది.

కాని నాకు వెయ్యలేదు.

కారణం ఏమిటో మా శారద ఆమెను అడిగి తెలిసికొంది ఇట్లా అన్నదట—

"ఏమిటోనమ్మా! శారదమ్మా! రెండు రోజుల్నుంచీ కలలో దెయ్యం కనబడి బెదిరిస్తూ వుంది. 'ఇల్లు ఖాళీ చేస్తావా? లేదా? లేకపోతే నీ కుటుంబాన్ని సర్వనాశనం చేస్తాను' అంటూంది. మీ ఇంటిని వొదిలి మా ఇంట్లో చేరింది నాకు చచ్చే భయంగా ఉంది వెంటనే మార్చేస్తున్నాను."

మా శారద సందేహంగా అన్నది:

"మనం కూడా ఇల్లు మారిస్తేనే మంచిదండి! ఆ ఇంట్లో చేరిన దయ్యం-వాళ్ళు లేకపోతే మళ్ళీ మన ఇంట్లోకి వొస్తుందేమో!"

మా శారద అమాయకత్వానికి నాకు పొట్ట పగిలే నవ్వు వొచ్చింది.

"ఒకసారి దయ్యం మనకు జడిసి పారిపోయిందంటే—మళ్ళా మనింటికి వొస్తుందా? రాదు. మనం ఇల్లు మార్చనక్కర్లేదు దెయ్యం పారిపోయిందిగా!" అన్నాను నేను 

# నాటివిందు-నేటిమందు

(5-వ పేజీ తరువాయి

పచ్చళ్ళకీ అదే, పిండివంటలకీ అదే, ఆఖరికి తలంటుకీ, 'భారసాల'నాడు చంటిబిడ్డ మొహం చూపడానికీ అదే వాడుతున్నారట ఖర్మ! ఈ కాఫీలొచ్చిపడ్డాయ్; యెక్కడెక్కడి పాలూ కాఫీ హోటళ్ళకే చాలటం లేగు ఇంకా వెన్నెక్కడిది? నెయ్యెక్కడిది?

పోనీ యిలాగూ తప్పటంలేదు; ఈ హోటలువాళ్ళు ఆ వనస్పతి కంపెనీ పేరైనా వుంచుతున్నారా అంటే, అదీ లేదు "అబ్బే! నెయ్యండీ-వెన్నకాచిన నెయ్యి!" అని దబాయిస్తాడుగాని "డాల్డా' అని వాడి నోటితో వాడు ఛస్తే ఒప్పుకోడు

పాడిపంటలున్న పల్లెటూళ్ళల్లో కూడా నెయ్యి కరువైంది. ఇంట్లోవున్న పాలూ పెరుగూ ఆడవాళ్ళే అమ్మిపారేస్తున్నారు, మగవాళ్ళకి తెలియకుండా, (తెలిసినా వాళ్ళేం చెయ్యగలరులెండి) ఎందుకనీ? అంటే ఏముంది, వాళ్ళకి మగవాళ్ళు డబ్బు లివ్వరుగనుక; వాళ్ళకి కావలసిన చీరలూ, నగలూ కొనుక్కోవాలిగనుక ఇవన్నీ మగవాళ్ళనడిగితే కొనిపెట్టరా?

"ఉఁహుఁ" అంటారు వాళ్ళు

అబద్ధం! చీరెలూ, సారెలూ కొనిపెట్టకుండా యేమగాడుంటాడు?—మరి యెందుచేత?

. వాళ్ళకి "నచ్చిన" చీరెలు కావాలి; "నలుగురూ మెచ్చే" జాకెట్లు కావాలి.

—ఈ "నచ్చటం", "నలుగురూ మెచ్చటం" అనే పదాలు ఆడవాళ్ళ విషయంలో వున్నంత ప్రమాదకరంగా యింకెక్కడా వుండవు. అసలు ఆడవాళ్ళకి మనస్ఫూర్తిగా నచ్చటమనేది యెన్నడెక్కడా జన్మానా వుండగు అనవాకాలగతి తప్పనడిచి, యేనాడైనా యే చీరగుడ్డో రవికగుడ్డో నచ్చినా, ఆ పక్కింటి సుబ్బాయమ్మో, యెగురింటి వెంకాయమ్మో "ఎబ్బే" అన్నారంటే .... గోవిందా—గోహోవిందా!

"క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్ .." అందుకే మన బ్రతుకు లిలా యేడుస్తున్నాయి.

*   *   *

భోజనప్రసక్తి వస్తే శ్రీనాథుడికి మహదానందం, అతి శ్రద్ధ! అదీ, యిదీ అనకుండా రకరకాలూ వర్ణించేస్తాడు, ఆ పద్యాల్లోనే అంతటితో సంతృప్తిపడక, "ఇవ్విధంబున నాజ్యధారాప్రవాహంబును, శర్కరాక్షోదసికతాంచితంబును, బాయసాపూప సంపన్నంబును, కలమాన్నపూర్ణంబును, ద్రాక్షాగక్షీర క్షేద్రపుంఞ్జేక్షుఖండమండితంబును, రంభానారికేళ ఫలశాకపాక సాకల్య కల్యంబును, మాడబరసావళీ పానక ప్రచురంబును, శరచ్చంద్రికా ధవళదధిసమృద్ధంబునైన భోజనోత్సవంబు . అస్మన్మనోరథవిహారఘంటాపథంబుపై ప్రవర్తిల్ల" అంటూ వచనంలో కూడ మరొక్కమారు తనివి తీర్చుకుంటాడు.

భోజన మొక్కటేనా? భోజనం వడ్డించే అరటాకులు కూడా అతి శ్రద్ధగా వేయిస్తాడు సుమా!

"మొగి విరిసి కఱకు గూడక

మగులక వెడలుపును నిడుపు బసిమియుగల లే

జిగురరటాకులు పెట్టిరి

బిగ బిగ వడ్డేవి యాజ్ఞ దివ్యపురంధ్రుల్"

ఆకుల చివరు త్రుంచరాదట; పెళుసుగా వుండకూడదు, పగిలిపోరాదు, పొడవు, వెడల్పు, పసిమి వుండాలి—ఇంతెందుకు? చూస్తే ముద్దొచ్చేటట్లు వుండాలి

.. నిజమే! అలాంటి భోజనం గురించి తల్చుకుంటుంటే నాకు నోరూరుతోంది, పదార్థాలన్నీ పూర్తిగా తినలేకపోయినా, కనీసం రుచి చూడాలనిపిస్తోంది కాని యేం ప్రయోజనం? ఎక్కడుందా భోజనం! శ్రీనాథుడితోనే వెళ్ళి పోయింది...

మహానుభావుడు! ఎన్ని గ్రంథాలు వ్రాసి ఎంత కీర్తి సంపాదించుకున్నా, యిలాంటి భోజనాలు పెట్టించి మూట కట్టుకున్న పుణ్యంతో సరిరాదు! 

# కొందరు సభ్యుల పేర్లు

(11 వ పేజీ తరువాయి)

భాగ్యలక్ష్మి (డోకిపర్రు, కృష్ణాజిల్లా) 258 అని సింగరాజు పద్మావతి (డోకిపర్రు కృష్ణాజిల్లా) 259 కొజా రమేషు (చిలుకలూరి పేట, గుంటూరుజిల్లా) 260 కల్యాణం వెంకటరమణరావు (కర్లపాలెం, గుంటూరుజిల్లా)

261. నీలిదా త్రిన్ శ్రీ సత్యాంజనేయ వరప్రసాదు (మంగళగిరి గుంటూరుజిల్లా) 262 అబ్దుల్ అజీజ్ (కామారెడ్డి నిజామాబాదుజిల్లా) 263 పోలూరు కృష్ణప్రసాదరావు (గుంటూరు) 264 చక్రవర్తుల సుబ్బలక్ష్మి (గంగేరు, తూ॥ గో॥) 265 మండ సుబ్బలక్ష్మి (శ్రీకాకుళం జిల్లా) 266 ఈ ఆశాకుమారి (బెంగుళూరు) 267 వాడేవు జయశ్రీ (బిలాస్ పూర్) 268 పింగళి కమల (కలకత్తా) 269 ఎమ్మరాజు జ్వాలాదుర (భీమడోలు, ప॥ గో॥) 270 ఎం వాణి (కూడూరు నెల్లూరు జిల్లా) 271 యజ్ఞరాతు రాములు (కోమటపలి, శ్రీకాకుళం జిల్లా) 272 పి కృష్ణారెడి (చెన్నూరు, కడపజిల్లా) 273 పిల్లా సత్య వీరప్రసన్నం (కాకినాడ, తూ॥ గో॥) 274 వసంతరావు భారతి (వాలేరు) 275 పి ఋం విజయకుమారి (మదరాసు) 276 ఎస్ శ్రీవత్స (అనంతపురము) 277 పి భారతీదేవి (కడప) 278 మాళన భాస్కరరావు చౌదరి (బంటపేట, తూ॥ గో॥) 279 కొప్పూరి జనార్దన భీమసేన లకుమళి రామారెడ్డి (ఊబలంక తూ॥గో॥) 280. శిటభాస్కర శ్రీరామమూర్తి (ఖండవల్లి ప॥ గో॥)

281 బొబ్బిలి విజయలక్ష్మి (కాతరము కృష్ణాజిల్లా) 282 ఎస్ కె సుందరరామన్ (చిత్తూరు) 283 వేణుగోపాలకృష్ణమూర్తి (తడిపత్రి, అనంతపురము జిల్లా) 284 ఎ రామనారాయణరెడి (అనంతపురము) 285 రాచర్ల వెంకట బదరీనాథ్ (బొంబాయి) 286 ఝాన్సీ లక్ష్మిబాయి (ఇలందు ఖమ్మంజిల్లా) 287 చెరుకూడి రఘునాథరావు (పోలూరు గుంటూరు జిల్లా) 288 దండం ప్రభావతి (బాపట్ల, గుంటూరుజిల్లా) 289 ఆత్మకూరి రామానుజం (కాకినాడ తూ॥ గో॥) 290 ఎం. డి జయావుద్దీన్ (కామారెడ్డి నిజామాబాదు జిల్లా) 291 దిడ్లజేకబ్ పాల్ (గుంటూరు) 292 పి. శ్రీనివాసరావు (వనపర్తి మహబూబ్ నగర్ జిల్లా) 293 భోగిరెడ్డి వేంకట సుబ్బలక్ష్మి (విజయపురి దక్షిణం, గుంటూరు జిల్లా) 294 రాయప్రోలు వేంకటకృష్ణశాస్త్రి (గాయత్రీపురం, కృష్ణాజిల్లా) 295 రావికంటి శ్రీ వెంకటరమణమూర్తి (బరంపురము ఒరిస్సా) 296 శ్రీపతి శ్రీమన్నారాయణమూర్తి (తెనాలి గుంటూరు జిల్లా) 297 పాలకోడేటివరప్రసాదం (విశాఖపట్నం) 298 అయ్యగారి సీతామహాలక్ష్మి (హుబ్బలి, మైసూరుజిల్లా) 299 పాపోలు విరరాజేశ్వరి (అకివీడు ప॥ గో॥) 300 పి భూపతి (చిన్నతిప్ప సముద్రం, చిత్తూరుజిల్లా)

301 రామచంద్రుని వెంకట సుబ్బమ్మ (మొగల్లూరు నెల్లూరు జిల్లా) 302 మంగిమూడి ఇందిర (మచిలీపట్నం కృష్ణాజిల్లా) 303 పద్మశాభని పాండురంగరావు (నాగులపాడు గుంటూరు జిల్లా) 304. యం శాలిని బాబురావు (హైదరాబాదు) 305, వై. వి, సీతామహాలక్ష్మి (గుంటూరు) 306 వి,వి శ్రీరంగ పద్మ (అద్దంకి గుంటూరు జిల్లా) 307 సిష్ట్లా రాజకుమార్ (కాకినాడ తూ॥ గో॥) 308 మూర్తి రామకృష్ణ (ఏలూరు) 309 తల్లాప్రగడ పూర్ణచంద్ర కిషోర్ (గుంటూరు) 310 వెలికేటి సరస్వతి (పూనా) 311 ముదిగొండ విశ్వేశ్వరరావు (ఈమని గుంటూరుజిల్లా) 312 కలగర అంజనాదేవి (ఏలూరు) 313. ఉప్పలూరు లక్ష్మి (చీరాల గుంటూరుజిల్లా) 314 ఎం రఘునాద్ (మదరాసు) 315. కుసులూరి పళ్లంరాజా (కొత్తపలి తూ॥ గో॥) 316 కోటం రాజా శ్రీ మహాలక్ష్మి (తెనాలి) 317 పెద్దూరి మారుతీ అప్పారావు (బాపట్ల గుంటూరు జిల్లా) 318 విష్ణ్వాప్రగడపూర్ణానందకరుణకుమార్ (అంబాజిపేట తూ॥ గో॥) 319 మరూరు స్వర్ణలత (మార్కాపురం కర్నూలుజిల్లా) 320 చింతడ అరుణ (హైదరాబాదు) ★



"అయ్యయ్యో! కుర్చీ విరిగిందా? పోన్లే—బాగుచేయిస్తాను"



# సినిమా

ముడిఫిలిం గిరాకీతో పరిశ్రమ కటకట లాడుతోంది; దరఖాస్తుదారులతో ఫిలిం ఛేంబర్ కిటకిట లాడుతోంది. వచ్చిన కోటాలో వాటాలు సర్దలేక, ఇవ్వని కోటాలగురించి సర్ది చెప్పలేక కోటా కమిటీ వారు అవస్థ పడుతున్నారు. ఈ క్లిష్ట సమయంలోనే డబ్బింగు చిత్రాలధాటి మితి దాటి కోటాలాఅని నాలుగు లక్షలు పెట్టి చిత్రాలు తీస్తున్నవారు తీరుబాటు చేసుకు విమర్శిస్తున్నారు. డబ్బింగుకు మాత్రం డబ్బు ఖర్చు కాదా; వాళ్ళకిమాత్రం డబ్బు చేదా అని ఈ వర్గంవారు 'ఘర్షిస్తు'న్నారు. ఆమాటకొస్తే, డబ్బింగు చిత్రాలకి ఫిలిం బాగా తక్కువ ఖర్చు అవుతుంది 'సౌండ్ నెగటివ్' ఉంటేచాలు. కాబట్టి దేశానికి విదేశీ ద్రవ్యమారకం పరిస్థితి ఉద్రి

## వార్తావరణం

క్తత ఉపశమించే పర్యంతం, డబ్బింగ్ నే ప్రోత్సహించడం మంచిదని ఒక అతివాది దబాయించారు. పరిశ్రమలోకి 'కొత్త రక్తం' రావాలని, కొందరు అన్నారు. దానికిదా ముహూర్తం అని మరికొందరు! దానికి హడావుడేమిటనీ వాళ్ళకోసం జనబాహుళ్యం వెయ్యికళ్ళతో ఎదురు తెన్నులు కాచుకు కూచోలేదని ఈ ప్రతివాదుల తాత్పర్యం. వాదవివాదులలో, చూసే వారికి 'ధుమా' అనిపించేలా ఇలా ఉమ్మారాలు వేస్తున్నా, అసలు పరిస్థితి, డబ్బు పెట్టి నిర్మాణంలో దిగిన నిర్మాతలపరిస్థితి ఏమాత్రం సరదాగాలేదు. 'వచ్చే నెల' నాలుగో వారంలో ఫలానావారి కోజుకి - పెద్ద ఆర్టిస్టులు వచ్చేటట్టు 'క్రిందటి నెల' తొలివారంలోనే ఖరారు చేసుకున్న నిర్మాతలు కొందరు, 'ఈ నెల' అంతా ముడిఫిలింకోసం తిరిగి, తిరిగి కాల్షీట్లు వాయిదా వేసుకుంటున్నారు.

ఇలా ఉన్న వార్తావరణాన్ని ఢిల్లీనించి షికారొచ్చిన కొత్త కోటాలవార్త ఇప్పుడు మరింత ఉద్రిక్తం చేసింది. ఈ సారి కోటాలనేవే ఉండవనీ మూడు నెలలపాటు దిగుమతులే రద్దు చేస్తారనీ ఆ మధ్య అన్నారు; ఇప్పుడు ం శేషం ఒక 'వాదం' అల్లా ఇంకో అడుగువాగి, అక్టోబరునుండి ఏప్రిల్ వరకూ - అర్ధసంవత్సరం పూ దిగుమతి సదుపాయాలు ఉండవన్న సూచనే. ఎగుమతులు విశేషంగా చేసే పరిశ్రమలకే ముడిసరుకులు తెచ్చుకోడానికి అనుమతి యిస్తారట. ఈ స్థితిలో ముడిఫిలిం వారికి అనుతుందో అవదో చెప్పలేమని వణిజులు భయపడుతున్నారు. అవకపోతే, అవకపడే అవస్థలు ఊహించి అంతా కంగారు పడుతున్నారు...

* * *

ఈ నెల 8 న, ఎగుమతి దిగుమతి వ్యవహారాల ఛీఫ్ కంట్రోలర్ శ్రీ ఎన్. ఎస్. బిల్‌గ్రామి మద్రాసువచ్చినప్పుడు దక్షిణ భారత స్టుడియో యాజమానుల సంఘం అధ్యక్షుడు శ్రీ నాగిరెడ్డి ఆయన గౌరవార్థం విజయా గార్డెన్స్‌లో విందుచేశారు. శ్రీ బిల్‌గ్రామి ముడిఫిలిం కొరవల ఏర్పడ సమస్యగురించి మంచిమాటలు విన్నారు. విదేశాలకు చిత్రాలను పంపే నిర్మాతలమట్టుకైనా దిగుమతి కొరత ఇబ్బందిలేకుండాచేయ ప్రయత్నిస్తామని ఆయన చెప్పారు. ★



భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి 'పార్వతీ కల్యాణం'లో కుచలకుమారి.

## జగన్నాథ్ కొత్తచిత్రం

చంద్రికా పిక్చర్స్‌వారి 'శ్రీ కృష్ణ రాయబారం' చిత్రనిర్మాణం జూలై 30 న పారమౌంట్ స్టుడియోలో ఆరంభమైంది. శ్రీకృష్ణపాత్రను రఘురామయ్య నిర్వహిస్తున్నారు. తొలిసెట్ మీద (విదురుడి ఆశ్రమం) చిత్రించిన సన్నివేశాలలో రఘురామయ్య, విదురుడుగా గాదేపల్లి రామయ్య పాల్గొన్నారు. ఇతర నటులు అద్దంకి శ్రీరామమూర్తి, గుమ్మడి వెంకటేశ్వరరావు, హేమలత, మాలతి.

ఈ చిత్రానికి మాటలూ, పాటలూ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు వ్రాస్తున్నారు. పద్యాలను తిరుపతి వెంకటకవుల 'ఉద్యోగ విజయాల'నుండి తీసుకొని ప్రయోగిస్తున్నారు. రఘురామయ్యగారు కాక, మాధవపెద్ది సత్యం, పి. బి. శ్రీనివాస్ పాడుతారు. సంగీత దర్శకుడు అశ్వత్థామ.

చెప్పుకోతగ్గ గొప్ప దర్శకులలో ఒకడైన జగన్నాథ్ చాలకాలం తరువాత తిరిగి ఈ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. జగన్నాథ్ పదిహేనేళ్ళనాడు తీసిన హాస్య రస ప్రధాన చిత్రాలు 'భలేపెళ్లి' 'తారుమారు' చూసినవాళ్లకి ఇప్పటికీ గొప్పగా కనిపిస్తాయి. తరిమిలా ఆయన దర్శకత్వం వహించిన రెండు తమిళ చిత్రాలు 'విశ్వామిత్ర', 'వైరమలై', విశేష ప్రజాదరణ పొందాయి.

ఈనాడు అర్థరహితమైన మాటలు అనిపించే 'ఆశయాదర్శాల'పట్ల జగన్నాథ్‌కుగల గురి, గౌరవం, పట్టుదల ఎరిగినవాళ్లు, ఆయన మీదగల గౌరవాభిమానాల కొద్దీ సినిమా సీమలో 'భీష్మాచార్యుడు' అని వ్యవహరిస్తుంటారు...

## 'పార్వతీ కల్యాణం'

భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి పౌరాణికం 'పార్వతీ కల్యాణం' చురుకుగా తయారవుతోంది. దర్శకుడు భాస్కరరావుగారు దీన్ని కన్నడంలో కూడా తీస్తున్నారు. తెలుగు చిత్రానికి మాటలూ పాటలూ సముద్రాల జూనియర్ వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు కమల్ ఘోష్.

ఇందులో శివపార్వతులుగా బాలయ్య, కృష్ణకుమారి. నాగయ్య, గుమ్మడి, రమణారెడ్డి, మిక్కిలినేని, సంధ్య, రాగిణి కుచలకుమారి మొదలగువారు పాల్గొంటున్నారు.

ఛాయాగ్రహణ దర్శకుడు కమల్ ఘోష్.

భాస్కరరావుగారి కొత్త సాంఘిక చిత్రం నిర్మాణం, ఇది పూర్తి కాగానే ఆరంభం అవుతుంది. దానికి పాటల రికార్డింగు ఇదివరకే పూర్తిఅయింది. సంగీత దర్శకుడు రమేష్ నాయుడు.



దుర్గా ఫిలింస్‌వారి 'పతిభక్తి' చిత్రంలో శివాజీ గణేశన్, సావిత్రి.

## గుళ్లో పెళ్లి

చేతనా ఫిలింస్‌వారి సాంఘిక చిత్రం 'గుళ్ళో పెళ్ళి' ప్రకాష్ స్టుడియోలో తయారవుతూంది. కృష్ణకుమారి, సూర్యకళ, నిర్మల, రమాదేవి, రమణమూర్తి, బాలయ్య, రమణారెడ్డి, చదలవాడ మొదలగువారు పాల్గొంటున్నారు. రచయిత అనిసెట్టి. సంగీతం రమేష్ నాయుడు. దర్శకుడు కె. ఎస్. ప్రకాశ్ రావు. నిర్మాత గిరిబాబు.

## 'పులి చేసిన పెళ్లి'

ప్రజాదరణ పొంది, రాష్ట్రపతి బహుమతిని అందుకొన్న మలయాళ చిత్రం 'నాయరు పుట్టి పులివాలం'ను శరత్ పిక్చర్స్‌వారు 'పులి చేసిన పెళ్ళి' అనే పేరుతో తెనిగించి ఈ నెలాఖరున విడుదల చేస్తున్నారు. రచయిత రావూరి సత్యనారాయణ. సంగీతం రాజమాణిక్యం పిళ్లె. నిర్మాత పోలవరపు సూర్యప్రకాశరావు. ★

చిత్ర సమీక్ష:

# ప్రభా ప్రొడక్షన్స్ వారి 'ఆడపెత్తనం'

మామూలుగా సినిమాల్లో, కథపాలు కొంత, ఆ పాలలో నీళ్ళపాలు కొంత ఉంటుంది. నిజమైన రాజహంసని తీసుకొచ్చి సినిమాలో 'నీరూ పాలూ' వేరు చేయమంటే, అది నవ్వేస్తుంది "ఇది పాలు కాదు, కాఫీ! నీరుందని తెలుసుకోడం తప్ప విటిని విడదియ్యడం బ్రహ్మతరం కాదు; సైంటిస్టులు కూడా ఏం చెయ్యలేరు" అని చెప్పి, ముక్కు చప్పరించి చక్కా పోతుంది.

కొడుకథల బగీమీద వెళ్ళే 'ఆడపెత్తనం' (ప్రభా ప్రొడక్షన్స్) చిత్రంలో ఈ పని చేసిపెట్టడానికి సైంటిస్టులుగాని బ్రహ్మగాని—ఆఖరికి హంసకూడా—అవసరం లేదు. 'విశ్రాంతి' కాలమే ఈ రెండిటికీ సరిహద్దు. విశేషం ఈ రెండిటినీ అందంగా కలపడంలో దర్శకుడూ, ఎడిటరూ చూపిన నేర్పు; ఆపైన, యువ్వల రంగమ్మ పాత్రధారిణి, ఈ కథకు సూత్రధారిణి అయిన శ్రీమతి కన్నాంబ ప్రజ్ఞ ఈ రెండూ, ఈ చిత్రానికి చెప్పతో తగ్గ ఆకర్షణను చేకూర్చాయి మీరీ చిత్రాన్ని తప్పక చూడబోవడానికి గల ముఖ్యమైన మూడు కారణాలలో పైరెండూ పోగా మూడోది కుటుంబరావు నటన.

రంగమ్మ అనే ఆవిడకు పోలెడు ఆస్తి, అంతకు తగ్గ టెక్కు, మెతక మొగుడూ సవతి కొడుకూ సొంతకూతురూను. కొడుకు కృష్ణ పట్నంలో చదువుకొంటున్నాడు. సెలవ తీస్యగానే బయలేరివస్తాడు బండిలోంచి కథలోకి దిగీదిగుతూనే తనపాలిట అంజలీదేవి రాధను చూసి, ఛేటే ఏర్పాటుచేసుకొని మరీ యింటికెళ్లాడు రాధ కృష్ణులు చిన్నప్పటే ప్రేమించుకున్నారు. పెళ్ళాడాలనుకుంటున్నారు కాని రాధ బీదపిల్ల. కృష్ణకి వేలువిడచిన మేనమామకూతురే 'వేలు' విడవడం అంటే సుతరామూ గిట్టని రంగమ్మగారు, పదివేలు కట్నం యిస్తేగాని, పెళ్ళి వల్ల కాదని శాసిస్తుంది

రాధాకృష్ణులు యుగళగీతాలు మొదలు పెట్టకుండానే అపశ్రుతి పలుకుతుంది. అప్పుడు రాధ తండ్రి ఊళ్లో మోతుబరి రామయ్యకు పొలం తెగనమ్మి డబ్బు పుట్టిస్తాడు కాని, కథ అన్యథా ఉందని తెలియక, రాధని తనే చేసుకోవాలన్న దురాశతో రామయ్య ఆ డబ్బుని రాత్రికి రాత్రి దొంగిలించి, మరీ పొగరుమోతుబరిగా ప్రవర్తిస్తాడు

ఇక లాభంలేదని, కృష్ణ బరితెగించి, రాధ మెడలో తాళికట్టేసి, తనకుటుంబంతో తెంచుకుపోతాడు మామగారింటికి. 'పెద్దరికంవల్ల యింతపని జరిగినా ఎవరింట్లో వారు సుఖంగానే కాలక్షేపం చేస్తూ ఉంటారు

* * *

మురారీ దేశాయిగారు గనక ఈ చిత్రాన్ని చూడవస్తే, ఈ ఘట్టంలో లేచి నించుని, 'నే చెప్ప లేదూ, కొ పేల అడుగుల లో భారతీయ చిత్రాలను గూడ తెమల్చి వేయవచ్చునని' అని అనేవారు అయనే కాదు, ఎవరైనాసరే అలా అంటే పొరబడే కానక తప్పదు

ఈ చిత్రం రెండో రీలులో, రేలంగి సరదాకో కబుర్లు చెబుతూ కథలో జొరబడతాడు ఇలాంటి ఇబ్బంది వస్తుందని ఆయనకు (బహుశా స్క్రిప్టు చూచినందువల్ల) తెలిసి ఉండాలి కథ తిటపటాయిస్తున్న వేళ రేలంగి పుంజుకుంటాడు ఇందులో రేలంగి పేరు లోకం మంచి టోకరాసురుడు రంగమ్మగారింట అద్దెకు దిగి, మెల్లిగా అల్లుడై గద్దె ఎక్కుతాడు. మెల్లిగా డబ్బు కాజేస్తూ, దాన్ని బస్తీలో ఉన్న సినీ వాంప్‌కు జారేస్తూ ఉంటాడు. అతనికి పెద్ద మొత్తాలు అవసరమైన వేళకు, మామగారు ఆ సినీ భార్య పేర రాసి, మంచం పట్టి, పోతాడు దుడుసుదనంతప్ప గడుసుదనంలేని అత్తగారు అల్లుడి చేతిలో కీలుబొమ్మ అయిపోయింది అతగాడు, తన పేర ఆస్తికి 'పవర్ ఆఫ్ అటార్నీ' రాయించుకుని, డబ్బుని కుటుంబ గౌరవాన్నీ జాయింటుగా నాశనం చేసేస్తూ ఉంటాడ రైతుల్ని నానా బాధలు పెడతాడు. అతనూ, అందాకా ఏం తోచక కూచున్న మోతుబరి రమయ్యా ఏకమౌతారు ఇటు పనిలేక దిగులుగా ఉన్న కృష్ణ, రైతులను వెనకేసుకుని బరిమీద కురుకుతాడు. రైతులకోసం సహకార పద్ధతిపై బ్యాంకు పెడతాడు వారికి విద్య నేర్పుతాడు. చివరి సీనుకోసం సాముగరిడీ కూడా నేర్చుతాడు (హెచ్చు వడ్డీకి) అప్పులిచ్చి సన్నకారు రైతులను కాలికింద అదిమిపట్టే వడ్డీ వర్తకుడు, ఊరి మోతుబరి అయిన రమ

> **'ఆడపెత్తనం'**
>
> నటులు నాగేశ్వరరావు, రేలంగి, ముక్కామల(?) , పెరుమాళ్లు, అల్లు రామలింగయ్య, కుటుంబరావు, బాలకృష్ణ బొడ్డపాటి కృష్ణారావు, అంజలీదేవి, కన్నాంబ, రాజసులోచన, సూర్యకళ, ఛాయాదేవి.
>
> రచయిత పినిశెట్టి శ్రీరామమూర్తి సంగీత దర్శకులు సాలూరి రాజేశ్వరరావు, వేణు
>
> దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు నిర్మాతలు వై. నారాయణస్వామి, ఎం వెంకటరామదాసు



26 7-58 తేదీన విజయవాడ రేడియో కేంద్రమునుండి, హిందీ మహావిద్యాలయం, వారు సమర్పించిన "అప్ కా ఖాదిమ్" అను హిందీ రూపకమందు పాల్గొన్న నటీనటులు. ఎడమనుంచి—శ్రీ దాసరి కృష్ణమూర్తి, హరిప్రసాద్, కుమారి బి జయప్రద, వేమూరి రాధాకృష్ణమూర్తి (నిర్వాహకులు) శ్రీమతి కె అండాళమ్మ, ఎ. ఎం. వెంకటాచార్యులు, ఎస్. టి. పి. రామకృష్ణమాచార్యులు.




ఆర్. ఆర్. పిక్చర్సు వారి

# కార్తవరాయుని కథ..

డైరెక్షన్.. రామన్న

కథ, మాటలు.... ముద్దిపల్లి సూరి.

పాటలు........దేవులపల్లి కృష్ణశాస్త్రి

సంగీతం.. జి.రామనాథన్. అశ్వత్థామ

సంయుక్త దర్శకుడు.. ఐ.యస్. మూర్తి








వైణిక విద్వాంస కారైకుడి సాంబశివ అయ్యర్ ఆగస్టు 6 వ మద్రాసులో కాలధర్మం చెందారు. వారి వయస్సు 70 సంవత్సరాలు దాదాపు పదవయేటనే వీణాపాణి అయిన సాంబశివ అయ్యర్ 69 ఏళ్లపాటు సోదరులతో కలసి సంగీత ప్రపంచాన్ని పాలించారు శివగంగా, పుదుకోటై సంస్థానాలలో ఆస్థాన వైణికులుగా ఉన్నారు కర్ణాటక వాద్యసంగీతంలో రాష్ట్రపతి సన్మానం అందుకొన్న ప్రథమ విద్వాంసుడు ఈయనే

య్యకూ, అతని జోలికి పోకుండా బ్యాంకు ధర్మమా అని స్వతంత్రంగా ఉండగలుగుతున్న రైతులకూ భీకర నిశ్శబ్ద సంగ్రామం– ఈనాడు మనదేశంలో పల్లె పల్లెలా జరుగుతున్నది—జరుగుతుంది రైతుల సంఘీభావాన్ని సహించలేక సంఘాన్ని నాశనం చేసి, భావాన్ని (కృష్ణని) వెళ్లగొట్టడానికి ప్రయత్నిస్తాడు రామయ్య 'ఆడపెత్తనం అనర్థం' అని ఋజువు చెయ్యబోతున్నాడో లేక నిజంగానే దుష్టుడై డబ్బు అపహరిస్తున్నాడో తెలియనివ్వకుండా అంచాకా నటిస్తూ వచ్చిన అల్లుడు లోకంకూడా ఈసారి అఘాయిత్యానికి వడిగట్టి, అత్తగారి ఆస్తినంతటిని తెగనమ్మిపోజూస్తాడు.

తన ఉనికివల్ల కథ అటూ ఇటూ అవుతుందేమోనన్న సద్భావంతో అనేక సన్నివేశాలలో జోక్యంచేసుకోని కృష్ణ ఈసారి మటుకు ఉభయపక్షాలూ కర్రలతో కొట్టుకున్నాక గట్టిగా కలగజేసుకుని దుష్టుల్ని వకాలంలో దండిస్తాడు

దుష్టుడైన లోకం తన తప్పుకి తలుపు చాటున బోలెడు సిగుపడి పశ్చాత్తాపపడి, మురిపించి మురిపించి మరీకలుస్తాడు గ్రూపు ఫోటోలోకి అనర్థాలకు కారణమైన ఆడపెత్తనం, వంటింటికి పరిమితం అవడం మంచిదని రంగమ్మగారు అంగీకరిసుంది. అప్పటినుంచీ సుఖంగా ఉంటారు. దంపతులు కారమ్సు ఆడుతూ, రంగమ్మగారు పిండి వంటలు చేస్తూ,

అంజలీదేవి, నాగేశ్వరరావు, గుమ్మడి వంటి నటుల ప్రజ్ఞకు, ఇందులో పాత్రలు చిన్నవైనా, ఉన్న అవధులలో సాధ్యమైనంతగా వారు పాత్రలను ఒప్పించారు ఎప్పుడూ మంచివాడి పాత్ర ధరించే రేలంగి ఈసారి మంచిచెడ్డల సరిహద్దురేఖమీద సాగినా ఇటీవలి చిత్రాలలోకన్న హుషారుగా నటించాడు ఈ చిత్రం మొత్తంమీద అందరినీ మెప్పించగల ఇద్దరునటులు కన్నాంబ, కుటుంబరావూను కుటుంబరావుకు చాలా కాలం తరువాత, సమగ్రంగా రూపురేఖలు దిద్దనపాత్ర లభించింది ఒకవంక నవ్విస్తూనే మరోకవంక ప్రేక్షకులలో జాలికలిగించే శిల్పం ఇందులో వుంది దాన్ని ఈనటుడు మెచ్చతగరీతిన సద్వినియోగంచేసుకున్నాడు పెరుమాళ్ళు నటించిన భూమిక పాతదే అయినా, ఆయన నటన, ఆ వ్యక్తిని ప్రేమపాత్రుణ్ణి చేస్తుంది ఈ చిత్రంలో సుపరిచితం అనిపిం ఇతర పాత్రలు, సన్నివేశాలూ కూడా ఎబ్బెట్టుగా, కొన్ని చిత్రాలలోవలె జుగుప్సకలిగించకుండా, మితి తెలిసిన దర్శకుడు సుబ్బారావుగారిచేతిలో దర్శనీయంగా భాసించాయి

కొంత మితిమీప్పినవి సంభాషణలే. మొదట్నుంచి చివరదాకా హుషారుగా సాగినా, అశ్లీలాలు, హాస్యవచనాలవలె ఫాన్సీడ్రెస్ వేసుకు తిరిగాయి. పదేళ్ళ తరవాత రెండర్థాలమాటలు మెండుగా వినిపించాయి ఇవి మినహాయిస్తే మిగతా సన్నివేశాలలో రచన నిండుగా, పాత్రోచితంగా మితంగా ఉంది

సంగీతం రాజేశ్వరరావుగారి అసంఖ్యాక అభిమానులకు గొప్పగా చెప్పుకోతగ్గ కానుక అనిపించకపోయినా వింటున్నంతసేపూ హాయిగా వినబడింది ఛాయాగ్రహణం దీనికి అమూల్యాభరణం కాదు ★

# తెలుగు చలన చిత్రాలు

శ్రీ ఎ నాగేశ్వరరావుగారు తెలుగు చిత్రాల స్థాయిగురించి వెలిబుచ్చిన అభిప్రాయాలు (ఆంధ్ర వారపత్రిక ఆగస్టు 6 వ తేదీ సంచిక) అన్నీ సమంజసంగా ఉన్నాయనిపించలేదు మన దేశంలో తెలుగు చిత్రాలస్థాయి, ఇతర భాషాచిత్రాలకన్న మెరుగేననడం నిర్వివాదాంశమే ఎందుకంటే, వీటిలో కొంతవరకూ సహజత్వం ఉంటుంది హిందీ చిత్రాలు ఎక్కువగా మనవికాని కథలతో, అపరాధ పరిశోధనలతో, తుక్కు రకపు రోతపుట్టించే 'క్రయిం' దృశ్యాలతో ఉంటున్నాయి.

ఇక ఇంగ్లీషు చిత్రాలస్థాయి వేరు వాటి ఫక్కీ వేరు వారు తీసినట్లు మనవారు ఎప్పుడూ తియ్యలేరు మనం చాలాముందంజవేసి, వారు అసలు వెయ్యకుండా ఆగినాసరే వారి చిత్రాలు ఎంతో సహజంగా ఉంటాయి అదే చిత్రాలకు ముఖ్యంగదా. మనవారు చిన్నా పెద్ద విషయాలెన్నిటినో నిర్లక్ష్యంచేస్తారు

ఉదాహరణగా వర్షం కురుస్తున్నప్పుడు తీసే ఒక సన్నివేశం తీసుకుందాం. మన చిత్రాలలో వర్షం రెండు మూడు చ॥ జగ



కీ॥ శే॥ శ్రీ యర్రా సుబ్రహ్మణ్యం

సూపర్వైజరు, వైజాగ్ సుగర్ & రిఫైనరీ లిమిటెడ్, అనకాపల్లి ఏప్రిల్ 28న వాల్తేరు కే, జి ఆసుపత్రిలో మరణించిరి వయస్సు 37 సం॥లు వరసులు వీరి అకాలమరణము, వీరి అశేష మిత్రబృందమునకు, బంధువర్గమునకు అశనిపాతము 5 గురు పుత్రులు, భార్య వీరి మరణమునకు మిక్కిలి చింతిసున్నారు భగవంతుడు వీరి ఆత్మకు శాంతి నిచ్చుగాక!




# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

## మిమ్మల్ని రోజంతా హాయిగా మరియు సువాసన వెదజల్లుతూ ఉంచుటలో సాటిలేనిది

వహోత్సాహమునిచ్చే, పరిమళముగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరు వాడితే తీక్షణమైన ఎండతో చికాకు కలిగించే వాతావరణములో కూడ మీకు చల్లగా, హాయిగా ఉంటుంది ఈ మెత్తని పౌడరును ఒళ్లంతా రాసుకొంటె, చెమట వలన కలిగే చికాకు లేకుండా మీరు రోజంతా ఉత్సాహముగా మరియు హాయిగా ఉంటారు రోజంతా హాయిగా ఉండుటకు ఎల్లప్పుడూ పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరునే వాడండి

చీస్‌బ్రొ-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు ఎస్ అమెరికాలో సంస్థాపితము)



ఉచితపుస్తకము. "*Lovelier with Pond's*' అనే సౌందర్యమును గురించిన ఇంగ్లీషు పుస్తకము కావాలని వ్రాయండి దానిలో ముఖవర్చస్సు మరియు సౌందర్యరక్షణను గురించి ఎన్నో ఉపయోగకరమైన సలహాలు ఉన్నాయి. 52 నయాపైసల తపాలాబిళ్లలు పంపుతూ ఈ అడ్రసుకు వ్రాయండి: పి ఓ బాక్సు 1612, డిపార్టుమెంట్ 26 టి బొంబాయి 1.



సంగీతావారి 'ఇంటిగుట్టు'లో ఎన్. టి. రామారావు, రేలంగి, స్టాన్లీ, జగ్గారావు, సుబ్రహ్మణ్యచౌదరి.

ముల మేరకంటే ఎక్కువ పడదు. ఆదేశాంతరాలా దుంభవృష్టిగా పడుతుంది. అవతల ఏమీ ఉండదు. ఇదేమిటనుకుంటారు ప్రేక్షకులు. ఇలాటివి సహజంగా కనిపించేలా తీయడానికి పెద్ద అభివృద్ధి ఏమీ అవసరంలేదు. కొంచెం ఆలోచించాలి. కొంత కష్టపడాలి. ఇది ఇంగ్లీషు చిత్రాలలో చూడండి. ఉ॥ బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్ లో జపాన్ జనరల్ హెడ్ క్వార్టర్స్ దగ్గర వర్షం కురిసినప్పటి దృశ్యంలాటిది మనవారు ఎప్పుడు తీస్తారు!... ప్రేక్షకుడు యిచ్చే డబ్బు సమానమే-మేలు చిత్రాలకీ తక్కువ వాటికీకూడా. అటువంటప్పుడు ఏ చిత్రం సహజంగా ఉంటుందో దాన్నే చూడాలనుకుంటాడు. అంతేకాని, మనం లోగడ బ్రిటిష్ హయాంలో ఉండడం వల, వాళ్ళ సంస్కృతిమీద మోజువల్లా కాదు వాట్ల ప్రాముఖ్యం. వారి నాగరికత, సంప్రదాయాలూ మనకి నచ్చడం అసలు కాదు. వాటిలో అన్ని అంశాలూ సున్నితంగా అందంగా ఉంటాయి. ఇక మనం అలా తీయలేకపోవడానికి, మనదేశం వెనకబడి ఉండడం కారణం కాదు. 'పురోభివృద్ధి' మాత్రమే చిత్రాలను బాగు చేయలేదు. సాధ్యం అయిన వాటినికూడా మనవారు నిర్లక్ష్యంతో అసహ్యంగా తీసి పాడు చేయడంవల్లనే మన చిత్రాలు పాశ్చాత్య చిత్రాలకు తీసికట్టు.

మనం గొప్పవాళ్ళం అనుకున్నప్పుడు, ఇతరుల స్థాయిని, అభివృద్ధినీ కూడా పరిశీలించాలి.

ఎస్. డి. ఎల్లాజోస్యుల, (కలకత్తా).

## రేలంగికి సన్మానం

సుప్రసిద్ధ హాస్యనటుడు శ్రీ రేలంగి వెంకట రామయ్యను విజయనగరం పౌరులు ఇటీవల సన్మానించారు. 'చెంచులక్ష్మి' శతదినోత్సవ సందర్భంగా, రేలంగి అక్కడకు వెళ్ళినప్పుడు జూలై 19న స్థానిక మాజిస్ట్రేటు శ్రీ ఎ. ఎ. ఆర్. మూర్తి అధ్యక్షతన ఆకాశపువారి పాఠశాలభవనంలో సభ జరిపారు. ప్రధానోపాధ్యాయుడు శ్రీ బి. గురువులు రెడ్డి స్వాగతం చెప్పారు. రేలంగి ప్రతిభాసంపత్తిని ప్రశంసిస్తూ సన్మానపత్రం చదివి సమర్పించారు. జిల్లా అడిషనల్ మాజిస్ట్రేటు శ్రీ భోజరాజు మొదలగువారు మాట్లాడారు. అనంతరం రేలంగి సన్మానానికి సముచిత సమాధానం యిచ్చి కృతజ్ఞత తెలియజేశారు.

## 'కాత్తవరాయుని కథ'

ఆర్. ఆర్. పిక్చర్స్ వారి భారీ జానపద చిత్రం 'కాత్తవరాయుని కథ' నిర్మాణం పూర్తికావచ్చింది. వచ్చేనెలలో విడుదల చేస్తున్నారు. సావిత్రి, కన్నాంబ, గిరిజ, బాలసరస్వతి, ఇ. వి. సరోజ, ఎన్. టి. రామారావు, రమణారెడ్డి, ముక్కామల, కె. వి. ఎస్. శర్మ, రాజనాల, పద్మనాభం, బాలకృష్ణ మొదలగువారు ఇందులో పాల్గొంటున్నారు.

సంభాషణలు ముద్దిపట్ల సూరి, పాటలు దేవులపల్లి కృష్ణశాస్త్రి వ్రాశారు. సంగీత దర్శకులు జి. రామనాథన్, అశ్వత్థామ.

ఛాయాగ్రహణం రాజాబాదర్, దర్శకత్వం రామన్న నిర్వహించారు. సహాయ దర్శకుడు ఐ. ఎన్. మూర్తి. ★

## ఆసియా ఆఫ్రికా చలనచిత్రోత్సవం

ఆగస్టు 20 నుండి సెప్టెంబరు 8 వరకు ఢిల్లీలో ఆసియా ఆఫ్రికా చలనచిత్రోత్సవాలు జరుగబోతున్నాయి దాదాపు 4[illegible] దేశాలు ఇందులో పాల్గొంటున్నాయి.

మనదేశం తరఫున ఎ. వి. ఎం. వారి 'భాభి,' చిత్రాన్ని, 'కాశ్మీరఉత్సవం,' 'కాల్ ఆఫ్ ది మౌంటెన్స్' అనే రెండు డాక్యుమెంటరీలను ప్రదర్శిస్తారు.

ఉత్సవచిహ్నంగా ఆసియా ఆఫ్రికా తీరరేఖతో ఒక గోళాకృతిని రూపొందించారు.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press. 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.